# ఆవేదనలు - అంతరంగాలు



పోట్లూరు సుబ్రహ్మణ్యం

మహీధర్ పబ్లికేషన్స్
పూలతోట వీధి, కోవూరు–524 137,
నెల్లూరు జిల్లా, A. P.

Sravanthi Book Series - 1

March, 1991

Avedanalu - Antarangalu
By
POTLURU SUBRAHMANYAM, M.A.,
Post Box No. 47
Achari Street,
Nellore-524 001,
A. P.

Publishers :
MAHIDHAR PUBLICATIONS,
Poolathota Veedhi,
Kovur-524 137,
Nellore Dt., A P.

Price :
Rs. **25-00**

Cover Design :
RAJI

Printers :
Sri Venkateswara Press,
Nellore-1.

# అంకితం



డాక్టరు బెజవాడ గోపాలరెడ్డిగారికి

# ఒ క మా ట



'కథ' అనేది మానవ సమాజంలో "భాష" తో పాటే పుట్టిందని చెప్పవచ్చు. ప్రాచీన నాగరికతలన్నిటిలోనూ, కథా సాహిత్యానికి విశేష ప్రాధాన్యం ఉంది.

ఆ ప్రాచీన కథారూపమే - నేటి 'కథానిక'కు మాతృక. అయితే 19వ శతాబ్దంలో యూరప్‌లో ఆవిర్భవించిన 'కథానిక' లేక 'చిన్నకథ' క్రమేపీతనకు తానై ఒక స్వతంత్ర రూపాన్నీ, ప్రతిపత్తినీ సంతరించుకుంది. ఒక వాస్తవ సంఘటనను ఇతివృత్తంగా తీసుకుని, దానిని పాత్రలద్వారా, పరిస్థితుల చిత్రణ ద్వారా విశ్లేషించడం, నేటి కథానిక స్థూలస్వరూపం. జీవితాన్నీ, కల్పననూ కలబోసి, పాఠకునిలో స్పందన కలిగించడం దానిలక్షణం.

తెలుగులో 'కథానిక' వయస్సు సుమారు ఎనభై ఏళ్లు. ఈ సుదీర్ఘ కాలంలో యిది ఎన్నో ఉద్యమాలకూ, ప్రభావాలకూ లోనౌతూ, పాఠకులలో సామాజిక స్పృహరగిల్చడంలో ఎప్పటి కప్పుడు తనవంతు కర్తవ్యాన్ని నిర్వహిస్తూనే వచ్చింది. అయితే, ఇటీవలి కాలంలో దీని ప్రాబల్యం తగ్గుముఖం పట్టడం బాధాకరం. కథా ప్రచురణకు పత్రికలే శరణ్యం కావడం, ఆ పత్రికలు కేవలం

వ్యాపారాత్మకం కావడం - ఈ దుస్థితికి దారితీసినా, తెలుగు కథా నిక ఈ ఒడుదుడుకుల్ని తట్టుకుని నిలబడగలుగుతుందనే నమ్మకం పోగొట్టుకోనక్కరలేదు. పరిస్థితులకు తల వంచకుండా మంచి కథల్ని వ్రాసి, ఎలాగో అడపాదడపా ప్రచురించ గలిగిన నిబద్ధత కలిగిన రచయితలు ఇంకా ఉండడమే ఈ ఆశాభావానికి అధారం.

* * *

మంచి కథలు వ్రాయాలనే ఆసక్తి, శక్తి కలిగిన పోట్లూరు సుబ్రహ్మణ్యంగారు తమ తొలికథా సంపుటాన్నిప్పుడు ప్రచు రించారు. ఈ సంపుటిలో పది కథలున్నై. కొత్త రచయితలకు మామూలుగా ఎదురయ్యే ప్రలోభాలకులోనై, ఏ లైంగిక. భయా నక కథలో వ్రాయకుండా, వాస్తవ జీవితంలోని సాధారణ సన్ని వేశాలనూ, సమస్యలనూ ఇతివృత్తాలుగా తీసుకుని, ప్రయోజన కరమైన కథలల్లడం సుబ్రహ్మణ్యంగారిలో మనకు కనిపించే పెద్ద సుగుణం. ఇది ఎంతైనా అభినందించ దగిన గుణం.

ఇందులో మొదటి కథ మానవతకు సంబంధించింది. లేత మనసులో ఏర్పడే చిన్నచిన్న PREJUDICE ఎలా కరుడుగట్టి పెద్ద వయసులో పగగా మారతాయో, మానవత్వాన్ని ఎలామరుగు పరుస్తాయో చిత్రించారిందులో రచయిత. 'అక్కా' అని పిలిచి ప్రేమించిన కుర్రవాడు పగ తీర్చుకోడానికి ఇలాంటి దారి వెత కడం సహజమా? అని కొందరు అనుమానించినా, మన సమా జంలో అక్కడక్కడా యిలాంటి వ్యక్తులున్నా, యిలాంటి సంఘ టనలు జరిగినా అశ్చర్యపడ నక్కరలేదు.

రెండవ కథ - వ్యక్తుల్లో ఉండే మూఢనమ్మకాలను గురించి. అవి SCRUTINY కి నిలబడవు; అయినా అవి బలీయమైనవి. ఇందులో చివరికిజరిగినసంఘటనయాదృచ్ఛికమే(COINCIDENCE) అయినా, ఆ నమ్మకాలను నిజం చేసిందా అనిపిస్తుంది. వీటిని రచయిత సమర్థిస్తాడని నేననుకోను. కాని ఇందులో కనిపించే DRAMATIC IRONYని మాత్రం తోసివేయలేము.

మరో కథ - రాజారావనే ఒక మధ్య తరగతి ఉద్యోగస్తుడి జీవిత విశ్లేషణ. ఆర్థిక పరిస్థితులనే గానుగలోపడి, మనుషుల కోరికలూ, సరదాలూ ఎలా నలిగిపోతాయో, సున్నితమైన వ్యంగ్య ధోరణిలో చెప్పారు రచయిత. నేటి వాస్తవానికిది ప్రతిబింబం. అలాగే తరువాత కథకూడా. బలహీనుల జీవితాలు బలవంతుల ఆట వస్తువులని మరొకసారి నిరూపిస్తుంది. నేటి సామాజిక న్యాయానికిదొక మచ్చు తునక.

'ఐరావతమ్మ' అనే కథలో ఆమె లావుతగ్గడానికి కొండ త్రావు ప్రయోగించిన వైద్యం చాలాకొత్త తరహాది. మరో కథలో, డబ్బు సంపాదించ డానికి కొందరు ఆడపిల్లలు చేసే మోసాలను చిత్రించారు రచయిత. ఇలాంటి వ్యక్తులూ, సన్నివేశాలూ ఈ రోజుల్లో కోకొల్లలు. మన ఆర్థిక వ్యవస్థ ప్రసాదించిన కుక్క మూతి పిందెలివి (FREAKS).

చివరి కథలో, దయ్యాలను గురించి మనలో ఉన్న అంధ విశ్వాసం మీద మంచి దెబ్బతీశారు రచయిత. దయ్యాల వెనుక ఉన్న మనుషుల్నీ, వాళ్ళ దయనీయమైన జీవితాల్నీ బయట

పెట్టారు. అయితే వాళ్ళ సమస్యకి ఆత్మహత్యే పరిష్కార మార్గమా? అనే సందేహం మాత్రం పాఠకునికి కలగక మానదు.

ఏమైనా, వైవిధ్యం కలిగిన ఇతివృత్తాలనూ, విభిన్న వర్గ జీవితాలకు సంబంధించిన సమస్యలనూ ఎన్నుకుని, చక్కని కథల్ని సృష్టించినందుకు సుబ్రహ్మణ్యం గారిని అభినందించాలి.

* * *

మరొకమాట - రచయిత శిల్పాన్ని గురించి ఈ కథల్లో మనకెక్కడా అనవసరమైన వర్ణనలూ, (పాత్రలద్వారా) గంభీరో పన్యాసాలూ వినిపించవు. చెప్పదలచుకున్న దానిని నిరాడంబరంగా, సూటిగా చెప్పడంలో రచయిత కృతకృత్యులయ్యారు. ఈ రచయిత మీద మొపాసా, ఓ హెన్రీ నీడలు కొద్దిగా కనిపిస్తాయి. కాని వాళ్ళ అనుకరణ మాత్రం కనిపించదు. మంచి రచయితకు కావలసిన స్పందన, విశ్లేషణా, వాటిని అక్షర రూపంలో పెట్టగలిగిన విన్నాణం, సుబ్రహ్మణ్యం గారిలో విరివిగా ఉన్నాయి. ఆయన మరిన్ని కథలు వ్రాసి, తెలుగు కథా సాహిత్యాన్ని సంపన్నం చేయాలని మనం అడగనూవచ్చు, చేస్తారని ఆశించనూ వచ్చు.

మదరాసు,
5—3—91.

- జగ్గయ్య -

# నా మాట



## ఎందరో మహానుభావులు
## అందరికీ వందనాలు

నా కథలు పత్రికలలో పడటం మొదలయినప్పటినుంచీ ఆ కథలు ఏనాటికయినా పుస్తక రూపంలో రావాలనే కోరిక ఉండేది. అది ఇంత కాలానికి నెరవేరింది.

నా మొట్టమొదటి కథల సంపుటిని రాజకీయ ప్రముఖులు, ఉత్తరప్రదేశ్ మాజీ గవర్నరు అయిన డాక్టరు బెజవాడ గోపాల రెడ్డిగారికి ఇవ్వాలని అనాడే నిర్ణయించుకొన్నాను. కారణం డాక్టరు బెజవాడ గోపాలరెడ్డిగారు ఒకవైపు రాజకీయ రంగాన ఎంత ప్రసిద్ధులో, సాహితీ రంగాన కూడా అంతే ప్రసిద్ధులు. సాహితీపరంగా వారు ఈమధ్యనే అమెరికా తెలుగువారి ఆహ్వానం మీద వెళ్లిరావడంతో వారి సాహిత్యం భారతదేశం ఎల్లలు దాటింది. బాల్యంలో వారి పేరు పదేపదే వింటున్నా తరువాతి కాలంలో సాహితీపరంగా పుంఖాను పుంఖాలుగా వారి కవితా సౌరభాలు వెలువడటం, వాటిని నెల్లూరు, కో.వూరు గ్రంథాలయాలలో కూర్చొని ఆఘ్రాణించడంతో సాహితీ పరంగా వారిమీద నాకు విపరీతమైన అభిమానం, గౌరవం కలిగాయి. తరువాత నా మొదటి కథల సంపుటిని వారికి అంకిత

మిద్దామనే ఉద్దేశంతో వారి అనుమతికోసం వారిదగ్గరకు వెళ్లాను. పెద్ద-చిన్న, ప్రముఖుడు-అప్రముఖుడు, పరిచితుడు-అపరిచితుడు అనే భేదభావం లేకుండా అందరితో ఆప్యాయంగా మాట్లాడడం వారి గొప్ప గుణమని గ్రహించాను. ఇది గొప్పవారికి సహజ గుణమేమో. వారు నాపుస్తకాన్ని అంకితం తీసుకొనడానికి అంగీకరించినందుకు వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేసుకొంటున్నాను.

ఇకపోతే ఈ పుస్తకానికి ప్రముఖ సినీనటులు, సాహితీవేత్త, మాజీ ఎం. పి. అయిన కళావాచస్పతి శ్రీ కె. జగ్గయ్య గారు 'ఒకమాట' శీర్షికన తొలిపలుకులు వ్రాయడం నామనసుకో వింత అనుభూతిని, నాకలానికో కొత్త శక్తిని ప్రసాదించాయి. జగ్గయ్యగారు విశ్వకవి రవీంద్రునాథ ఠాగోర్ రచించిన వంగ కవితల్ని తెలుగులో అనువదించిన 'రవీంద్రగీత' చదవకుండా ఉంటే నాకు వారి కలానికున్న శక్తిని గ్రహించే అవకాశం, అది విరజిమ్మిన భావావేశాల్ని పదిలపరచుకొనే అదృష్టం కలిగేది కాదేమో. వారు భారతదేశం గర్వించదగ్గనటులు. నాయకుని పాత్రలు వేసింది తక్కువే అయినా, మిగతా సినిమాలలో ప్రతి నాయకుడిగా హీరోలను డామినేట్ చేసి తన కారెక్టర్‌లకొక ప్రతిష్టను, ఒక గుర్తింపును, ఒక సుస్థిర స్థానాన్ని ఏర్పరచుకొన్నది. ప్రతి ఒక్కరికీ తెలిసిందే. వారు అభ్యుదయ భావాలతో నిర్మించిన 'పదండి ముందుకు' సినిమా సోవియట్ రష్యాలో ప్రదర్శింపబడడంతో కళాకారునిగా వారి కీర్తి ఎల్లలు దాటింది. వారితో మాట్లాడిన మొదటి రోజే వారు కళాకారునిగానే కాక

వ్యక్తిగా కూడా ఉన్నతులని గ్రహించాను. వారు నా మొదటి కథల సంపుటికి తొలిపలుకులు వ్రాసినందుకు మనఃపూర్వకంగా వారికి కృతజ్ఞతులు తెలియజేసుకొంటున్నాను.

ఈ సందర్భంగా నా కథలను విరివిగా ప్రచురించి ప్రోత్సహించిన ఆంధ్రప్రభ వీక్లీ ఎడిటర్ శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు గారికి, వారి పత్రికా సిబ్బందికి, స్వాతి జంట పత్రికల ఎడిటర్ శ్రీ వేమూరి బలరామ్‌గారికి, వారి పత్రికా సిబ్బందికి వినయపూర్వకంగా నాకృతజ్ఞతలు తెలియజేసుకొంటున్నాను. మరియు నా కథలను తమ పత్రికలలో ప్రచురించి నన్ను ప్రోత్సహించిన ఆంధ్రజ్యోతి, ఆంధ్రభూమి, ఆంధ్రపత్రిక, మయూరి వీక్లీ ఎడిటర్లకు, యువ, భూమి, జ్యోతి, విపుల మంత్లీ ఎడిటర్లకు నా మనఃపూర్వక కృతజ్ఞతలు తెలియజేసుకొంటున్నాను,

అంతేగాక నన్నెప్పుడూ సాహితీపరంగా ప్రోత్సహించే మిత్రులు శ్రీ కె. వి. సుబ్రహ్మణ్యం, శ్రీ ఆర్. శ్రీశైలం, శ్రీ దంపూరు రామకృష్ణగార్లకు నాకృతజ్ఞతలు. నా బాల్య గురువు, ప్రముఖ కవి శ్రీ మోనాగారికి కృతజ్ఞుడను.

ఈ సమాజమొక చిక్కు ప్రశ్న. అనేక మతాలతో, విభిన్న వర్గాలతో, వింతమనస్తత్వాలతో, విచిత్రమైన మనుషులతో నిండి ఒకరికొకరు సామాజిక సంబంధాలు కలిగిన సాలెగూడు లాంటిది ఈ సమాజం. ఇందులో సమస్యలకు కొదువలేదు.

ఇకపోతే నాకథల గురించి నేను చెప్పుకోవడం నా సాహితీ పురోభివృద్ధికి మైనస్ పాయింటు అవుతుందని, పాఠకులు చెబితే ప్లస్ పాయింటు అవుతుందని నమ్మేవాణ్ని గనుక పాఠకుల నిర్దుష్టమైన అభిప్రాయాలకోసం, సహేతుకమైన విమర్శలకోసం సదా ఎదురుచూస్తుంటాను.

ఎందరో మహానుభావులు. అందరికీ వందనాలు.

నెల్లూరు, మీ,

తే 6-3-91. పోట్లూరు సుబ్రహ్మణ్యం

చిరునామా

పోట్లూరు సుబ్రహ్మణ్యం, ఎం. ఏ.,

పోస్టుబాక్సు నెం. 47.

ఆచారి వీధి,

నెల్లూరు–524 001 (ఆంధ్రప్రదేశ్)

# ని వే ద న

రచయిత ఎంత సమర్థుడైనా అతని రచనలు ప్రజల్లోకి రానిదే అతనికి గుర్తింపు రాదు. ఆ సదుద్దేశంతోనే రచయిత శ్రీ పోట్లూరు సుబ్రహ్మణ్యం గారి కథల్లో ఓపది ఎన్నుకొని ఈ కథా సంపుటాన్ని వెలువరిస్తున్నాము. నేడు పాఠకుల్లో నవలల కున్న ఆదరణ కథా సంపుటాలకు లేదన్న విషయం మనందరికీ తెలిసిందే. కాని అప్పుడప్పుడూ కొన్ని కథా సంపుటాలు వెలువడు తూనే ఉన్నాయి వాటిలో కొన్ని నిదానంగా ప్రజాదరణ పొందు తూనే ఉన్నాయి అయితే అవి చాలాతక్కువ.

ఈ కథా సంపుటం వెలువరించడంలో సదుద్దేశం రచయిత కొకస్ఫూర్తి, అతని రచనల కొక గుర్తింపు కలిగించడమే గాక పాఠకులు ఎలా స్పందిస్తున్నారన్నది తెలుసుకోవడం కోసమే. ఇది ముందు ముందు రచయితకు ఎంతో ఉపయోగపడు తుందని మా నమ్మకం.

పెద్దలు, ప్రముఖ రాజకీయ నాయకులు. సాహితీవేత్త, డాక్టరు బెజవాడ గోపాలరెడ్డిగారు దీనిని అంకితం స్వీకరించడం ఒక ఎత్తయితే, అనమాన నటనా దురంధరులు, సాహితీవేత్త, కళా వాచస్పతి శ్రీ కొంగర జగ్గయ్యగారు తొలిపలుకులు వ్రాయడం మరొక ఎత్తు. నా ణేనికి రెండు వైపులులా అవి ఈ పుస్తకానికి ఒక ప్రతిష్టను, గుర్తింపును కలుగ జేసాయని మేము భావిస్తు న్నాము. వారికి మా వినయ పూర్వక కృతజ్ఞతలు తెలియ చేసు కొంటున్నాము.

అంతేగాక రచయితను ప్రోత్సహించాలనే సదుద్దేశంతో లాభాపేక్షలేకుండా అతితక్కువ ఖర్చుతో పుస్తకం ముద్రించి ఇచ్చిన నెల్లూరు శ్రీ వెంకటేశ్వర ప్రెస్ యజమాని శ్రీ యన్. రాజా రావు గార్కి, వారి అబ్బాయి శ్రీ విజయ నాగారాజారావుగార్కి కృతజ్ఞులము. అదేవిధంగా ఈ పుస్తకానికి అందంగా ముఖచిత్రం వేసి ఇచ్చిన శ్రీ రాజీగార్కి, దాన్ని ఇంకా అందంగా ముద్రించి ఇచ్చిన నయాగరా బుక్స్ అధినేతలకు కృతజ్ఞులము. అవసర సమయంలో ఋణ సహాయ మందించిన స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా వారికి కృతజ్ఞులము.

మా కర్తవ్యాన్ని నిర్వహించాం. పుస్తకాన్ని మీ ముందుం చాం ఈ పుస్తకాన్ని ఆదరించడం మీ వంతయితే మరో పుస్త కాన్ని అందించడం మా వంతు. ఈ మానివేదనను అర్థం చేసుకొని మాతో సహకరిస్తారని ఆశిస్తున్నాం.

కోవూరు
తే 7-3-91. ది

పబ్లిషర్స్

# విషయసూచిక



## మనవి

పై కథలు, అందులోని సంఘటనలు, సన్నివేశాలూ కేవలం కల్పితం. ఎవరినీ ఉద్దేశించి వ్రాసినవి కావని, ఎవరికీ దేనికీ ఎట్టి సంబంధ లేదని ఇందుమూలంగా మనవి చేసుకొంటున్నాను.

రచయిత.

# ఆమె ఆవేదన - అతని అంతరంగం

సుమిత్ర ఆ స్కూలుకు హెడ్‌మిస్ట్రెస్. ఆమె చాలా ఆందోళనగా ఉంది. కారణం కొత్త డి ఇ.ఓ. ఆరోజు స్కూలు ఇన్‌స్పెక్షను చేయబోతున్నాడు. అతను చాలా స్ట్రిక్టు ఆఫీసరు అనీ, నిక్కచ్చి మనిషి అనీ, రికార్డులలో గాని, స్కూలు డిసిప్లినులోగాని ఏమాత్రం లోపమున్నా వెంటనే కఠిన చర్య తీసుకొంటాడనీ ఆమెకు తెలిసింది.

రెండు రోజుల ముందుగానే ఇన్‌స్పెక్షను ఉందని తెలిసినా పాపం ఆమె ఆరేళ్ళ ఒక్కగానొక్క కొడుకు మధుకి జబ్బు చేయడంతో ఆఫీసు పని అంతా టీచర్లకు అప్పగించి తాను ఈ రెండు రోజులు హాస్పిటలులో ఉండిపోయింది. బాబుకి వైద్యం చేయించి క్రితం రాత్రి ఇంటికి తీసుకువచ్చింది. భర్త వారం రోజులుగా ఇంట్లో లేనందున ఆమెకు ఈ ఇబ్బందులన్నీ ఎదురయ్యాయి. అసిస్టెంటు హెడ్‌మాస్టర్ని అడిగితే రికార్డులన్నీ సక్రమంగా ఉన్నాయని చెప్పాడు. దాంతో అన్నిటిమీదా సంతకాలు పెట్టేసింది.

ముప్ఫై అయిదేళ్ళ సుమిత్ర తెల్లని ముఖం నిండా చెమటలు పడుతున్నాయి. మాటిమాటికీ కర్ఛీఫ్‌తో ముఖం తుడుచుకొంటూ డి ఇ.ఓ. గారి రాకకోసం ఎదురు చూస్తూ ఉంది. ఇంతలో దూరంగా జీపు శబ్దం వినిపించింది. స్కూలు బంట్రోతు పరుగెత్తుకొంటూ వెళ్ళి గేటుదగ్గర నిలబడ్డాడు. హెడ్‌మిస్ట్రెస్ సుమిత్ర, అసిస్టెంటు హెడ్‌మాస్టరు, క్లాసులులేని టీచర్లు హెడ్‌మిస్ట్రెస్ గదిముందు డి. ఇ. ఓ. గారికి స్వాగతం చెప్పడానికి నిలబడి ఉన్నారు.

ఇంతలో జీపు బాణంలా దూసుకువచ్చి హెడ్‌మిస్ట్రెస్ గదిముందు ఆగింది. డి ఇ.ఓ. ముందు సీట్లోంచి ఠీవిగా దిగాడు. అందరూ విష్ చేశారు. డి. ఇ. ఓ. యువకుడు. వయసు షుమారు పాతిక సంవత్సరాలు ఉంటాయి. తెల్లగా, సన్నగా, అందంగా ఉన్నాడు. కళ్ళకు గాగుల్సు పెట్టుకొని ఉన్నాడు. ముందు ఠీవిగా డి.ఇ.ఓ. పోతూంటే వెనుకనే ఆయనను అనుసరించాడు బంట్రోతు. డి.ఇ.ఓ. దావు నేరుగా వెళ్ళి తనకు కేటాయించిన సీట్లో కూర్చొన్నాడు. అటెండెన్సు రిజిస్టరు తీసుకొని మొదటి పేరుమీద పెన్ను పెట్టి "హూ ఈజ్ మిసెస్ కె. సుమిత్ర?" అన్నాడు.

"ఎస్. సార్" అంది కంగారు నణచుకొంటూ హెడ్‌మిస్ట్రెస్ సుమిత్ర.

తలెత్తి చూసిన డి.ఇ.ఓ. రావు ముఖం నల్లగా మాడిపోయింది. ఇది....ఇది కలా? నిజమా? ఈ యదార్థాన్ని అతను నమ్మలేకపోతున్నాడు. అద్దాలుతీసి కర్చీఫ్‌తో ముఖం తుడుచుకొని ఒకక్షణం ఆమెనే పరిశీలనగాచూసి మళ్ళీ కళ్ళకు పెట్టుకొన్నాడు.

'రాక్షసి! ఈ మనిషివల్లేకదా తను స్త్రీ ద్వేషిగా మారింది! ఇన్నేళ్ళ కసీ, పగా ఈరోజు తీర్చుకొంటాను. జీవితంలో రాదనుకొన్న అవకాశం ఎంత విచిత్రంగా వచ్చింది! ఈమె నేనెవరో గుర్తించినట్టు లేదు. ఇక చూపిస్తాను నా తడాఖా' అని మనసులో అనుకొంటూ పళ్ళు కొరుక్కొన్నాడు రావు.

ఇనస్పెక్షను మొదలయింది. ప్రతి చిన్న తప్పుకూ ఎగిరెగిరి పడుతున్నాడు రావు. రికార్డులను విసిరి పడేస్తున్నాడు. ఈ హడావుడికి హెడ్‌మిస్ట్రెస్ సుమిత్ర భయపడిపోతోంది. టీచర్లు అరచేతిలో ప్రాణాలు పెట్టుకొని ఉన్నారు. స్కూలు బంట్రోతు వణికిపోతున్నాడు. అయ్యగారు కాఫీ పంపిస్తే తాగలేదు. టిఫిను తెచ్చిన అటెండర్ని తిట్టి పంపించాడు. చివరికి మంచినీళ్ళు కూడా ముట్టుకోలేదు. ఆ మధ్యాహ్నం భోజనం కూడా తనే డబ్బిచ్చి తన బంట్రోతు చేత తెప్పించుకొని తిన్నాడు. ఆ సాయంత్రం అయిదు గంటలకు ఇనస్పెక్షను పూర్తిచేసి లోటుపాట్లు ఒక ఏభై రాసి-'ఇంత బాధ్యతారహితంగా స్కూలును నడిపే హెడ్‌మిస్ట్రెస్ సుమిత్రను ఆరు నెలలపాటు ఎందుకు సస్పెండు చేయకూడదు' అనికూడా రాశాడు.

స్కూలు బెల్ కొట్టడంతో పిల్లలంతా వెళ్ళిపోయారు. టీచర్లు మాత్రమే ఉన్నారు. డి.ఇ.ఓ. గారు తన అటెండరు వెంటరాగా స్కూలుతోనే తనకు ప్రత్యేకంగా కేటాయించబడిన గదిలోకి వెళ్ళి విశ్రాంతి తీసుకోసాగాడు.

సుమిత్ర ఆవేదన అంతా ఇంతా కాదు. తన సబార్డినేట్స్ అయిన టీచర్ల ముందు తన బాధ బయట పెట్టుకోలేకుండా ఉంది. అదే ఒంటరిగా ఉంటే సుమిత్ర ఈపాటికి ఏడ్చేస్తూ ఉండేది. ఈరోజు వరకు ఆమెమీద ఇలాంటి రిమార్కులులేవు. గత సంవత్సరం ఆమె ఉత్తమ టీచరుగా రాష్ట్రపతి అవార్డు పొందింది. ప్రమోషన్ మీద ఆమెను ఈ మధ్యనే హెడ్‌మిస్ట్రెస్‌గా వేశారు.

ఆమెకు బాధ్యతలు ఎక్కువ. ఉద్యోగం లేనిదే జరగదు. భర్త చిన్న ఉద్యోగం చేస్తున్నాడు. అతని ఒక్కడిమీదా కుటుంబం జరుగదు. అదీగాక తన చెల్లెలి పెళ్ళికోసం నెల నెలా అంతో ఇంతో డబ్బు ఇంటికి పంపాలి. ఇప్పుడు ఈ ఉద్యోగం పోతే అవమానం సంగతి అటుంచి, బ్రతకటమే కష్టమవుతుంది.

అసిస్టెంటు హెడ్మాస్టరుతోపాటు, మిగతా టీచర్లంతా ఆమెను ఓదార్చి గదిలో ప్రశాంతంగా ఉంటాడనీ, అక్కడ కలుసుకొంటే కొంత ప్రయోజన ముంటుందనీ చెప్పారు. కాని డి.ఇ.ఓ. గారి దగ్గరికి పోవాలంటే ఆమెకు భయంగా ఉంది. అందుకే అందరూ కలసి ఆలోచించి నచ్చచెప్పారు.

రావు ఎడమచేత్తో తల పట్టుకొని కణతలు నొక్కుకుంటూ అసీజీగా కుర్చీలో కూర్చొని ఉన్నాడు. రావుగారి బంట్రోతు సుబ్బయ్య బయట కూర్చున్నాడేగాని అయ్యగారి మనసేమిటో అర్థంగాక తికమక పడిపోతున్నాడు. అయ్యగారి దగ్గర తన ఆర్నెల్ల సర్వీసులో ఎప్పుడూ ఇలా చూడలేదు. ఆనందంగా, చలాకీగా ఉంటూ అందరిచేతా మంచివాడనిపించుకొనేవాడు. కాని ఈ స్కూల్లో ఇంత రాద్ధాంతం ఎందుకు జరిగిందో అతని మనసుకు ఎక్కడంలేదు. ఏ స్కూలుకు వెళ్ళినా అర గంట కంటే ఎక్కువసేపు ఇన్స్పెక్షను జరిగేదికాదు. అలాంటిది ఇక్కడ ఒక రోజంతా ఇనస్పెక్షను చేశాడు.

హైస్కూలు బంట్రోతు స్వామిదాసు చెప్పినదాన్నిబట్టి హెడ్మిస్ట్రెస్ అమ్మ గారు చాలా మంచిదనీ, ఎప్పుడూ ఆ స్కూల్లో నూటికి పదిమందికంటే ఎక్కువ పాసుగారనీ, అలాంటిది ఈమె చేరిన సంవత్సరం నూటికి నూరుమంది పాసయ్యా రనీ, ఇదంతా ఆమె పడ్డ కష్టానికి ఫలితమని చెప్పాడు.

సుబ్బయ్య ఈ ఆలోచనల్లో ఉండగా హెడ్మిస్ట్రెస్ సుమిత్ర గది వాకిలి దగ్గరి కొచ్చింది. ఆమె ముఖం దీనంగా ఉంది.

"లోపలికి వెళ్ళండమ్మా, అయ్యగారు మిమ్మల్ని ఏమీ అనరు" గౌరవంగా లేచి నిలబడి, ఆప్యాయంగా అన్నాడు.

సుమిత్ర నెమ్మదిగా లోపలకువెళ్ళి రావుగారి ఎదురుగా నిలబడ్డింది. డి.ఇ.ఓ. ఆమెను చూసినా చూడనట్లే నటిస్తూ ఉండిపోయాడు. ఎదురుగా కుర్చీఉన్నా మర్యాద కోసం కూర్చోమనైనా చెప్పలేదు.

ఆమె ఎంతో నెమ్మదిగా "సార్" అంటూ పిలిచింది. రావు ఏమిటన్నట్లు విసురుగా చూశాడు.

"సార్, బాబుకు ఆరోగ్యం బాగులేక రెండు రోజులుగా నేను సెలవులో ఉండడంతో రికార్డుల్లో ఇన్ని అవకతవకలు జరిగాయి. నన్ను క్షమించండి" అంది రెండు చేతులు జోడిస్తూ.

"ముందుగా నేను తెలియజేసినా ఈ రెండు రోజులూ మీరు లేకపోవడం మొదటి తప్పు. అదీగాక ఆ విషయం వదిలేస్తే రికార్డుల్లో ఏముందో పరిశీలించకుండా గుడ్డిగా సంతకాలు పెట్టడం రెండవ తప్పు"

ఏం చెప్పినా వినడని నిర్ణయించుకొన్న సుమిత్ర "సారీ సార్. ఇకనుంచి ఏ తప్పులు లేకుండా చూస్తాను. ఈసారికి క్షమించండి" అంటూ దీనంగా అడిగింది.

"ఏం? ఎందుకు క్షమించాలి?" పట్టువదలని విక్రమార్కుడిలా అడిగాడు.

"సార్ ఇది చాలా ఘోరమైనశిక్ష. నన్ను సస్పెండు చేయవలసినన్ని తప్పులు అందులో లేవు. అదీగాక నన్ను ఆరు నెలలు సస్పెండు చేస్తే కుటుంబాన్ని పోషించడం కష్టమవుతుంది సార్" అంటూ వేడుకొంది. ఆమె కళ్ళలో నీరు కదిలిస్తే రాలేట్లుగా ఉన్నాయి.

"మరి నన్నేం చెయ్యమంటావు?"

"ఏ శిక్ష అయినా సరేసార్. జీతానికి భంగం లేకుండా."

"ఏ శిక్ష అయినా సరేనా?" కొంటెగా అడిగాడు. అతని కంఠం విచిత్రంగా ధ్వనించింది.

"ఏ శిక్ష అయినా సరే" పట్టుదలగా అంది.

"చెప్పమంటారా?"

"చెప్పండి."

"మీరు అమలుపరచలేరు."

"తప్పకుండా అమలుపరుస్తాను."

"ప్రామిస్?"

"ప్రామిస్!"

రావు కొద్దిసేపు ఆలోచిస్తూ పైకి చూడసాగాడు.

"చెప్పండి సార్, సందేహించకండి" ప్రాధేయపడుతూ అడిగింది సుమిత్ర.

"మీరు.... మీరు.... ఈ రాత్రి నాతో గడపగలరా?" చటుక్కున అనేశాడు డి.ఇ.ఓ. రావు.

ఆమెకు ఒక క్షణం గుండె ఆగినట్లయింది. శరీరంలోంచి రక్తం పొంగు కొచ్చి ముఖం ఎర్రగా అయింది. ఆవేశంతో శరీరం ఒణికింది. అదే ఆమె ఆర్థిక పరిస్థితి ఇంకో విధంగా ఉండుంటే చెంప పగలగొట్టి రాజీనామా కాగితం ముఖం మీద పారేసి వెళ్ళి ఉండేది. కాని ఆమె పరిస్థితి అందుకు విరుద్ధం. ఎంత సేపటికీ ఆమెకు తన ఆర్థిక పరిస్థితీ, తన బిడ్డ భవిష్యత్తూ గుర్తుకు రావడంతో ఆవేశం అణుచుకొంది.

"సార్ ఇంతకంటే వేరే శిక్ష మరేమీలేదా?" దీనాతి దీనంగా అడిగింది. కళ్ళలోంచి నీరు ఉబికి బుగ్గలమీదికి జారుతున్నాయి. ఎంత కష్టపడ్డా ఆపలేక పోతోంది.

"దీనికి ప్రత్యామ్నాయంగా మరేశిక్ష లేదు. మీరు కాదంటే ఇప్పుడే వెళ్ళి పోతాను" ఆమె ముఖంలోకి చూడకుండా గోడవైపు చూస్తూ చెప్పాడు.

ఆమె ఒక క్షణం ఆలోచించి "అలాగే సార్" అంటూ వస్తున్న ఏడుపును అరికడ్తూ పైట నోటిలో కుక్కుకొని వడివడిగా బయటకు వెళ్ళిపోయింది.

* * *

రాత్రి డి ఇ.ఓ రావు భోంచేసి మంచంమీద పడుకొని ఉన్నాడు. సుమిత్ర రాకకోసం క్షణాలు లెక్కబెడుతున్నాడు. ఆమెమీద తనకున్న కసి, పగ, ద్వేషం ఎప్పుడు ప్రదర్శిద్దామా అని ఎదురు చూస్తున్నాడు. ఇంతలో మెల్లగా తలుపులు నెట్టు కొని సుమిత్ర లోపలికి వచ్చింది. తలుపులు మూసి నెత్తిమీద ఉన్న కొంగు తీసే సింది.

ప్రత్యేక అలంకారాలు లేకుండా మామూలుగా ఉంది. చేతిలో హాండుబాగు ఉంది.

"ఫరవాలేదు. మాట తప్పకుండా వచ్చారే", అన్నాడు వ్యంగ్యంగా. ఆమె తల వంచుకొంది.

"కూర్చోండి" అంటూ ఎదురుగా ఉన్న కుర్చీ చూపించాడు. అతనికి ఏం మాట్లాడాలో తోచటంలేదు.

ఆమెని చూస్తుంటే అతని ఆలోచనలు గతంలోకి వెళ్ళాయి..... ....

అప్పటి నుంచీ తనకు ఆమె మీద ద్వేషం విపరీతంగా పెరిగిపోయింది. కష్ట పడి చదవసాగాడు. ఆమె పిలిచినా వెళ్ళేవాడు కాదు. ఆమెను 'అక్కా' అనిగాని, 'మేడమ్' అనిగాని పిలిచేవాడు కాదు. బద్ధ శత్రువులా, ద్వేషంగా క్రోధంగా చూసేవాడు.

తన శ్రమకు ఫలితంగా ప్రతిక్లాసులోను ఫస్టు వచ్చేవాడు మేడమ్ తనను ఎప్పుడూ అభినందించేది కాదు. తానూ ఆమె అభినందించాలని కోరుకునేవాడు కాదు టెన్త్ క్లాసు ఆఖరు పరీక్షరాసిన రోజున అతనికి మరునటి రోజు సుమిత్రా మేడమ్‌ను చూడ్డానికి నెల్లూరు నుంచి ఎవరో ఇంజనీరు పెళ్ళిచూపులకు వస్తాడనీ, ఆ పెళ్ళి చూపులు తనింట్లోనే జరుగుతాయని తెలిసింది.

అప్పటి నుంచి అతనికి ఒకటే ఆలోచన. ఎలాగైనా తన పగ ఇప్పుడే తీర్చు కోవాలి. అందుకు ఏం చేయాలి అని ఆ రాత్రంతా ఆలోచించి ఒకప్లాను వేసుకొన్నాడు. మరునటి రోజు ఎనిమిది గంటలకు పెళ్ళి చూపులకు వస్తారని తెలిసి తాను ఒక అర గంట ముందుగానే రైల్వే స్టేషనుకు వెళ్ళాడు. ట్రైను ఎనిమిదిన్నరకు వచ్చింది. అందులోంచి ఇంజనీరు, అతని తల్లి కాబోలు పెద్ద వయసామె దిగారు. రైల్వే స్టేషను నుంచి తన ఊరు ఒక కిలోమీటరు ఉంటుంది. బాడుగకు తానే ఒక ఎద్దు బండి మాట్లాడి అందులో ఎక్కమన్నాడు.

ఇంజనీరు నవ్వుతూ "బండిలో అమ్మను ఎక్కిద్దాం. మనం వెనకనే మాట్లాడు కొంటూ నడచివద్దాం. ఏం?" అన్నాడు. తను సరేనన్నాడు.

ఇంజనీరు తల్లి బండి ఎక్కితే తను, ఇంజనీరు మాట్లాడుకొంటూ నడవ సాగారు.

తను ఇంజనీరుతో ఆ విషయం, ఈ విషయం మాట్లాడుతూ చల్లగా మేడమ్ సుమిత్ర, హిందీ టీచర్ గోపాల్ ప్రేమించుకొన్నారని చెప్పాడు. ఇంజనీరు ముఖం నల్లగా మాడిపోయింది.

మళ్ళీ తనే "సార్, ఇప్పుడు మీరు రాకపోతే ఈ సంబంధం నేనే చెడ గొట్టానని నన్ను తంతారు. మీరు కొద్దిసేపు ఉండి వెళ్ళిపోండి సార్" అన్నాడు భయం నటిస్తూ.

దానికి ఇంజనీరు ఒప్పుకున్నాడు.

ఇంటి ముందు బండిలోంచి దిగిన ఇంజనీరు తల్లిని, ఇంజనీరు చేయి పట్టు కొని వస్తున్న తనను చూసి ఇంట్లోవాళ్ళు ఎంతో ఆనందించారు. పెళ్ళి చూపులలో సుమిత్ర మేడమ్ ఎంతో అందంగా అలంకరించుకొని ఇంజనీరు ఎదుట కుర్చీలో కూర్చొంది. ఇంజనీరు తల్లి ఎన్నో విషయాలు మాట్లాడితే ఇంజనీరు ముక్తసరిగా నాలుగు మాటలు మాట్లాడాడు.

పెళ్ళిచూపులు అయిన తరువాత తనుకూడా ఇంజనీరు వెంట రైల్వేస్టేషనుకు బయలుదేరాడు. తన తల్లి తనను చూపిస్తూ మేడమ్‌తో ఏదో చెప్తోంది. మేడమ్ తనను చూసి నవ్వుతూ తల్లికి ఏదో జవాబు చెప్తోంది. వెనక్కు తిరిగి చూసిన తనకు ఈ దృశ్యం కనిపిస్తోంది. 'ఏవో చాడీలు చెప్తోంది రాక్షసి' అని పళ్ళు నూరు కున్నాడు తను.

మరునటి రోజు మేడం వెళ్ళిపోయింది. తరువాత మేడం తనకు కనిపించ లేదు. ఇంజనీరు మేడమ్‌ను తిరస్కరించి ఉంటాడని! దాంతో ముఖం చెల్లక ఆమె ఎక్కడికో మార్పుకొని వెళ్ళిపోయుంటుందని అనుకొన్నాడు.

తరువాత తనకు టెన్తు క్లాసులో స్టేటు ఫస్టు రావడం, ఇంటర్ మీడియట్‌లో డిస్టింక్షను, బి.ఎ. లో ఫస్టుక్లాసు, ఎం.ఏ లో యూనివర్శిటీ ఫస్టు రావడం, తరువాత సర్వీసు కమీషనులో సెలెక్టు అయి డి.ఇ.ఓ గా ఉద్యోగం రావడం జరిగాయి.

యిన్నేళ్ళ తరువాత మళ్ళీ తన కంటబడింది సుమిత్ర మేడమ్.

* * * *

గతంలోంచి తెప్పరిల్లి ఆమెవైపు చూశాడు రావు. రావు కాల్చేసే చూపులు ఆమెకు అర్థంకావు. ఆమె దిగులు చూపులకు భాషలేదు. యిద్దరూ మౌనంగా చాలా సేపు ఉండిపోయారు.

"నేనెవరో మీకు తెలుసా హెడ్‌మిస్ట్రెస్‌గారూ?" అన్నాడు హఠాత్తుగా.

ఆమె పరిశీలనగా చూసిందతన్ని. కాని ఏమీ గుర్తు రావడంలేదు. రావు బెడ్ మీద నుంచి లేచి నిలబడి పచార్లుచేస్తూ చెప్పసాగాడు.

"నేనెవరో మీకు అర్థమైనట్లు లేదు. కారణం నాలో వచ్చిన మార్పులే. కాని మీరెవరో నాకు తెలుసు. అంత తేలిగ్గా మర్చిపోగలనా! సరిగ్గా పదేళ్ళనాడు

మా స్కూలుకు టీచరుగా వచ్చి, మా ఇంట్లో చేరి అనుక్షణం నన్ను శారీరకంగా మానసికంగా హింసించిన మిమ్మల్ని నేనెలా మర్చిపోగలను మేడమ్ సుమిత్ర గారూ! నాలో ప్రేమను, అభిమానాన్ని, ఆప్యాయతని విషతుల్యంచేసి నన్నొక ద్వేషిగా మార్చి మీరొక ఆదర్శ ఉపాధ్యాయినిగా ఆ ఊళ్ళో వెలిగారే. ఉద్యోగం కోసం మీ శీలాన్నే బలి యివ్వడానికి వచ్చారే. ఏమైపోయింది ఇప్పుడా ఆదర్శం?"

ప్రస్తుతాన్ని చీల్చుకొని గతంలోకి వెళ్ళిన ఆమె మనసుకు ఏదో కొంత అర్థమవుతూ ఉంది.

"మీదే ఊరు సార్" అంది భయం భయంగా.

"నారాయణపురం మేడమ్ సుమిత్రా. నాపేరు కోటేశ్వరరావు. గుర్తొచ్చిందా" ఏకవచనంతో ఆమెను సంబోధించి కసిగా నవ్వాడు డి.ఇ.ఓ. రావు.

"ఒరేయ్ నువ్వట్రా? ఎందుకిలా చెడిపోయావురా?" విసురుగా లేచిన ఆమె చేయి రావు చెంపను చెళ్ళుమనిపించింది.

వెంటనే "సారీ సార్. పొరపాటయింది" అంటూ ముఖం చేతుల్లో దాచుకొని ఏడవసాగింది.

"ఓ! మేడమ్ సుమిత్రా. నీ కింకా పొగరణగలేదు" చెంప తడుముకొంటూ అసంకల్పితంగా ఉబికిన కన్నీటిని కర్చీఫ్‌తో తుడుచుకున్నాడు.

"నేను.... నేను.... మిమ్మల్ని శారీరకంగా, మానసికంగా హింసించానా? అంతేనా మీరు నన్ను అర్థం చేసుకొన్నది! చిన్నతనంలో మాతండ్రి చనిపోయాడు. మేమంతా తల్లి ఆదరణలో దారిద్ర్యంలో పెరిగాము. ఎలాగో నేను టీచరు ఉద్యోగం సంపాదించుకొన్నాను. ఉన్న ఒకే ఒక తమ్ముడు చదువుమాని పసి వయసులోనే చెడు అలవాట్లకు లోనయ్యాడు. ఒకరోజు ట్రెయిన్‌లో ఎవరిదో పర్సు కొట్టేసి తప్పించుకోవడం కోసం కదులుతోన్న రైల్లోంచి ప్లాటు ఫారం మీదికి దూకేశాడు. కాని ట్రెయిను స్పీడుకు ప్లాట్‌ఫారంమీద బాలెన్సు చేసుకొని నిలబడలేక ప్లాటు ఫారంకు ట్రెయినుకు మధ్య పడి చనిపోయాడు. అదే సమయంలో నేను మీ ఊరికి బదిలీ అయ్యాను. మా తమ్ముడి వయసులో ఉన్న మిమ్మల్ని చూడగానే ఎందుకో అభిమానం పుట్టుకొచ్చింది. క్రమేణా దుఃఖం మరచిపోసాగాను."

"కాని నా అంతరాంతరాల్లో మా తమ్ముడి చెడు ప్రవర్తన, దానివల్ల కలిగిన విషఫలితం గుర్తుకొచ్చేది. అందుకే మిమ్మల్ని క్రమశిక్షణలో పెంచే బాధ్యత

ము తల్లిదండ్రులకు చెప్పి నేనే తీసుకొన్నాను. దాన్ని మీరు యింకో విధంగా అర్థం చేసుకొని నాకు దూరమయ్యారు. కాని నేను మీ నడవడికనే శ్రద్ధగా పరిశీలించ సాగాను. మంచిగా ఉండి ఓ వ్యక్తిని చెడగొట్టేకన్నా చెడ్డదాన్నై ఒక వ్యక్తి భవిష్యత్తుకు బాట వేయాలనుకొన్నాను. కాని ఆరోజు మాట వరసకు నేనన్నందుకు మీ తల్లిదండ్రులు మీకు వాత పెట్టారని తెలిసి రెండు రోజులు అన్నం తినలేదు. రాత్రుళ్లు ఏడ్చేదాన్ని. యివన్నీ ఎవరికి తెలుసు నా పెళ్ళి చూపులకు మీరు రైల్వే స్టేషను నుంచి ఇంజనీరును దగ్గరుండి తీసుకొస్తే 'చూశారా వాడు పైకి నాపై శత్రుత్వం వహించినా అక్కమీద ఎంత ప్రేమో' అని మీ తల్లిదండ్రులకు చెప్పాను. అందరం నవ్వుకొన్నాం."

"తరువాత ఇంజనీరు 'నీవు మీ హిందీ టీచరు గోపాల్ ప్రేమలో పడ్డావట. నీవు నాకు భార్యగా తగవు' అంటూ అవమానకరంగా ఉత్తరం రాశాడు. నేను ఎంతో బాధపడ్డాను. నిజానికి అప్పుడు మన స్కూల్లో ఉన్నది ఒకే ఒక హిందీ టీచరు. పేరు విమల. ఎవరో ఏదో చెప్పినదాన్ని నమ్మిన అతనంటే నాకు అసహ్యం పుట్టింది. ఇంతలో అవసానదశలో ఉన్న అమ్మకు మాట ఇచ్చిన ప్రకారం వర్క్స్ ఇన్స్పెక్టరుగా అతి చిన్న ఉద్యోగం చేస్తున్న మావయ్యను చేసుకొని గౌరవంగా బ్రతుకుతున్నాను నేను అక్కడినుంచి వచ్చేశాను గనుక మీ కివన్నీ తెలియవు."

"ఇప్పుడు చెప్పండి అనుక్షణం మీ బాగు కోరి. మీ భవిష్యత్తుకోసం శ్రమించిన మీ అక్కలాంటి నా శీలాన్ని కోరిన మిమ్మల్ని చంపేయాలా? లేక నా ఆశయాలక ఫలితంగా ఒక పెద్ద ఆఫీసరైన మీ సోదర ప్రేమ పొందలేని నిర్భాగ్యురాలిగ ఆత్మహత్య చేసుకోనా?" అంటూ పర్సు జిప్ లాగి అందులోంచి ఆరంగుళాల పొడవున్న పెన్ నైఫ్ తీసి చేత పట్టుకొంది.

రావుకు ఆమెపైగల ద్వేష భావం మంచులా కరిగిపోయింది. అతనికి గారబంగా పెరిగిన ఫలితంగా తన క్లాసుమేటు శ్యామసుందర్ చదువు అబ్బక ప్రస్తుతం గ్రామంలో సోమరిగా తిరుగుతున్న సంగతి గుర్తు వచ్చింది. క్రమశిక్షణలో సాన పెట్టిన వజ్రంలా తయారై సంఘంలో గౌరవంగా బ్రతుకున్నాడు తను. దీనికంతటికి కారణం పరోక్షంగా సుమిత్ర మేడమ్ !

# 11

రాబోతున్న దుఃఖాన్ని అప్పటి వరకు బిగపట్టి ఉన్న డి. ఇ. ఓ. రావు హఠాత్తుగా లేచి ఆమెకెదురుగా నిలబడి చేతులెత్తి నమస్కరిస్తూ "అక్కా నన్ను క్షమించు. నిన్ను మాటలతో అవమానపరచాలనే ఉద్దేశంతో తప్ప వేరే దురుద్దేశంతో నిన్నిక్కడికి రమ్మనలేదు. ఒకప్పుడు నీమీద నాకు కలిగిన ద్వేషమే నాలో పట్టుదల రగిలించి నన్నింతవాణ్ణి చేసింది. నీ మంచి మనసును అర్థం చేసుకోలేక పోయాను" అన్నాడు నీళ్ళు నిండిన కళ్ళతో.

సుమిత్ర చేతిలోని నైఫ్ కింద పడిపోయింది. రావు రెండు చేతులనూ తన చేతుల్లోకి తీసుకొని "తమ్ముడూ ! ఎలాగయితేనేం నన్నర్థంచేసుకొన్నావు. అంతే చాలు!" అంది ప్రేమగా.

సుమిత్ర ఇంటి దగ్గర నుంచి బాడీగార్డుగా తెచ్చుకొన్న అటెండరు స్వామి దాసు, పొరపాటున కూడా ఎలాంటి అవాంఛనీయ సంఘటన జరుగనీయకూడదని తీర్మానించుకొన్న డి.ఇ.ఓ. అటెండరు సుబ్బయ్య కిటికీలోంచి ఆ దృశ్యాన్ని చూసి ఎంతో సంబరపడ్డారు.



# ప్రేమ కోరేది త్యాగమా ?

అది సాయంకాలం ఆరు గంటల సమయం. ఆఫీసర్స్ క్లబ్బు సందడిగా ఉంది. కొందరు చదరంగం ఆడుతున్నారు. మరికొందరు ప్లేయింగ్ కార్డ్సు వేస్తున్నారు. ఇంకొందరు కోర్టులో టెన్నిస్ ఆడుతున్నారు.

హాల్లో కుడివైపు మూలనున్న టేబులు దగ్గర నలుగురు కూర్చుని ఉన్నారు. పేకలు కలుపుతున్న వ్యక్తి డాక్టర్ విజయమోహన్. పేకలు పేర్చుకుంటున్నవారు డాక్టర్ ఆనంద్. మిగతా ఇద్దరు రామకృష్ణ, కాంతారావు. స్టేట్ గవర్నమెంటులో గెజెటెడ్ ఆఫీసర్లు. వీళ్ళు నలుగురూ గత అయిదేళ్ళుగా ఆ క్లబ్బు మెంబర్లు. మంచి స్నేహితులు. నలుగురికీ పేకాట పిచ్చి.

కాలం గడచిపోతూ ఉంది. అందరూ పిచ్చాపాటీ మాట్లాడుకొంటూ ఆడుతున్నారు. ఏవేవో విషయాలమీద సంభాషణ జరుగుతూ ఉంది.

"ఒరేయ్ కాంతారావ్, లవ్ మేరేజెస్ మేలంటావా, అరేంజ్డు మేరేజెస్ మేలంటావా ?" అడిగాడు రామకృష్ణ ఉన్నట్లుండి.

"భలే.... ఎలాంటి టాపిక్ ఎత్తావు గురూ!"

"స్వీట్ డ్రీమ్స్!" భుజాలెగురవేశాడు కాంతారావు.

"ఛ....ఛ....మీకు పెళ్ళిళ్ళయి ఒక్కొక్కరికి మీ అంత పిల్లలున్నా, మీ బుద్ధులు మాత్రం మారలేదు."

"బుద్ధులు ఎందుకు మారాలోయ్? మనిషికి వయసనేదొకటి ఏడ్చింది కాబట్టి, అది మనిషి శరీరంలో మార్పుల్ని తెస్తుంది, మనసుకు ఒక షేపంటూ లేదుకదా. అందుకే అది మారదు కొంతమంది విషయంలో." డాక్టర్ ఆనంద్ మాటలకు జవాబిచ్చాడు డాక్టర్ విజయమోహన్.

"సరే పోనీ, పదిమంది ముందు పెళ్ళి చేసుకొన్న అమ్మాయికంటే లేచిపొచ్చిన అమ్మాయంటే మగవాడు పడి చస్తాడట. దీనికేమంటారు?" అడిగాడు రామకృష్ణ.

"దీనికి జవాబు నీకు డాక్టర్ విజయమోహన్ దగ్గర దొరుకుతుంది." జవా బిచ్చాడు డాక్టర్ ఆనంద్.

"అంటే, వీడికి భార్యగాక లేపుకొచ్చినది ఇంకోటుందంటావా? అరె! ఈ విషయం మా కెవరికీ తెలియదే" అన్నాడు కాంతారావు ఆశ్చర్యం కనబరుస్తూ.

"కంగ్రాచ్యులేషన్స్!" అందరూ విజయమోహన్‌ని అభినందించారు.

"ఒరే పిచ్చి నాన్నలూ, వాడికి ఇంతమంది లేరు. ఉండేది ఒకే ఒక తాళికట్టిని భార్య"

"అయితే, ఆమె లేపుకొచ్చిన బాపతా? వండర్" అన్నాడు రామకృష్ణ. అందరూ నవ్వారు.

"అన్నయ్యా" అంటూ ఆదరంగా అహ్వానించే సుమలత ముఖం అందరి కళ్ళ ముందూ మెదిలింది.

విజయమోహన్ సీరియస్‌గా ఆలోచిస్తున్నాడు. ఎవరేమంటున్నా మౌనంగా వింటున్నాడు తప్ప మాట్లాడడం లేదు. అతని గుండెలో దుఃఖతరంగాలు ఎగసెగసి పడుతున్నాయి.

"సారీ, విజయమోహన్. అయితే అంతా వదంతన్నమాట."

"ఏదో స్నేహితుడవని చొరవ తీసుకొన్నాం. మమ్మల్ని క్షమించు." తలా ఒక మాటన్నారు.

విజయమోహన్ ఇక ఆతలేనన్నట్లు ముక్కుల్ని ఓబులుమీద పడేశాడు. కణతలు రుద్దుకొన్నాడు. కుర్చీలోంచి లేచి నిలబడ్డాడు.

"అఫెండ్ కావద్దు విజయ్. ఏదో తొందరపడి హాస్యానికి అన్నాను. అంతా మరచిపో" అన్నాడు రామకృష్ణ బాధపడుతూ.

"నో. ఇది హాస్యం కాదు. యదార్థం" సిగరెట్ పొగ పైకి ఊదుతూ సీరియస్‌గా జవాబిచ్చాడు విజయమోహన్.

"ఆఁ!" అన్నారంతా.

"అవును నా భార్యకూ, నాకూ శాస్త్రోక్తంగా వివాహం జరగలేదు నేను ఆమె మెడలో తాళి కట్టలేదు. అలా ఎందుకు చేయాల్సివచ్చిందో చెప్తాను గార్డెన్‌లోకి వెళ్దాం. రండి."

14

గార్డెన్‌లో ఒక సిమెంటు బెంచీమీద ముగ్గురు వ్యక్తులు కూర్చుంటే, విజయ మోహన్ దాని కెదురుగా ఉన్న బెంచిమీద రిలాక్సింగ్‌గా కూర్చున్నాడు. పచ్చని చెట్లమీంచి వీచే చల్లనిగాలి వారి శరీరాల్ని స్పర్శిస్తోంది.

* * * *

"నేను డిగ్రీ తీసుకొని ఆ ఊళ్ళో క్రొత్తగా ప్రాక్టీసు పెట్టాను. ఆ ఊరు మరీ అంత పెద్ద టౌను కాకపోయినా, ఒట్టిగా పల్లెటూరు మాత్రం కాదు. ఆఊళ్ళో ఒకే ఒక ఎమ్.బి.బి.ఎస్. డాక్టర్ ఉన్నాడు నాటువైద్యం చేసేవాళ్ళు ఆర్.ఎమ్.పి. డాక్టర్లు సరేసరి. నేను పేద కుటుంబంలోంచి వచ్చిన వాణ్ణి కావడంతో పట్టణంలో ప్రాక్టీసు పెట్టే స్తోమతు నాకు లేదు.

నేను ఆ వూరికి కొత్తవాణ్ణి కావడంతో పేషెంట్లెవరూ నా దగ్గరకు రావడం లేదు. కుర్ర డాక్టర్ కేంతెలుసులే అనేది వాళ్ళ ఉద్దేశం.

ఒకరోజు పనిలేక గోళ్ళు గిల్లుకొంటూ వీధిలోకి చూస్తున్నాను. ఇంతలో సుడిగాలిలా పరుగెత్తుకు వచ్చిందో యువతి.

'హమ్మయ్య....ఉన్నారు కదా' అంది గుండెమీద చేతులుంచుకొని. పరిశీలనగా చూశాను. ఆమె వయసు ఇరవై రెండు సంవత్సరాలకంటే ఎక్కువ ఉండవు. తెల్లగా, అందంగా ఉంది. ముంగురులు నుదుటిమీద చెమటకు అతుక్కొని ఉన్నాయి.

'కూర్చోండి' అన్నాను ఎదురుగా ఉన్న కుర్చీ చూపుతూ.

'లేదు డాక్టర్ మీరు అర్జంటుగా రావాలి. మా అమ్మకు ప్రమాదంగా ఉంది. మాట్లాడటం లేదు. నాలుగిళ్ళ కవతలే మా ఇల్లు.' ప్రాధేయపడుతూ అంది.

నేను సంశయించడం చూసి 'ప్లీజ్....రారూ' అంది దీనంగా.

నేను ఇక ఉండలేక పోయాను. కాంపౌండరుకు చెప్పి ఆమె వెంట బయలుదేరాను. ఒక నలభై ఏళ్ళ స్త్రీ మంచంమీద పడుకొని మూలుగుతూ ఉంది. పేషెంటుకు ఇంజెక్షనిచ్చి, మందులు రాసిచ్చాను.

ఆ ఇంట్లో ఇక ఇద్దరు ఆడవాళ్ళున్నారు. మగవాళ్ళు ఎవరూ ఉన్నట్లు కనిపించలేదు.

'థాంక్స్ డాక్టర్. నామాటమీద గౌరవముంచి వచ్చారు. నాపేరు సుమలతండి తిరుపతిలో ఎమ్మెస్సీ ఫైనల్ చదువుతున్నాను. జ్వరంతో ఉన్నామె మా అమ్మ. ఈమె అమ్మమ్మ. ఆమె జేజమ్మ' అందర్నీ పరిచయం చేసింది.

'మీ నాన్నగారు ఏం చేస్తుంటారండీ'? అడిగాను కొంత చనువు తీసుకొని.

ఆమె ముఖంలో రంగులు మారాయి. కళ్ళలో నీరు గిర్రున తిరడం గమనించాను. 'అవన్నీ మీ డిస్పెన్సరీకొచ్చి చెబుతాను. డాక్టర్' అంది బాధగా.

వాళ్ళమ్మ విధవ అన్న సంగతి అప్పుడు గుర్తుకొచ్చింది. మనసులోనే నొచ్చుకొన్నాను అలా అడిగినందుకు.

పేషెంటుకు ఇకనేం భయంలేదని, రాసిచ్చిన మందులు జాగ్రత్తగా వాడమని చెప్పి వచ్చేశాను.

నేను అనుకొన్నట్లుగా ఆమె రాలేదు సరికదా. గంట తరవాత పక్కింటి అబ్బాయి వచ్చి నా ఫీజు డబ్బు ఇచ్చి వెళ్ళిపోయాడు. ఆమె వస్తుందని, ఆ అందాల రాశితో కొద్దిసేపు మాట్లాడుదామనుకొన్న నా ఆశ నిరాశ అయింది.

దాదాపు మూడు నెలలు గడిచాయి. హఠాత్తుగా వూడిపడింది సుమలత.

'సారీ డాక్టర్ మిమ్మల్ని కలవలేక పోయాను. యూనివర్శిటీ ఎగ్జామ్సుకు వెళ్ళాను' అంది పశ్చాత్తాప పడుతున్నట్లు.

'నెవర్‌మైండ్. ఇప్పుడు గుర్తు పెట్టుకొని వచ్చారుగదా. దానికి సంతోషం.'

'ఛ.... గుర్తుపెట్టుకోక మరచిపోతానుట సార్. మీ సహాయాన్ని? ఆ డాక్టర్ గారు చూడబోతే ఇంటికి రారు. పేషెంటుని అక్కడికి తీసుకురమ్మంటారు. మీఅంత మంచివారు కాదు సార్. ఆయన.'

'ఇంతకీ మీ అమ్మగారు అలా అవడానికి కారణం.'

'అది డాక్టరుగా మీరు చెప్పాలిగదండీ.'

'చాలా రోజుల్నుంచి ఆమెగారేదో మానసిక వ్యథ అనభవిస్తున్నట్లుంది. డాక్టరుగా నేను చెప్పగలిగిందిదే.'

'కరెక్టుగా చెప్పారు. డాక్టర్. ఆమె దిగులంతా నా పెళ్ళి గురించే.'

'ఏం ఎక్కడా కుదర్లేదా?' చిలిపిగా అడిగాను.

ఆమె నా కళ్ళలోకి సూటిగా చూసింది. తరవాత సిగ్గుపడుతూ 'అదీ ఒక కారణ మనుకోండి. నన్ను చేసుకోవడానికి ఎవరూ ముందుకు రాలేదు డాక్టర్' అంది.

'మిమ్మల్నిచూసి ఎవరూ రాకపోవడం ఏమిటండీ? పంచభక్ష్య పరమాన్నాలు ముందు పెట్టి తినమంటే వద్దనేవాడుంటాడా.'

'డాక్టర్‌గారూ! మీరు చాలా అమాయకులని, ఎంతమంది సుందరాంగులు వచ్చి మీ ముందు తమ సౌందర్యాన్ని ప్రదర్శించినా సిరంజి తీసుకొని ఇంజెక్షన్ చేస్తారేతప్ప, కన్నెత్తి చూడరని మా వీధిలో ఆడవాళ్ళంతా అనుకొంటుంటే విన్నాను. కాని ఇప్పుడు తెలుస్తోంది మీరెంత రసికులో'!

'అంతేగదండీ. రసికత అనేది అందరముందూ బయటపడదు. దానికి తగ్గ వాళ్ళు ఎదురైతేనే.'

'ఈజిట్!' పకపక నవ్వింది సుమలత.

ఆ నవ్వుకు పరవశించి పోయాను.

'డాక్టర్! మీరు మంచి యాక్టరండీ. మా ఆడ సమూహంలో మీరు అపర ప్రవరాఖ్యుడిగా గుర్తింపబడటం నా అదృష్టం. మిమ్మల్ని ఈ కొద్దికాలం పరిశీలించిన మీదట మీరు మచ్చలేని చంద్రుడిగా నా హృదయంలో స్థానమేర్పరచు కొన్నారు. మీకు నామీద స్థిరమైన అభిప్రాయం కలగటానికి ఆరు నెలలు టైమిస్తున్నాను' అంది.

'ఆ తరువాత....'

'మీరు అవునంటే మీ ప్రక్కనే చోటు చేసుకొంటాను.'

అలా ప్రారంభమైన మా స్నేహం ఆరునెలలు తిరిగే సరికి గాఢ ప్రేమగా మారింది.

'ఏం సుమలితా, ఎప్పుడు మన పెళ్ళి? ముహూర్తాలు పెట్టించమంటావా?' చెరువు గట్టుమీద కూర్చొని నీళ్ళలోకి రాళ్ళు విసురుతూ అన్నాను.

సుమలత కొద్దిసేపు మౌనంగా ఉండి తల వంచుకొని అంది: 'మా అమ్మకు నా పెళ్లి ఇష్టంలేదు.'

'ఏమిటి నువ్వనేది?'

'కంగారు పడకండి, పెళ్ళంటూ వద్దన్నదేగాని భార్యాభర్తలుగా సంసారం చేయవద్దనలేదు.'

'అంటే....?'

'చూశారుగా మా ఇంట్లో ముగ్గురు విధవల్ని. మా జేజమ్మ పెళ్ళయి. మా అమ్మమ్మ పుట్టగానే ఆమె భర్త చనిపోయాడట. ఆస్తంతా మా అమ్మమ్మకు వచ్చింది. మా అమ్మమ్మకు పెళ్ళిచేస్తే ఆమె భర్త మా అమ్మ పుట్టిన సంవత్సరానికి ఏక్సి డెంటులో పోయాడు. దాంతో మా అమ్మమ్మ అమ్మతో సహా భర్త ఆస్తి అమ్ముకొని వాళ్ళ అమ్మ ఇంటికి వచ్చేసింది. ఇక మా అమ్మకు పెళ్ళయి నేను పుట్టగానే మా నాన్న జాండీస్ వచ్చి చనిపోయాడు, దాంతో మా అమ్మ వాళ్ళ అమ్మ ఇంటికి వచ్చి చేరింది. ఇదీ చైన్. దీంతో మా అమ్మ భయపడిపోయి ఉంది. నా పెళ్లి విషయంలో....'

'నేనయినా విధవను కాకుండా భర్తతో సుఖంగా జీవించాలని అమ్మ కోరిక. పెళ్ళి కాకుంటే లోకులు కాకుల్లా పొడుస్తారని మా అమ్మ బాధ. పెళ్ళిచేస్తే నేను విధవనవుతానని ఆమె భయం. నాక్కూడా మన్మథుడిలాంటి మిమ్మల్ని చంపుకోవటం ఇష్టంలేదు.' మాట్లాడుతున్న సుమలత గొంతు రుద్ధమైంది. బుగ్గల మీదికి కన్నీరు కారుతూంటే ఓదార్పుమన్నట్లు నా ఒడిలో వాలిపోయింది.

నాకు జాలేసింది. కర్చీఫ్‌తో ఆమె కన్నీటిని తుడిచాను.

'ఇదేమైనా క్రానిక్ డిసీజ్ అనుకొన్నావా వంశ పారంపర్యంగా రావడానికి? నీదంతా వట్టి మూఢనమ్మకం' అన్నాను కొట్టిపారేస్తూ.

'మీరు ఏమనుకొన్నా సరే. పెళ్ళి విషయంలో నేను చెప్పినట్లు విని నన్ను మీ భార్యగా చేసుకుంటే చాలు' అంది సుమలత ఆశగా.

నేను చిరునవ్వు నవ్వాను. 'ఆల్‌రైట్. నీకోసం ఏ విధంగా నడుచుకోమన్నా నడుచుకొంటానని మాట ఇస్తున్నాను. ఇంత అందమైన అమ్మాయిని అంత తేలిగ్గా వదులుకొంటానా?' అన్నాను.

'థాంక్స్' అంది లేస్తూ.

ఇద్దరమూ బయలుదేరాము.

ఒకరోజు ఉదయాన్నే సుమలత డిస్పెన్సరీకొచ్చి ఆరోజు సాయంత్రం నాలుగు గంటలకు డిస్పెన్సరీ కట్టేసి ఇంటికి రమ్మని చెప్పిపోయింది.

ఆమె చెప్పినట్లే ఆ సాయంత్రం వాళ్ళింటికి వెళ్ళాను. సుమలత ఎంతో ఆప్యాయంగా ఆహ్వానించింది. ఇంట్లో మిగతా ఆడవాళ్ల ముఖాలు కనిపించకుండా తప్పించుకు తిరగసాగారు. నన్ను బాత్‌రూమ్‌కు వెళ్ళి తలస్నానం చేసిరమ్మని టవల్లు అందించింది సుమలత.

'ఏమిటిది' అన్నాను ఆశ్చర్యపోతూ.

'ఈరోజు మన శోభనం' అంది సిగ్గుపడుతూ.

'ఏం బాగాలేదు ఈ పద్ధతి' అన్నాను.

ముఖం ఇంత చేసుకొని 'మీరేకదా నాతో సహకరిస్తానన్నారు. అందుకే ఇన్ని ఏర్పాట్లు చేశాము' అంది.

ఇక ఏం మాట్లాడలేదు నేను. స్నానంచేసి వచ్చేసరికి తెల్లని పంచె. షర్టు కొత్తవి అందించింది. అవి ధరించాను. షడ్రసోపేతమైన భోజనం పెట్టింది. ఆ రాత్రి అందమైన శోభనపు గదిలో ఇద్దరమూ ఒకటయ్యాము.

ఇది జరిగిన తరవాత అక్కడ ఉంటే నలుగురూ నాలుగు మాటలు అని వాళ్ళని బాధలు పెడతారని అక్కడ నుంచి అందరమూ వచ్చేశాము. క్రమేణా నాకు గవర్నమెంటు ఉద్యోగం రావడం. ఇద్దరు కొడుకులు పుట్టడం మాకు ఆనందాన్నిచ్చింది. ఈరోజు వరకు సంతోషంగా జీవిస్తున్నాము. ఇదీ జరిగిన విషయం. ఆ రోజు నేను సుమలతకు తాళికట్టి శాస్త్రోక్తంగా పెళ్ళిచేసుకొని ఉంటే ఈనాడు మీ కళ్ళముందు కనిపించేవాణ్ణి కానేమో!" కథ ముగించాడు డాక్టర్ విజయమోహన్.

*   *   *   *

"ఛ....ఛ....అన్నీ మూఢ నమ్మకాలు. ఒరేయ్! నువ్వు డాక్టరువయి ఉండి మా చెల్లాయి సుమలత పోస్టుగ్రాడ్యుయేటు అయిఉండి ఇలా చదువూ సంధ్యాలేని మూర్ఖుల్లా ప్రవర్తించారంటే మాకెంతో అవమానంగా ఉంది" అన్నాడు రామకృష్ణ.

"చదువుకొన్న వాళ్ళలోనే ఈ మూఢ నమ్మకాలు ఎక్కువ." వత్తాసు పలికాడు కాంతారావు.

"ఇట్లాంటి మూఢ నమ్మకాల్ని మనం ఛేదించాల్సింది పోయి ప్రోత్స హించడమా. డామ్ ఇన్సల్ట్!" ఆనంద్ అందుకొన్నాడు.

"ఒరేయ్ అమాయకుల్లారా. మీకు డామ్ ఇన్సల్టింగ్ అనిపించేవి ఇంకా ఈ సమాజంలో చాలా ఉన్నాయని గుర్తుంచుకోండి. అది సాంప్రదాయం....ఆచారం. ఎన్ని చెప్పినా దాన్ని విడనాడలేరు." వాదించాడు విజయమోహన్.

"అయితే, మీ శ్రీపతి కుటుంబంలో ఆలా ఎందుకు జరిగిందంటావ్?"

"ఒరేయ్! జరిగిందేదో జరిగిపోయింది. విషయం చెప్పాడు. ఇక ఎందుకు దానిమీద చర్చలు?"

"నో....నో....అలాకాదు. మనం విజయమోహన్‌కి, చెల్లాయికి ఇప్పుడు పెళ్ళి చేసి, ఆవిడగారి వంశంలో జరిగిన దుర్మరణాలు ఇప్పుడు జరగవని రుజువు చెయ్యాలి."

"ఎలా?" అందరూ తమలో తాము ప్రశ్నించుకొన్నారు.

"ఎలా ఏమిటి? ఆవిడగారిని అందరం కలసి ఒప్పించి. ఒక శుభముహూర్తాన విజయమోహన్‌చేత తాళి కట్టించాలి."

విజయమోహన్ గుండె దడదడ లాడింది.

"ఛ....ఛ....వాడి పెద్దకొడుకు వైజాగ్‌లో డాక్టరు. రెండవ కొడుకు బాంకులో ప్రొబేషనరీ ఆఫీసరు. ఇప్పుడు పెళ్ళా? నోరు ముయ్యండిరా."

ఒక క్షణమాగి రాజారావుకు జవాబు చెప్పాడు ఆనంద్: "పెళ్ళంటే పది మంది బంధువుల్ని పిలిచి బాజా భజంత్రీలతో జరిపే పెళ్ళికాదు. మనమే పెళ్ళి పెద్దలం. పెళ్ళి వాడింట్లోనే.... మేళతాళాలు లేకుండా ఒక పురోహితుణ్ణి పెట్టి వేద మంత్రాలు చదివి సుమలత మెడలో తాళి కట్టించడం. మనం అక్షింతలు చల్లడం అంతవరకే."

"నో. నే నొప్పుకోను. మా కిప్పుడు పెళ్ళేమిటి?" అడ్డం తిరిగాడు విజయ మోహన్.

అందరూ ఎంతో నచ్చజెప్పారు. మూఢ విశ్వాసాలను ఖండించాల్సింది విద్యా వంతులేనని, మిగతా దేశాలకంటే భారతదేశం కొన్ని విషయాల్లో వెనుకబడి ఉండ టానికి కారణం మూఢ విశ్వాసాల్ని అనుసరించడమేనని. కనుక ఈ విషయంలో

"మీరెన్ని చెప్పినా నేను దీనికి ఒప్పుకోను."

"అయితే, నామీద నీకున్న ప్రేమ ఇదేనా ? ఈ చిన్న కోరికకు నీ నిర్ణయాన్ని త్యాగం చేయలేవా. సుమలతా" అన్నాడు ప్రతిమలాడుతూ.

"నో. అలా ఎన్నటికీ జరగదు," ఖండితంగా చెప్పింది.

విజయమోహన్ సీరియస్‌గా అటు తిరిగి పడుకున్నాడు.

సుమలత మనసంతా గందరగోళంగా ఉంది. అక్కణ్ణుంచి లేచి వెళ్ళి పక్క గదిలో పడుకొని కరువుతీరా ఏడ్చింది. తను విజయమోహన్‌తో సంసారానికి వచ్చిన తరవాత మొదటి కాన్పులో కొడుకు పుట్టినప్పుడు తన తల్లి ఎంత ఆనందించింది! తరవాత బిడ్డ మగపిల్లవాడే.

తమ వంశంలో అందరూ ఆడపిల్లలే పుట్టడం పెళ్ళయిన తరవాత వైధవ్యం రావడం గత నాలుగు తరాలుగా జరుగుతోంది. ఇప్పుడు చరిత్ర తారుమారైంది తన కూతురితో కొత్త జీవితం ప్రారంభమైందని ఎంతో పొంగిపోయింది తల్లి. ఇప్పుడు తన తల్లి చిన్న కొడుకు కృష్ణ దగ్గరే ఉంది. పాలపొంగులాంటి తన సంసారంలో విషపు బొట్లు చిందుతాయేమోనని భయపడసాగింది సుమలత.

భర్తతో తను ఎప్పుడైనా గొడవపడిందా? అతని మాట తనెప్పుడైనా కాదందా? అలాంటి భర్త తనతో సీరియస్‌గా ఉంటే ఒక్కరోజు బ్రతగ్గలదా ? రాత్రంతా ఆలోచించి చివరకు భర్త చెప్పినట్లు వినడానికే నిర్ణయించుకొంది. అంతా దేవుడిమీద భారం వేసింది.

ఉదయం లేచినప్పటి నుండి ఆమె భర్తను తప్పించుకుని తిరగసాగింది. సరిగ్గా ఎనిమిది గంటలకు విజయమోహన్ మిత్ర సమూహం వచ్చేశారు. మౌనంగా అందరికి టిఫిన్లు పెట్టి కాఫీ అందించింది. అప్పుడు పరిశీలనగా చూశాడు విజయమోహన్. అమె కళ్ళు ఎఱ్ఱగా ఉబ్బి ఉన్నాయి. ముఖంలో సంతోషం మాయమయింది. తను సుమలత మనసును కష్టపెడుతున్నాడేమోనని ఒక క్షణం బాధపడ్డా, మరలా మిత్రుల హిత వచనాలు గుర్తుకు వచ్చి ధైర్యం తెచ్చుకొన్నాడు.

"చెల్లాయ్.... విజయమోహన్ నీకు అన్ని విషయాలు చెప్పాడుగదా. ఎందుకు అంత భయపడతావ్? ఇంత పెద్ద డాక్టరుండి. ఇంకో డాక్టరుకు ప్రమాదం రానిస్తాడా? మమ్మల్ని చూసి మృత్యువు ధైర్యంగా ముందుకు వస్తుందా?" గర్వంగా చెప్పాడు డాక్టర్ ఆనంద్

"సుమలతా, భయపడకమ్మా ఎన్ని బంగారు గొలుసులు వేసుకొన్నా తాళి ఉంటేనేగదమ్మా గృహిణికి సంపూర్ణ అలంకారం నా మాట నమ్మ. అతనికేమీ జరుగదు." రామకృష్ణ హామీ ఇచ్చాడు.

"నువ్వు నా చెల్లెలు లాంటి దానివి. నా చెల్లెలు మెడలో తాళి లేకుంటే నే నూరుకుంటానా? నా చెల్లెలుగా నిర్బంధిస్తున్నాను. నువ్వు విజయమోహన్ చేత తాళి కట్టించుకోవాలమ్మా. లేకపోతే ఊరుకొనేది లేదు. నీ మూఢ నమ్మకాలు ఇక నైనా వదులుకో." సుతిమెత్తగా మందలించాడు కాంతారావు.

ప్రశాంతంగా జవాబిచ్చింది సుమలత.

"అన్నయ్యా తాళికడితే భర్తకు ప్రమాదం జరుగుతుందేమోనని నే నను కోవడం మూఢ నమ్మకమే.... కాదనను. మెడలో తాళి కడితేనే పెళ్ళనడం మూఢ నమ్మకం కాదా...."

"అది సంప్రదాయం.... ఆచారం తల్లీ."

"ఏది సంప్రదాయం? మెడలో పసుపుతాడు ఉరితాడుగా మారడమేనా మన సంప్రదాయం? ఆ సంప్రదాయం ఎవరికి కావాలి?"

"అమ్మా, నువ్వు తెలివిగలదానివి. నీతో వాదించలేము. ఇంతకీ విజయ మోహన్ ప్రపోజల్స్‌కు నువ్వు అంగీకరించినట్లేనా?"

తలెత్తి భర్త కళ్ళలోకి ఒకసారి చూసి తను ఒప్పుకొన్నట్లు తల ఊపింది. ఇక అక్కడ ఉండలేక భారమైన మనసుతో లోపలికి వెళ్ళిపోయింది.

మిత్రులందరూ బయలుదేరి ఒక బ్రాహ్మణుని కలుసుకొని ముహూర్తం పెట్టించారు. పురోహితునిగా కూడా అతణ్ణే ఎన్నుకొన్నారు.

ఈ విషయం పిల్లలకు, తన తల్లికి తెలియజేద్దామంటే సిగ్గుగాను, భర్త ఎవరికీ చెప్పవద్దని ఆంక్షలు పెట్టిన తరవాత భయంగాను ఉంది.

రోజులు గడచిపోతున్నాయి. ముహూర్తం దగ్గరకు వచ్చింది ఆ రోజు రామకృష్ణ, కాంతారావు. ఆనంద్ తమ తమ భార్యలతో సహా వచ్చారు. పని మనుషులందరినీ తలా ఒక పనిమీద ఇంట్లో లేకుండా చేశారు. డాక్టర్ విజయ మోహన్ లంకంత భవనంలో, మధ్య హాల్లో ఇద్దర్నీ పీటలమీద కూర్చోబెట్టి పెళ్ళి తతంగం జరిపించాడు పురోహితుడు. శాస్త్రోక్తంగా తాళి కట్టాడు విజయమోహన్.

# 23

భోజనాలయిన తరవాత ఆడవాళ్ళంతా సుమలతను శోభనపు గదిలోకి పంపిస్తే, మగ వాళ్ళంతా 'బెస్ట్ ఆఫ్ లక్' అంటూ విజయమోహన్‌ని విష్ చేసి ఎవరి ఇండ్లకు వాళ్ళు వెళ్ళిపోయారు.

కాలం గడిచిపోతూ ఉంది. విజయమోహన్ సంతోషంగా ఉన్నాడు. విషయం తెలిసిన ఇద్దరు కొడుకులు, కోడలు సంతోషించారు. ఇపుడు బాధపడేది సుమలత. ఆమె విధవ తల్లి. ఎవరి ఓదార్పు మాటలూ వాళ్ళని శాంతింప జేయలేకపోతున్నాయి. ఏ రోజు కారోజు భయం భయంగా గడుపుతున్నారు.

*  *  *  *

రోజులు గడచి పోతున్నాయి. భర్త తనను వదలి ఎక్కడికి పోతాడో అన్నట్లు అతణ్ణి వెన్నంటే తిరుగుతోంది సుమలత. రాత్రుళ్ళు అతని గుండెలో ఒదిగి పడుకొంటోంది. ఆరునెలలు గడచిపోయాయి. ఆరోజు క్లబ్బు తరపున టెన్నిస్ మాచ్‌లు జరుగుతున్నాయి. అంతా నేషనల్ ప్లేయర్స్. చాలా ఇంటరెస్టింగ్‌గా ఉంటుందని అందరూ ఆతృతగా వస్తున్నారు. మొదటి వరుసలోని నాలుగు కుర్చీలలో డాక్టర్ ఆనంద్, కాంతారావు, రామకృష్ణ కూర్చుని ఉన్నారు. అతని ప్రక్కనే ఇంకో ఖాళీ కుర్చీ ఉంది. అది డాక్టర్ విజయమోహన్ కోసం నిర్దేశింపబడింది. అతను ఇంకా రాలేదు. ప్లే స్టార్టయింది.

ఇంతలో పరుగెత్తుకు వచ్చి రామకృష్ణ చెవిలో ఒక న్యూస్ ఊదాడు క్లబ్బు ప్యూన్ నరసింహులు. రామకృష్ణ కాంతారావు చెవిలోను, కాంతారావు ఆనంద్ చెవిలోను క్షణాలమీద వార్త చేరవేశారు. అందరూ నిరుత్తరులై పోయారు. ఇంకేముంది? అందరూ ఆఘమేఘాలమీద గవర్నమెంటు హాస్పిటల్‌కు వచ్చి పడ్డారు. విజయమోహన్ శరీరం మీద అంగుళం తేడా లేకుండా బాండేజి కట్టబడి ఉంది. ముఖం మాత్రమే కనిపిస్తూ ఉంది. ముక్కులోంచి కారే రక్తాన్ని గుడ్డతో తుడిచి వేస్తూ ఉంది నర్సు. అతణ్ణి ఎమర్జెన్సీ వార్డులో చేర్చి ఉన్నారు.

"అసలు ఏక్సిడెంటు ఎలా జరిగింది. డాక్టర్?"

"పోలీసు రిపోర్టు ఇలా ఉంది: ఈయనగారు స్కూటరుమీద లెఫ్ట్ సైడే వస్తున్నారు. కాని ఎదురుగా వస్తున్న లారీ డ్రైవరు తాగి ఉన్నాడు. వాడు నేరుగా వచ్చి ఈయన్ని గుద్దేశాడు. ఈయన తప్పించుకుపోలేక పోయాడు. సరాసరి లారీ చక్రాల క్రింద పడ్డాడు. బ్రతకడం ఇంపాసిబుల్."

ఇక వినలేక పోయారు.

ఒకపైపు సుమలత ప్రాణంలేని దానిలా కింద కూర్చొని భర్త కాళ్ల దగ్గర తల పెట్టుకొని శోకదేవతలా ఉంది. ముఖాన పట్టిన చెమటతో ఆమె కుంకుమ కరిగి కిందికి కారుతూ ఉంది. విజయమోహన్ స్నేహితుల భార్యలకు విషయం తెలిసి వచ్చి సుమలతను ఓదారుస్తున్నారు.

అందరికీ ట్రంక్ కాల్స్ వెళ్ళాయి. టెన్నిస్ గేమ్స్ ఆ రోజుకు కాన్సిల్ చేశారు. క్లబ్బు మెంబర్లు అంతా వచ్చి చూసి వెళ్ళారు. రాత్రి పది గంటలకు పెద్ద కొడుకు భార్యతో సహా వస్తే, చిన్నకొడుకు అమ్మమ్మను తీసుకొని రాత్రి పన్నెండు గంటలకు వచ్చాడు.

స్పృహ తప్పిన తల్లిని ప్రక్క బెడ్‌మీద పడుకోబెట్టి శుశ్రూషలు చేస్తూ తండ్రి కెప్పుడు తెలివి వస్తుందా అని ఎదురు చూస్తున్నారు.

వేకువ జామున నాలుగు గంటలకు స్పృహ వచ్చింది విజయమోహన్‌కు. అందరూ ఎంతో ఆనందించారు.

"అమ్మా....అమ్మా....నాన్నకు....స్పృహ వచ్చింది. లేమ్మా" అంటూ తల్లిని కుదుపుతూ లేపారు కొడుకులు.

భర్తకు స్పృహ వచ్చిందనగానే సుమలతలో జ్ఞాననాడులు మేల్కొన్నాయి. కళ్ళు తెరిచింది. ఎంతో హుషారుగా లేచి కూర్చొంది. తల్లికి సాయంగా ఇద్దరు కొడుకులూ ఆమెను పట్టుకొని తండ్రి బెడ్ దగ్గరకు తీసుకు వచ్చారు.

"ఏమండీ" అంది భర్త తల దగ్గర కూర్చుని.

అందరూ గుమిగూడారు.

"సుమలతా! నీ మనసును దుఃఖపెట్టి పోతున్నానుగదూ? ప్రేమ త్యాగాన్ని కోరుతుంది సుమలతా. నా మీద ప్రేమతో నీ పసుపు కుంకుమల్ని త్యాగం చేశావు." అతి కష్టంమీద చేయెత్తి ఆమె తల స్పర్శిస్తూ అన్నాడు.

సుమలత ఏమీ చేయలేని దానిలా దీనంగా చూసింది.

"నేను ఇక కొన్ని నిముషాల కంటే ఎక్కువ బ్రతకను. ఒరేయ్, అమర్, ఒరేయ్! కృష్ణా" అంటూ దగ్గరకు పిలిచాడు.

"బాబూ! నా దేవతను మీ చేతుల్లో పెడుతున్నాను మీ అమ్మను ఎలా చూసుకొంటారో" అంటూ భార్య చేతిని ఇద్దరు కొడుకుల చేతుల్లో ఉంచాడు.

అంత పెద్ద పిల్లలూ తండ్రి శరీరాన్ని నిమురుతూ బావురుమని ఏడ్చారు. ఇక సుమలత దుఃఖం చెప్పనవసరం లేదు.

మిత్రులు ముగ్గురూ మెల్లిగా విజయమోహన్‌ని సమీపించారు.

సుమలతవైపు కన్నెత్తి చూడ్డానికి భయపడుతున్నారు.

ఒకరు 'మృత్యువు తనను చూసి పారిపోతుంద'ని భరోసా ఇచ్చారు. ఇంకొకరు 'నా చెల్లెలి లాంటి దానివి. నీ మెడలో తాళి లేకపోతే నే నూరుకోను' అంటూ నిర్బంధించారు. 'తాళి ఉంటేనేగదా సంపూర్ణ గృహిణి. నీ భర్తకేం జరగదు' మరొకరు హామీ ఇచ్చారు.

ఇప్పుడు ఆ హామీలన్నీ గాలిలో కలసిపోయాయి.

సుమలతది మూఢ విశ్వాసమే కావచ్చు. జరిగింది ఏక్సిడెంటే కావచ్చు. కాని నమ్మకాలు జ్ఞానేంద్రియాల్లా పనిచేస్తాయి.

ప్రయోగం వేరు. జీవితం వేరు.

"విజయమోహన్! మమ్మల్ని క్షమించరా" అన్నారు ముగ్గురూ ఏకకంఠంతో. సుమలత తన దృక్కుల్ని వాళ్ళపై పు సారించింది.

ఆమె కళ్ళ నిండుగా నీళ్ళు.

"ఇందులో మీ తప్పేమీ లేదురా. మీ చెల్లెలికి తోడుగా ఉండండి." గొణిగాడు.

గొణుగుతూనే కళ్ళు మూశాడు.

సుమలత చుట్టూ చీకటి ఆవరించింది.



# జీతం - జీవితం

రాజారావు భార్య వంటింట్లోంచి మెల్ల మెల్లగా సుప్రభాతం వినిపిస్తోంది సణుగుడు రూపంలో. ఇద్దరు పిల్లలు ఇడ్లీలు గబగబా నోట్లో కుక్కుకొని స్కూలుకు బయలుదేరారు. ఒకడు అయిదవ క్లాసు. రెండవ వాడు మూడో క్లాసు చదువు తున్నాడు. రాజారావు అరువు తెచ్చుకొని చదివిన పేపరు మడచి స్కూలుకు పోయే పెద్ద పిల్లవాడిచేత పక్కింటికి పంపించాడు. వాడు పేపరు పక్కింట్లో ఇచ్చి వచ్చి తండ్రి కెదురుగా నిలబడ్డాడు తమ్ముడితో సహా.

'నాన్నా! స్కూలుకు పోతున్నాం' అన్నాడు.

వాళ్ళు స్కూలుకు వెళ్ళేప్పుడు పాకెట్ మనీ క్రింద చెరొక అర్ధ రూపాయ ఇవ్వడం రాజారావుకు అలవాటు. అందుకే ఆగారు. నెలలో ఆఖరు రోజులు కావడం చేత రాజారావు చేతిలో డబ్బులు మెలగడంలేదు.

'బాబూ రెండు రోజుల్లో జీతం వస్తుంది. తరువాత ఇస్తానుగా. ఈ రోజుకు స్కూలుకు వెళ్ళండి' అనునయంగా అన్నాడు.

వాళ్ళు వినలేదు కొద్దిసేపు ఏడ్చారు. రాజారావు వాళ్ళను బ్రతిమాలి స్కూలుకు పంపించేసరికి తలప్రాణం తోకకు వచ్చింది.

అంతలో వంటింట్లోంచి అతని భార్య వచ్చింది. 'ఏమండీ మార్కెట్టుకు వెళ్ళి కూరగాయలు తెండి. కిరాణా సరుకులు కూడా అయిపోయాయి' చెప్పడం ఇష్టం లేనట్లు, చెప్పక తప్పదన్నట్లు చెప్పింది.

రాజారావు రెండో విషయం విననట్లు మౌనంగా చేతి సంచీ అందుకొని బయలుదేరాడు, ఇక ఎక్కువ సేపు ఉంటే ఎన్ని సమస్యలు వచ్చిపడుతాయోనని.

రాజారావు జీవితాన్ని పరిశీలిస్తే చాల విచిత్రంగా ఉంటుంది. అతని నెల జీవితాన్ని నాలుగు భాగాలుగా విభజించి చూస్తే ఒక్కో వారం ఒక్కో పాత్రలో మనకు కనిపిస్తాడు. అతని దృష్టిలో మెదటి వారం గోల్డన్ వీక్, రెండవ వారం సిల్వర్ వీక్, మూడవ వారం కాపర్ వీక్, నాలుగవ వారం ఐరన్ వీక్.

ఈ వారంలో రాజారావు డైనమిక్ హీరో పాత్ర ధరిస్తాడు. ఇది నెలలో మొదటి వారం జీతం తీసుకొన్న రోజునుంచి మొదలవుతుంది. ఈ వారంలో రాజా రావు బంగారు బాబులా తన జీవితాన్ని గంటనొక నిముషంగా గడిపేస్తాడు. మొదటి తేది జీతం తీసుకోగానే ఒక కె. జి. స్వీట్సు కొంటాడు. తరువాత పది రూపాయ లకు పండ్లు, ఒక రూపాయకు పూలు కొంటాడు. సైకిలు ఆఫీసులో పడేసి జల్సాగా ఆటోలో ఇంటికి వస్తాడు.

'డియర్ విమలా నువ్వు నా దేవతవు' అంటూ భార్య తలలో పూలు తురుముతాడు.

'ఒకేసారి ఇన్ని స్వీట్సు దేనికండి. నెలాఖరు వరకూ ఇబ్బంది లేకుండా గడపాలికదా'

'విమలా! మనమేమీ లక్షాధికారులం కాదు రోజూ జాలీగా ఉండడానికి. ఉన్నప్పుడే అనుభవించాలి'

'పిల్లలు ట్యూషను నుంచి ఇంకా రాలేదండీ'

'నే వెళ్ళి తీసుకొస్తానుండు' అంటూ వాళ్ళకోసం బయలుదేరుతాడు. ఆ రోజంతా పిల్లల్ని ముద్దు మురిపాలతో ముంచేస్తాడు. వాళ్ళచేత దగ్గరుండి స్వీట్సు తినిపిస్తాడు.

వాళ్ళు ఆ రాత్రి గారాలు పోతూ తమ కోర్కెలన్నీ బయట పెడుతారు. అన్నిటికీ ఆనందంగా అంగీకరిస్తాడు. వాళ్ళకు రోజూ ఇచ్చే పాకెట్ మనీకంటే ఎక్కువ ఇస్తాడు.

ఆ రాత్రి భార్యను ఆనంద తరంగాల్లో ముంచివేస్తూ 'విమలా రేపు సినిమాకు టికెట్లు రిజర్వు చేయించాను. ఒకగంట పర్మిషను పెట్టి వస్తాను. అందరం సినిమాకు వెల్దాం. హోటల్లోనే భోజనం' అంటాడు.

భర్త ఇంత ఆనందంగా కోరుతుంటే ఎందుకు కాదనడం అనుకొంటుంది విమల. ఒకవేళ కాదన్నా భర్త తన మాట వినడని విమలకు తెలుసు. అటు వంటప్పుడు అతని కనుకూలంగా అతన్ని ఉత్సాహపరచడమే మేలనుకొంటుంది.

మరుసటి రోజు ఉదయాన్నే కిరాణా కొట్టు దగ్గర కిరాణా సరుకులు తెచ్చి పడేస్తాడు. ఇంటి బాడుగ, మిగతా ఖాతా పద్దులన్నీ చెల్లిస్తాడు. అంతా పోను

రెండు, మూడు వందలకంటే ఎక్కువ మిగలదు సామాన్యంగా. ఆ సాయంత్రం ఆఫీసుకు పర్మిషను పడేసి ఆనందంగా ఇంటికి వస్తాడు.

'విమలా ఇంకా రెడీ కాలేదా. ఆటో కూడా తీసుకువ్చాను' అంటాడు.

'ఆటో దేనికండి దండగ. రిక్షాలో వెళ్దాం' అంటుంది విమల బాధగా.

'రిక్షాలో కూర్చుంటే నడుములు విరిగి పోతాయి. ఇక మాట్లాడకు'

ఆ సాయంత్రం అందరూ సినిమా చూసి, హోటల్లో భోంచేసి మళ్ళీ ఆటోలో ఇంటికొస్తారు. ఆ రాత్రి అంతా కలిపి ఖర్చు యాభై.

ఆఫీసులో కూడా ఇంతే. తన కొలీగ్స్‌ని కాఫీకి, టీకి ఆహ్వానిస్తూ ఉల్లాసంగా కనిపిస్తాడు.

'హల్లో సుమతీ అలా కాఫీకి వస్తావా' అంటూ టైపిస్టును ప్రత్యేకంగా పిలుస్తాడు. ఇంగ్లీషు అంటే పడి చచ్చే ఆమెకు తను చూసిన ఇంగ్లీషు సినిమాల గురించి గంటలు గంటలు ఉపన్యసిస్తాడు. ఆ సమయంలో సెక్షన్ హెడ్ చీవాట్లు కూడా ఇతని వజ్ర శరీరాన్ని ఛేదించలేవు.

ఇక ఇంటి దగ్గర బంధువులు వస్తే సరేసరి. వాళ్ళను విందు, వినోదాలతో ఆనందపరుస్తాడు. వేయేల అతని జీవితం వినీలాకాశంలో ముందుకు చొచ్చుకు పోయే బోయింగ్ విమానంలా ఉంటుంది.

## సిల్వర్ వీక్

క్రమేణా రాజారావు రెండవ వారంలో ప్రవేశిస్తాడు. దీన్ని అతను సిల్వర్ వీక్‌గా భావిస్తాడు. ఈ వెండి వారంలో డబ్బుకు పెద్దగా లోటుండదు. జల్సా చేయడు కాని ఈ వారం ఇబ్బంది లేకుండా గడిపేస్తాడు. మొదటి వారంలో నాలుగు మూరలు పూలుకొనే రాజారావు, ఈ వారంలో ఒక మూర పూలు మాత్రమే కొంటాడు.

సాయంత్రం ఆరు గంటలకు వస్తాడు. రాగానే విశ్రాంతిగా ఈజీ ఛెయిర్‌లో వాలుతాడు.

'మీరు ఈమధ్య పిల్లలకు స్వీట్స్ తేవడం లేదు. రేపు నేనయినా చేస్తాను' అంటుంది భార్య.

'స్వీట్సు దేనికి. బిస్కెట్లు తెచ్చానుగాని వాటిని తినమను' అంటూ కూర్చొంటాడు.

'పిల్లలు ట్యూషనుకు వెళ్ళి చాలసేపయింది. ఏమిటో ఇంకా రాలేదు'

'ప్రతి దానికీ కంగారుపడకు. వాళ్ళెక్కడికీ పోరు వస్తారులే' భార్యమీద విసుక్కొంటాడు.

ఆ వారమంతా రోజులు అలా గడుస్తుంటాయి.

'విమలా రేపు సినిమాకి వెళ్దామా'

'టికెట్లు రిజర్వు చేయించారా'

'టికెట్లు రిజర్వు చేయించడం దేనికి. నే చెప్పే సినిమా రిలీజయి చాల రోజులయింది. కరెంటు బుకింగు దొరుకుతుంది.'

ఒకప్పుడు రిక్షాలో ఒళ్ళు హూనమవుతుంది అన్నవాడే రెండు రిక్షాలు మాట్లాడుతాడు. ఒక రిక్షాలో తనూ పెద్దవాడు కూర్చుంటారు. రెండవదాంట్లో భార్య, చిన్న పిల్లవాడు కూర్చుంటారు.

ఆ రాత్రి సినిమా చూసి భోజనానికి ఇంటికే వస్తారు.

అంతకుముందు భార్యచేత బట్టలుతికించనివాడు, ఈ వారంలో ఇంటిదగ్గర భార్య లంగాలూ. బనీన్లు, బ్రాలు బావి దగ్గర ఉతుకుతుంటే కాదనడు. మౌనంగా చూస్తుంటాడు. ఆఫీసులో స్నేహితులు పిలిస్తేనే హోటలుకు వెడతాడు. అదీ వాళ్ళు బిల్లు చెల్లించేట్లుగా ఉంటేనే.

'ఏమండీ ఈమధ్యన మీరు నన్ను కాఫీకి పిలువడంలేదు. కారణం' గారాలు పోతూ అడుగుతుంది టైపిస్టు సుమతి.

'సారీ సుమతీ లెటజ్ గో' అంటాడు.

ఇద్దరూ కాంటీన్‌లో కూర్చుంటే ఇతనికంటే ఎక్కువ సుమతే మాట్లాడుతుంది. బిల్లు రాజారావే పే చేస్తాడు.

ఇద్దరూ మౌనంగా తిరిగి వస్తారు.

ఆఫీసులో హెడ్ క్లర్కు ఏమయినా అంటే తలవంచుకొంటాడు. ఎదురు మాట్లాడడు.

'ఎప్పుడు వచ్చారు' అంటూ ముక్తసరిగా పలుకరిస్తాడు వచ్చిన బంధువుల్ని.

వాళ్ళేమయినా మాట్లాడితే 'ఊ....ఆ....' అంటూ ముభావంగా జవాబు చెపుతాడు.

ఎక్కువ మాట్లాడితే ఎక్కడ శాశ్వత నివాసం ఏర్పరచుకొంటారోనని అతని భయం.

అతని జీవితం మొదటి వారం ఆకాశంలో పయనించే బోయింగ్ విమానమయితే, ఈ వారంలో అతని జీవితం నున్నని సిమెంటు రోడ్డు మీద వందమైళ్ళ వేగంతో పరుగెత్తే కొత్త ఇంపాలా కారులాగుంటుంది.

## కాపర్ పీక్

రాజారావు జీవితం మూడవ వారంలో ప్రవేశించగానే అతని జీవిత విధానమే మారిపోతుంది.

ప్రస్తుతం ప్యూపా దశలో ఉంటాడు. ఇప్పుడు అతని జీవితం గతుకుల రోడ్డు మీద నడచే రిక్షాలాగుంటుంది. ప్రతి క్షణమూ నలుపై పులనుంచీ ఒడిదుడుకులు తగులుతూ ఉంటాయి. అయినా తన పరిధిలోనే తను ముడుచుకు కూర్చుంటాడు. వీలున్నంత వరకు మౌనాన్ని పాటిస్తాడు. కదిలిస్తే విసుక్కుంటాడు.

'ఏమండీ మీరు తెచ్చిన సామాన్లు నిండుకొస్తున్నాయి. ఇక రెండు మూడు రోజులకంటే ఎక్కువ రావు' భార్య పరిస్థితి తెలియజేస్తుంది.

'ఇదికూడా నాకు చెప్పాల్నా. పొదుపు అనేది మనిషికి ముఖ్యం. జాగ్రత్తగా ఆ మూడు రోజుల సరకుల్ని నెలాఖరు వరకు సర్దాలి. దాన్నే గృహస్థ ధర్మమంటారు.'

'ఏం చేయమంటారండి. రెండు మూడు రోజుల్లో వస్తున్నట్లు మా అమ్మ ఉత్తరం కూడా వ్రాసింది.'

'ఖర్మ. వస్తానని రాసిందీ' దీర్ఘం తీస్తాడు. అత్తగారి ముందు తన లేమితనం ఎక్కడ బయట పడుతుందోనని భయపడుతూ? ఎక్కడయినా అప్పు తెచ్చి ఈ వారం జాగ్రత్తగా లాగెయ్యాలని నిర్ణయించుకొంటాడు.

ఈ వారంలో రాజారావు అప్పుల వేట ప్రారంభమవుతుంది. ఒకవైపు అహం అడ్డువస్తే, ఇంకోవైపు అవసరం ఎదురు చూస్తుంటుంది. ఈ రెండు పరిస్థితుల మధ్య రాజారావు గిజగిజలాడిపోతాడు.

బావి దగ్గర బట్టలు ఉతికే భార్యతో 'మనమిక లాండ్రీలను మరచిపోవాలి. అన్ని బట్టలూ ఇంటిదగ్గరే ఉతుకు' అంటాడు.

ఆమెకు ఆ రోజు నుంచి భర్త బట్టలు, తన చీరెలు, పిల్లల చొక్కాలు ఉతకడంతోనే పొద్దస్తమానం గడచిపోతుంది.

పిల్లలు ఏదిచేసినా చీటికి మాటికి ఉగ్రుడై పోతాడు. 'గాడిదల్లారా ఏమిట్రా మీ అల్లరి. గలభా చేసారంటే వీపు పేలిపోతుంది.' అంటాడు.

ఎప్పుడయినా పిల్లల బలవంతం మీదనో, భార్య కోరిక మీదనో సినిమాకు వెళ్ళాల్సి వస్తుంది. అందరికీ ఒకే రిక్షా మాట్లాడుతాడు.

'ఒక్క రిక్షాలో నలుగురం ఎలా పోగలమండీ'

'ఎలాగో సర్దుకు పోవాలి. ప్రతిదీ మనకు సౌకర్యంగా ఉండాలంటే ఎలా' అంటాడు భార్య మాటలకు విసుక్కుంటూ.

నలుగురూ ఒకే రిక్షాలో కూర్చుంటారు. రాజారావు పెద్దవాడ్ని ఒళ్ళో కూర్చోబెట్టుకొంటే, చిన్నవాడు తల్లి ఒళ్ళో కూర్చుంటాడు. వచ్చేప్పుడుకూడా అందరూ ఒకే రిక్షాలో వస్తారు.

ఆఫీసులో కూడా ఆ వారంలో లేనిపోని గాంభీర్యం తెచ్చుకొని గడుపుతాడు.

'ఏమండీ సుమతిగారూ ఈరోజు మీరు టీ ఇప్పించండి. మీ చేతి టీ త్రాగాలని ఎందుకో బుద్ధి పుట్టింది' అంటాడు లేని చిరునవ్వు తెచ్చిపెట్టుకుని.

'ఓ ఎస్. అలాగే ఈ వారమంతా నేనే టీ ఇప్పిస్తాను.

రండి' అంటుంది టైపిస్టు సుమతి అతని మాటలకు పొంగిపోయి.

ఈ వారంలో సెక్షన్ హెడ్ ఏదయినా మాట్లాడినా ఎదురు తిరిగి మాట్లాడుతాడు. ఎక్కువగా సాయంత్రాలు పార్కులో గడిపేస్తుంటాడు. ఇంటికిపోతే అది లేదు. ఇదిలేదు అనే భార్య కామెంట్లకంటే ఇక్కడ ప్రశాంతంగా ఉంటుందనుకొంటాడు.

## ఐ ర న్ వీ క్

ఈ వారం అతనికి చీకటి రాత్రిలా కనిపిస్తుంది. అతనికి ప్రతిరోజూ తను గోల్డన్‌వీక్‌లో గడిపిన స్వర్ణయుగం గుర్తుకొస్తుంటుంది. నెలకు ముప్పై రోజులు సరాసరి కనుక ఐరన్‌వీక్‌లో ఇంకో రెండు రోజులు వచ్చి చేరుతాయి. మూలిగే నక్కమీద తాటిపండు పడ్డట్లు. ఈ వారాన్ని ఇంకో విధంగా లాంగెస్ట్ వీక్ అని కూడా వర్ణించవచ్చు.

ఈ వారంలో రాజారావు యుద్ధంలో ప్రాణంమీద చివరి ఆశతో పోరాడే సైనికుడిలా గడుపుతాడు. చెడిపోయిన కారుని వెనుకనుంచి నెట్టినట్లు రోజులు ఇతణ్ణి నెట్టుకుపోతాయి. గడ్డం పెంచుతాడు. ముఖంలో ట్రాజెడీ ఫీలింగ్స్ పెడతాడు. రాబోయే జీతం గుర్తు తెచ్చుకొని ఒకింత తృప్తిపడుతూ గడుపుతాడు.

అవసరానికి అప్పిచ్చే సాధుడు ఒక్కడూ కనిపించడు. అడిగి అందరిచేతా లేదనిపించుకోవాల్సి వస్తుంది. అతని భార్య, ఇరుగమ్మ, పొరుగమ్మ దగ్గర గిన్నెల్తో అరువు అందుకొని సంసారం నెట్టుకొస్తుంది. తండ్రి భీకరాకారం చూసి పిల్లలుకూడా దగ్గరకు రావడానికి భయపడతారు.

'నిన్న నెల్లూరునుంచి వెల్కానోత్తమ్ రాజారావ్. మీ దూరపు బంధువు సన్యాసిరావు కనిపించి ఇరవై ఎనిమిదో తేదీ ఇక్కడకు వస్తున్నట్లు చెప్పమన్నాడు. సెక్రటేరియట్‌లో ఏదో పనుందట' అన్నాడనుకోండి పక్కింటి పెద్దమనిషి.

'అరెరె మేము ఈ వారమంతా మా అత్తగారి ఊరికి వెళుతున్నామే. నెలాఖరు వరకు రాము. ఆ విషయం వ్రాస్తాను' అంటూ ఆ విషయం వ్రాసేంతవరకు రాజారావుకు తృప్తి ఉండదు.

'ఏమండీ ఈరోజు సినిమాకు పోదామండీ. చాల మంచి సినిమాఅట.'

'ఇప్పుడు లేదులే విమలా. ఒకటవ తేదీ తరువాత పోదాం'

'ఈ రోజుతో సినిమా ఆఖరుట. పిల్లలు ఊరుకోవడంలేదు.'

'నన్నేం చెయ్యమంటావు. ఇప్పుడు డబ్బెక్కడిది'

'ఏమో నాకేం తెలుసు' మూతి ముడుచుకొంటుంది.

భర్త ఆఫీసుకు వెళ్ళేంత వరకూ రుసరుస లాడుతూనే ఉంటుంది. మధ్యాహ్నం భోజనానికొచ్చినా పలకదు. పిల్లలుకూడా తండ్రిపైపు కోపంగా చూస్తారు. తప్పనిసరి పరిస్థితుల్లో ఆరోజు సినిమాకు తీసుకుపోతాడు.

రాజారావు రిక్షా ప్రసక్తే ఎత్తడు భార్యకూడా అతనికి భయపడి మాట్లాడదు. సిటీబస్సు పట్టుకొని సెంటర్లో దిగి అక్కడనుంచి నడచిపోతారు ఎంతదూరమైనా.

గలగల మాట్లాడే రాజారావు ఈ వారమంతా ఏదో పోగొట్టుకున్నవాడిలా దిగులుగా ఉంటాడు. ఒకపైపు ఫైల్సూ, ఇంకోపైపు కేలండరూ ఉంటాయి. ఒకటవ తేదీకి రోజులు లెక్కపెడుతూ ఉంటాడు.

'చాల దిగులుగా కనిపిస్తున్నారు. ఏమైనా అవాంఛనీయ సంఘటనలు జరిగాయా' అంటుంది టైపిస్టు సుమతి.

ఏం చెప్పడానికి తోచక 'అవును. మా దూరపు బంధువొకాయన పోయాడు' అంటాడు.

ప్రతిసారీ అలా చెప్పలేడు కదా? ఒకసారి భార్యకు బాగులేదని, ఇంకోసారి తల్లికి బాగులేదని ఇలా రకరకాలుగా చెప్పి తప్పించుకుంటాడు. పంక్చరయిన సైకిలు ట్యూబుకు ఎంత గాలి కొట్టినా నిలువనట్లు, అతను తెచ్చే చిల్లర అప్పులు ఏ మూలకూ చాలవు.

* * * *

మార్కెట్‌కు వెళ్ళి ఏదో కొన్నాడనిపించి ఇంటిపైపు నడక సాగించాడు. అదేనెల మొదటిరోజుల్లో అయితే కూరగాయలు సంచి నిండుగా వేసుకొని ఈల వేసుకొంటూ ఇంటికి వచ్చేవాడు.

గత నెల జీవితపు జ్ఞాపకాలు అతన్ని వెన్నాడుతున్నాయి. ఇకనుంచి జీతాన్ని నాలుగు భాగాలుగా విభజించి నెలంతా ఒకే విధంగా గడపాలని దారిలో నిర్ణయించుకొన్నాడు.

రాజారావు కూరగాయల సంచి ఇంటిలో పెట్టి సైకిలు తీసుకొని ఆఫీసుకు బయలుదేరాడు. ఆ రోజు నెలాఖరు. ముప్పయివ తేది. ఈ రోజు గడిస్తే రేపు జీతం వచ్చేస్తుంది. నెలలో ఆఖరు రోజు జీతం యివ్వమని గవర్నమెంటు

ఎప్పుడో జీవో. ఇష్యూ చేసింది కాని తమ జీతాల బిల్లులు హెడ్ ఆఫీసులో పాస్ అయి చెక్కు రావాలి. అందువలన తమ జీతం ఒకటవ తేదీ వస్తుంది.

రాజారావు మెల్లగా ఆఫీసులో ప్రవేశించాడు. "ఏమోయ్ బిల్లులు పాసయ్యా యట్నా" కొలీగ్ మోహనరావుని అడిగాడు.

''ఆ....డైరెక్టరుగారు బిల్లులమీద సంతకాలు చేశారట. సాయంత్రానికల్లా వచ్చేస్తుంది.'

"హమ్మయ్య చల్లనిమాట చెప్పావు అన్నాడు'' రాజారావు.

"అవున్రా మంత్ ఎండింగ్‌కదా. డబ్బులకు కటకటగా ఉంది"

రాజారావు ఫైల్సు ముందేసుకొని కూర్చున్నాడేగాని అతని మనసంతా నిము షాల్ని, గంటల్ని లెక్కపెడుతూ ఉంది. ఇంకా ఇరవైనాలుగు గంటలు ఎప్పటికి గడుస్తాయా. ఎప్పుడు జీతం చేతిలో పడుతుందా అని ఆలోచిస్తున్నాడు. సరిగ్గా సాయంత్రం మూడు గంటలకు స్పెషలు మెసెంజరుద్వారా జీతాల తాలూకు చెక్కు పంపాడు డైరెక్టరు. రాజారావుకు ఈ వార్త ఏడుగుర్రాల రథంమీద స్వారీ చేసి నట్లుంది. ఈ ఒక్క రాత్రిగడిస్తే చాలు అనుకొంటున్నాడు. ఆ రాత్రే భార్యతో మాట్లాడి ఒక నిర్ణయానికి వచ్చాడు. జాగ్రత్తగా జీతాన్ని వాడుతూ నెలాఖరు వరకు వర్రీలేకుండా బ్రతకాలని.

మరుసటి రోజు గంట ముందుగా ఆఫీసుకు బయలుదేరాడు. ఆఫీసులో ఆ రోజు అతను ప్రతిక్షణాన్ని ఆనందంగా గడిపేస్తున్నాడు. కొత్తకొత్త జోకులతో ఆఫీసునంతా నవ్విస్తున్నాడు. ఎస్టాబ్లిష్‌మెంటు క్లర్కుని దగ్గరుండి బాంకుకు పంపించాడు. అతనికి సాయంగా మేనేజరు ఒకడ్ని పంపిస్తూంటే, ఇద్దరుండడం మంచిది సార్ అంటు రెకమండ్ చేసి ఇంకో ప్యూనుకూడా వెళ్ళేఏర్పాటు చేసాడు. ఆఫీసుకు క్యాష్ జాగ్రత్తగా తెమ్మని మరీమరీ సలహా యిచ్చాడు.

గది గుమ్మంలో అడుగుల చప్పుడయితే తలతిప్పి చూస్తున్నాడు. మేనేజరు ఫైయిల్లో తప్పులు వెతికి తిట్టడానికి పిలిస్తే జీతం తీసుకువెళ్ళమని పిలుస్తున్నట్లు ఫీలవుతున్నాడు.

సమయం దాదాపు మధ్యాహ్నం ఒంటి గంట అవుతుందనగా హడావుడిగా వచ్చాడు ప్యూను శంకరయ్య.

ప్యూనును కౌగిలించుకొన్నంత పనిచేసి "నాయనా శంకరయ్యా. మనవాళ్ళు డబ్బు తీసుకొని వస్తున్నారా" అడిగాడు ఎంతో అప్యాయంగా.

"సార్ కొంప మునిగింది. ముందు మన మేనేజరుగారెక్కడో చెప్పండి" వగరుస్తూ అన్నాడు శంకరయ్య.

"ఆయన యూరినల్సుకు వెళ్ళాడు. ఇప్పుడే వస్తాడు గాని ఏం జరిగిందో చెప్పు"

ఈ లోపల ఆఫీసువాళ్ళంతా శంకరయ్య కంగారుతో కూడిన ముఖ కవళికలు చూసి భయపడ్డారు.

"ఏం జరిగిందో చెప్పు" అంటూ తొందర చేసారంతా.

"ఏం చెప్పమంటారు సార్. డబ్బు డ్రా చేసి బాగ్‌లో పెట్టుకొని వస్తున్నాం సార్. బాంకు దాటామో లేదో నలుగురు రౌడీలు మోహనరావుగారి చేతిలోని బాగ్ లాక్కొని పరుగెత్తి పక్క సందులో మాయమైపోయారు. మోహనరావుగారు ఆశీర్వాదమూ కలసి పోలీసు రిపోర్టు యివ్వడానికి వెళ్తే విషయం చెబుదామని నేనిలా వచ్చాను" అంటూ ఏడుపు ముఖం పెట్టాడు శంకరయ్య.

అంతా దిగ్భ్రమ చెందారు. "ఈ నెలకు ఇంక మీ జీతం వస్తుందిరో దేవుడో" అంటూ బావురుమన్నాడు రాజారావు.

అప్పుడే యూరినల్సుకు వెళ్ళివచ్చిన మేనేజరు విషయం తెలియక సైక్లోనులో సర్వం కొట్టుకుపోయిన తుఫాను బాధితుడిలా ఏడుస్తున్న రాజారావును మొదట ఓదార్చి తరువాత విషయం గ్రహించాడు. వెంటనే హెడ్ ఆఫీసులో ఉన్న డైరెక్టరు గారికి ఫోనుచేసి విషయం చెప్పాడు. తను శంకరయ్యను తీసుకొని పోలీసు స్టేషనుకు బయలుదేరి వెళ్ళాడు.

'అయ్యా మీ జీతాలు ఎక్కడికీ పోవు. ఓపికగా ఉంటే అర్ధరాత్రి అయినా సరే మీ జీతాలు మీకు బట్వాడా చేస్తాను' వెళ్ళేముందు ధిగులు పడిన స్టాఫుకు హామీ ఇచ్చి మరీ వెళ్లాడు.

రాజారావు ఆ హామీని నమ్ముకొని ఆఫీసులోనే ఉండిపోయాడు. అతనిలో ఆత్మ విమర్శ మొదలయింది. ఒక నెల జీతం రాకపోతే తన పరిస్థితి ఏమిటి? రోడ్డు మీద బిచ్చగాడికి, తనకూ తేడా ఏమిటి? సంఘంలో తన విలువ ఎంత దిగజారిపోతుంది. అప్పుడు గుర్తుకొచ్చింది అతనికి పొదుపుయొక్క ఆవశ్యకత. ఇకనుంచి కొన్ని ఖర్చులు మానుకొని అయినా నెలకు వంద రూపాయలు పొదుపు చేయాలి అనుకొన్నాడు.

రాజారావు అదృష్టం బాగుండి పోలీసులు దొంగల్ని పట్టుకొన్నారు డబ్బుతో సహా. దొంగిలించిన వారు పారిపోకుండా భయపడి ప్రక్కనే ఉన్న ఒక టీ బంకులో దూరారు. పోలీసులు రోడ్డుమీద తిరుగుతుండడంతో వాళ్ళు ఎంతసేపటికి బయటికి పోరు. దాంతో అనుమానమొచ్చిన ఆ టీ బంకు ఓనరు ఆ విషయం పోలీసుల చెవిన వేశాడు.

డబ్బుతెచ్చిన మేనేజరు రాజారావుతో బాటు కాసుకొని కూర్చొని ఉన్న విశ్వనాథం, రామచంద్రయ్యలకు జీతం ఇచ్చాడు. అర్ధరాత్రి రాజారావు ఆటోలో ఇంటికి వెళ్ళి భార్యకు జరిగిందంతా వివరించాడు.

"సారీ విమలా టైమ్‌లేక ఏమీ తేలేక పోయాను రేపు పిల్లలకు స్వీట్సు తెస్తాను. పిక్చరుకు కూడా రిజర్వేషను చేయిస్తాను" అంటున్న భర్త నోరు మూసింది విమల.

"నిన్న మీరే చెప్పారుగా పొదుపు చెయ్యాలని. ఇకమంచి నెలకు ఒక్కసారే సినిమా ప్రోగ్రామ్."

"అలాగే" అంటూ అప్పటికి బెడ్‌మీద వాలాడు.

"దేవుడా ఆయన మనసు ఇకనయినా మార్చు. ఈ సంఘటన మా జీవితాలకు గుణపాఠం కావాలి". అని దేవుణ్ణి కోరుకుంది విమల.



మునిగిపోయినట్లు రెండు నిముషాల్లో మొత్తం ఊదేసింది. తరువాత అయ్యబొచ్చె తన బొచ్చె కడిగి లోపల చూరులో దోపింది.

"అయ్యా అన్నీ తెస్తివా, ఇక మొదలెడదామా" అంది వస్తూనే. పావడా మోకాళ్ళపైకి ఎగగట్టి, పైట నడుంచుట్టూ తిప్పి దోపుకుంది. కొండయ , మల్లమ్మ ఇద్దరూ మురుగు కాలువలో దిగారు. బానకు మధ్యలో కట్టిన కర్రను చెరొకవైపు పట్టుకొన్నారు. మురుగు కాలువలో దిగి దాన్ని నిండుగాముంచి గట్టున పోస్తున్నారు. గట్టుమీద నుంచి మొదలయిన కాలువగుండా నీళ్ళు గుడిసె ప్రక్కనే ఉన్న కూరగాయల తోటలోకి పోతుంది.

మొత్తం ఇరవై సెంట్లున్న ఆ స్థలంలో బెండ, వంగ, మిరప, టమోటా చెట్లున్నాయి. బీరచెట్లు, సొరచెట్లు చుట్టూ ఉన్న కంచెకు అల్లుకొని ఉన్నాయి. వాళ్ళకు జీవనాధారం ఆ చెట్లయితే, చెట్లకు జీవనాధారం మురుగు కాలువలోని నీళ్ళు. రోజూ ఉదయం ఆ మురుగు కాలువలోని నీళ్ళతోడి చెట్లకు పోస్తారు. సాయంత్రం కూరగాయలు కోసి ఉదయాన్నే నెత్తిన పెట్టుకొని ఊళ్ళోకి వెళ్ళి అమ్ముతాడు కొండయ్య. పప్పు, బియ్యం, నూకలు, డబ్బు మొదలయిన అన్నిరకాలు కూరగాయలకు ప్రత్యామ్నాయంగా తీసుకొంటాడు. మల్లమ్మ పనిఉన్న రోజు పనికి పోతుంది. లేనిరోజు గుడిసెలోనే ఉండి తోటపని చేస్తుంది. ఇట్లా నడుస్తుంది వాళ్ళ జీవనరథం.

"ఏంది అమ్మీ ఇయ్యాల పనికి ఎల్తనంటావా"

"ఎల్తను అయ్యా. నువ్వు ఈ రోజు ఇంటికడనే ఉంటి విగన్క నే చేసేదేముంది గంజి కాసిపెట్టి పన్లొకెల్తన్లే" అంటూ గట్టెక్కింది. గుడిసెముందు బాదంచెట్టు క్రింద బానలో ఉన్న మంచి నీటితో కాళ్ళకు చేతులకు అంటిన బురద కడుక్కొంది. మల్లమ్మ వంటకు, స్నానానికి దగ్గరలో ఉన్న నాయుడిగారి చేలో పంపు దగ్గరనుంచి నీళ్ళు తెస్తుంది.

లోపలకు వెళ్ళి తాటాకు ముక్కలు పొయ్యిలో వేసి, చిదుగులతో పొయ్యి రాజేసింది. తరువాత గంజి చిక్కగా కాసింది. కొద్దిసేపు చల్లారబెట్టి పైనుంచి వ్రేలాడుతున్న ఉట్టెలో ఇనప్పెట్టెలో పెట్టినంత భద్రంగా పెట్టింది. తరువాత పగిలిపోయిన అద్దంముక్కలో చూసుకొంటూ విరిగిపోయిన దువ్వెనతో చిక్కులు సరిచేసుకొని జడవేసుకొంది. మొన్నీమధ్య తను సంతలో తెచ్చుకొన్న తిలకంతో బొట్టు పెట్టుకొని బయటకు వచ్చింది.

మల్లమ్మ తండ్రికి అన్నీ చెప్పి పనికి బయలుదేరింది. మల్లమ్మకు అన్ని పనులూ తెలుసు. నాలుగేళ్ళ క్రితం తల్లి జబ్బుతో మరణించింది. తగిన పనుల్లేక, దాంతో తినడానికీ తిండిలేక వచ్చిన ఆకలిజబ్బు అది. మల్లమ్మ తల్లి పున్నమ్మ కూతుర్ని పదేళ్ళప్రాయం నుంచే తనతో కూలిపనులకు తీసుకువెళ్ళేది. దాంతో మల్లమ్మ అన్ని పనుల్లోనూ ఆరితేరింది. విత్తనాలు చల్లడం మొదలుకొని కలుపు తీయడం, నాట్లు వేయడం, వరి కోయడం, మోపులు మోయడం, కుప్ప నూర్చడం వరకు అన్నీ నేర్చుకొంది.

మల్లమ్మనలా వెళ్ళనిచ్చి దోకుడుపార తీసుకొని గుడిసె ప్రక్కనే ఉన్న తోటలోకి పోయాడు కొండయ్య. తోటచుట్టూ కంపమండలు పాతి తాటాకు దడి కట్టిమంచె ఏర్పాటు చేసి ఉంది బయటనుంచి పశువులు, మేకలు వచ్చి కూర గాయల పాదులు నాశనం చేయకుండా ఈ ఏర్పాటు చేసాడు. ఒక విధంగా మను షుల నుండి కూడా ఇది రక్షణ కలిగిస్తుంది.

కొండయ్య చెట్లకున్న జీడ దులిపి, కాపుపూత పరిశీలించాడు, తోటంతా కలియతిరుగుతూ. వంగ బెండ,టమేటా చెట్లు విరగకాసి నిండుగా పూర్ణగర్భిణులులా ఉన్నాయి. టమోటాకాయలు పచ్చివి పచ్చగాను, ముదిరినవి పసుపు రంగులోను, పండినవి ఎర్రగా నిగనిగలాడుతూ ఉన్నాయి. తడికలకు అల్లుకొని ఉన్న సొర, బీరచెట్లనుంచి కాయలు చిక్కగా వ్రేలాడుతున్నాయి. ఈ యేడు పంట బాగుండాది దిగుల్లేదు అనుకుంటూ కొండయ్య చేతిలోని దోకుడుపారతో ఓ మూలనుంచి చెట్ల మధ్య పెరిగిన పచ్చిగడ్డిని దోకసాగాడు. కొద్దిసేపు అలా దోకింతర్వాత "నీళ్ళు ఎట్టేది లేదు కనుక రేపు పాదుల్ని తవ్వాలి'' అనుకొన్నాడు.

గుడిసెలోకి వచ్చి ఉట్టిమీద నుంచి గంజి కుండను అమృతభాండంలా జాగ్రత్తగా దించాడు తరువాత తోటలోని పచ్చిమిరపకాయలతో మల్లమ్మ చేసిన పచ్చడిని ఎడమ అరచేతిలో ఉంచుకొని, కుండలోని గంజిని బొచ్చెలోకి వంచు కున్నాడు. కుడిచేత్తో బొచ్చెలోని గంజిని జుర్రుకొంటూ, మధ్యమధ్య కుడిచేతి చూపుడు వ్రేలుతో ఎడమ అరచేతిలోని పచ్చడ్ని నాక్కుంటూ తన్మయత్వంతో తిన్నాడు. తరువాత సిరా అయిపోయిన పేనాతో తెల్లకాగితం మీద అటూ ఇటూ గీసినట్లు మెతుకుల్లేని ఆ బొచ్చెను అన్ని కోణాల్లోంచి మార్చి మార్చి నాకాడు.

తరువాత ఆరడుగుల పొడవున్న కొండయ్య, ఐదడుగుల పొడవున్న కుక్కి మంచం మీద పడుకొని గురక తీయసాగాడు. దూరంనుంచి చూస్తే ఆరడుగుల పొడ

పున్న వాణ్ణి అయిదు అడుగుల గోతిలో కుక్కినట్లు తల, కాళ్లు మాత్రమే పైకి కనిపిస్తూ మిగతా శరీరం కుక్కి మంచంలో కూరుకుపోయి ఉంది. కోట్లకు పడగ లెత్తిన వాడికికూడా అనుకొన్నప్పుడు అటువంటి నిద్రరాదు. మందులతో నిద్రపట్టినా అది కృత్రిమమే అవుతుంది. కాని కడుపునిండిన బీదవానికి ఎప్పుడు పడుకొంటే అప్పుడు నిద్ర వస్తుంది. వాడికి ఈస్టమన్ కలర్‌లో కలలు రావు. వాడు కలలకు అతీతంగా సహజమైన నిద్రపోతాడు.

కొండయ్య కాస్సేపు కుక్కి మంచంలో గుర్రుపెట్టి లేచాడు. పొయ్యిదగ్గర పడేసిన బీడిముక్క వెలిగించి పొగ వదిలాడు. తరువాత తాపీగా బయటకు నడిచి తడిక తీసుకొని తోటల్లోకి ప్రవేశించాడు. తోటలో ఒక మూల ఉన్న ఒక పెద్ద గంప, నాలుగు చిన్న బుట్టలు తీసుకొని తోట మధ్యలో ఉంచాడు. బాగా పక్వంలో ఉన్న బెండకాయలు, టమేటాలు, వంకాయలు, బీరకాయలు ఒక్కొక్క రకం ఒక్కొక్క బుట్టలోకి కోసాడు. తరువాత బుట్టలన్నిటినీ గంపలో సర్ది గుడిసెలోకి చేర్చాడు.

ప్రొద్దుకూకడానికి ఒక బారెడు పొద్దుందనగా 'నాయుడుగారు పిలుస్తుండా' రంటూ వచ్చాడు ఆయనగారి పాలేరు. 'ఏం బాధలొచ్చినయిరో దేవుడో' అను కొంటూ గుడిసె తడిక పురికొసతో గట్టిగా కట్టి పాలేరు వెనుకనే షెడ్డు దగ్గరికి నడిచాడు కొండయ్య. రెండుపైపులా పెన్నుతీసిన వరి కర్రలు యౌవనంలో ఉన్న కన్నెపిల్లల్లా ఊగుతూన్నాయి కొండయ్య వాటిని తాకుతూ పోతూ కన్నబిడ్డ తలను స్పర్శించిన అనుభూతి చెందాడు.

నాయుడు షెడ్డుముందు బోనులోంచి బయటపడ్డ పెద్దపులిలా కూర్చొని ఉన్నాడు. నీళ్ళపంపు జబ్బుమనిషి వాంతి చేసుకొన్నట్లు ఎడతెరిపిలేకుండా నీటిని బయటకు చిందుతూ ఉంది. నాయుడు ఆవులించి, తల విదిలించి అప్పటివరకు తనకు కొండయ్యమీద ఉన్న కోపపు ఛాయల్ని పోగొట్టుకొని మేకవన్నె పులిలా మారాడు.

"కూర్చోరా కొండా" అన్నాడు తరువాత.

కొండయ్య నాయుడికెదురుగా సర్వే రాయి ప్రక్కనే చప్పుడు విని పొద వెనుక దాగిన కుందేలులా ముంగాళ్ళమీద కూర్చున్నాడు. ఎప్పుడు సందు దొరికితే అప్పుడు తప్పించుకొని వెళ్ళడానికన్నట్లు. కొండయ్యకు వెనుకవైపుగా పాలేరు ఠీవిగా నిలబడి ఉన్నాడు. వాడు రాజాజ్ఞ అయితే తల తీయడానికి సిద్ధంగా ఉన్న తలారిలా ఉన్నాడు.

"అయితే ఏమాలోచించావురా కొండా" ఆగిపోయిన రేడియో హఠాత్తుగా ఎత్తుకొన్నట్లుగా సంభాషణ మధ్యలో మొదలుపెట్టాడు నాయుడు.

"తమర్తో ఆ ఇసయం ఎన్నడో ఇన్నవించుకొన్నాను గదండి" అన్నాడు కొండయ్య, తల వంచుకొని రెండు చేతుల్తో రాని గడ్డిపూచల్ని పెరుకుతూ.

"అది నువ్వు చెబుతూనే ఉండావు నేను ఇంటూనే ఉండా. అదిగాదురా నేనడిగేది. విషయం ఈ కోతలకు తేలిపోవాల. అందులో అది మిట్టమీద ఉంది. తరువాత నారేపేటప్పటికి నే దాన్ని చదును చేసుకోవాలిగదా?"

కొండయ్య కొద్దిసేపు బెల్లంకొట్టిన రాయిలా ఉండి, తరువాత నిద్రలేచిన కోడిపుంజులా ముడుచుకొన్న కాళ్ళమీద నుంచి లేచి నిలబడ్డాడు.

"దొరా! నేను దానిమీద బతికేటోడ్ని. నా నోటికాడిది తీయించమాకండి" అన్నాడు చేతులు జోడించి.

"అయితే ఏమిట్రా నువు చెప్పేది మురికినాయలా. అది ఇవ్వనంటావ్ ఏటా ఇదే పాటేనా? అదేం భూమనుకొన్నావ్. పోరంబోకు భూమి. నేను అనుకొన్నానంటే నిముషాల్లో గెంటేసి ఆ భూమి కలుపుకోగల్ను. గవర్నమెంటువాళ్ళు కూడా సాగుపొలం ప్రక్కనున్న పోరంబోకు కలుపుకొంటే ఏమీ అన్రు. గవర్నమెంటు రేటు కడితే దానికి పట్టాకూడా ఇచ్చేస్తారు. ఏమనుకున్నావో" అరిచాడు నాయుడు

కొంపతీసి నాయుడు అన్నంతపని జేసి పట్టా తెచ్చుకుంటాడేమోనని కొండయ్య, వీడు నిజంగా పోరంబోకుకు పట్టారాదని తెలిసి తరువాత తనను చులకనగా చూస్తాడేమోనని నాయుడు ఒకరికొకరు మనసులోనే ఊహించుకొని ఒక క్షణం భయపడ్డారు.

"అదేంటి దొరా!! ఎంత పోరంబోకు అయినా అది ఈనాటిదా. మా తాత ముత్తాతలనుంచి అనుభవిస్తా ఉంటిమి. మా తాతకొక్కడే కొడుకు మా నాయన. మా నాయన కొక్కడ్నే కొడుకుని నేను. ఆ మురికాల్వలోని నీళ్లు, ఆ దిబ్బమీద తోటేగదండి మా బతుకుదెరువు. గవర్నమెంటోళ్ళు మాత్రం ఎట్టా కాదంటారు" వినయంగానే కనిపిస్తూ యదార్థం మాట్లాడాడు. కత్తితో పొడవకుండా, ఎలక్ట్రిక్ షాక్తో చంపినట్లు ఫీలయ్యాడు నాయుడు.

"ఒరే కొండా! గవర్నమెంటోళ్ళ సంగతి అట్లా ఉంచరా. నీ సంగతి ఎత్తుకో. ఆ మురుక్కాలవ గట్టులో ఉంటూ ఆ గుడిసెలో ఉంటున్నావు జబ్బులు రావట్రా వూళ్ళోని చెత్తా, చెదారం, కంపూ అంతా దాంట్లోనే గదరా ఉండేది. ఎట్లా భరిస్తున్నారురా ఆ మురిగ్గబ్బు. నే చెప్పినట్లు వినరా. దొడ్లో గుడిసేసుకొని మా ఇంటికాడ ఉండండిరా. నీ కూతుర్ని మా ఇంట్లో పనికి పెట్టు నువ్వు మా పశువుల కాడుండు. ఇద్దరికీ కూటికి జరిగిపోద్ది. ఆ మురుక్కాలవ ప్రక్కనున్న ఇరవై సెంట్లు నా కొదిలెయ్. నా చేలో బాగా కలసిపోద్ది. ఏమంటావు" ఎంతో కోపాన్ని దిగమ్రింగుకొని, మంచితనాన్ని నాలుక చివర పెట్టుకొని నవ్వుతూ మాట్లాడాడు నాయుడు.

తోక తొక్కిన త్రాచుపాములా మనసు బుసకొడ్తూ ఉంటే, కొండయ్య దానిని పాములవాడు మడిచి బుట్టలో పెట్టినట్లు, ఆవేశాన్ని బయటకు రానీయకుండా గొంతు దగ్గర అదిమి ఉంచి, ఆ ఒత్తిడిని తట్టుకోలేక ఒక క్షణం ఉక్కిరి బిక్కిరైపోయాడు.

తరువాత నెమ్మదిగా పింఛం విప్పిన నెమలిలా "దొరా! మీ తాతలు మా తాతలకు తెలుసు. ఏనాడయినా ఇంత దుర్మార్గానికి పూనిర్రా, మీ తాతల మంచితనం గురించి, మీ నాయన్ల గొప్ప గుణం గురించి మా నాయన చెబుతూంటే ఎంతో సంతోషంగా ఇనేవాడ్ని. ఇట్టాంటి దరమ పెబువులు ఉండారా అని. మా వంశంలో మా మెప్పుడూ ఒకరికింద పనిచేసి ఎరగం. మీకు కంపుకొట్టే మురుగు కాలువ మాకు గంగాబవాని. మా కడుపులు నింపేతల్లి. పనుండి పక్కూరుకెళ్ళి పడుకొంటే మాకు నిద్రరాదు, మళ్ళీ మురుగుకాలువ వాసన తగిలిందాకా. మాకుఅది సాంబ్రాణి కడ్డీల వాసన. అది మేమూ తల్లీ బిడ్డలం" భక్తితో గాలిలోనే కళ్ళద్దుకొంటూ చెప్పాడు కొండయ్య.

"అంతేనంట్రా కొండా" నాయుడు డీలా పడిపోయాడు. వూళ్ళో పలుకుబడి అందరికంటే ఎక్కువ ఆస్తిగల నాయుడుకి కొండయ్య గడ్డిపోచతో సమానం. కొండయ్య ఆస్తిని బలవంతంగా లాక్కోవడం ఎంతోసేపు పట్టదు. మొదటిది వూళ్ళో తన పరువయితే, రెండవది కొండడు తనా సంగతి ఎత్తినప్పుడల్లా తన తండ్రిని, తాతల్ని ధర్మప్రభువులని పొగుడుతూండడం. దాంతో నాయుడు ఏమీ అనలేక పోతున్నాడు.

కొండయ్య తిరిగి వెళ్తూంటే బోనులో పట్టుబడ్డ పులి, బయట తిరిగే మేకను ఏంచేయలేక నిస్సహాయంగా బోనులోనే తిరిగినట్లు ఫీలయ్యాడు నాయుడు. విరిగి

పోయిన కట్టెకు మధ్యలో తాడుచుట్టి కట్టినట్లు నల్లగా సన్నగా ఉన్న కొండయ్య నడుంకు చుట్టుకొని గోచిదోవుకున్న జానెడు పంచెను చూస్తూ "నా కర్రతో ఈడ్ని కొడితే ఈడు రెండుగా ఇరిగిపోడూ" అనుకొన్నాడు పాలేరు. తోటి శ్రామికులు కష్టించి ఇచ్చిన ఫలితం తిని, నాయుడు పుట్టలో ఉంటూ విషంకోరల్లో నింపుకొన్న వాడు పాలేరు. పాము తన పిల్లల్నే తెలియక చంపి తిన్నట్లు వాడు నాయుడు చంప మంటే తోటి కార్మికుడ్ని చంపటానికి సిద్ధంగా ఉన్నాడు.

* * * *

గుడిసెలో ఒంటి మంచంమీద ఒదిగి పడుకొన్నారు కొండయ్య, మల్లమ్మ.

"ఒసే అమ్మీ" ఆప్యాయంగా పిలిచాడు కొండయ్య.

"అయ్యా!" అంది మల్లమ్మ తండ్రి డొక్కలో ఒదిగిపోతూ.

పొద్దస్తమానం ఒళ్ళెరక్కుండా పనిచేసి, రాత్రిపూట ఒకరికొకరు వూళ్ళో విషయాలు చెప్పుకొంటూంటారు ఆ తండ్రీకూతుళ్ళు.

"నీకు తొందరలో ఎప్పుడో ఒకడితో ముడెట్టెయ్యాలే" అన్నాడు కొండయ్య ఉపోద్ఘాతంగా.

"ఇప్పుడేం తొందర్లే అయ్యా" సిగ్గుసిగ్గుగా అంది మల్లమ్మ.

"అదికాదే అమ్మీ! నాయుడు సూడబోతే ఎండ్రికాయ బొక్కలో తోకెట్టి కూసున్న నక్కలా పొంచి ఉన్నాడు ఎప్పుడు సందు దొరికితే అప్పుడు మనల్ని బయటికి నెట్టేయగల్డు. అందుకే మనం చెట్లకింద తలదాచుకొనేలోగా నిన్నో దాన్ని సేత్తే నేను అడుక్కొనయినా బతగ్గలను".

"అదేటయ్యా అట్టా అంటావు. నిన్ను వొదిలి పెట్టి నేను ఎడంగా బతగ్గలనా, నా నెక్కడుంటే ఆదేనువ్వా. ఆ నాయుడు గాడికి ఏటి మాయరోగ మొచ్చిందని మనల్నిలా ఏడిపిత్తాఉన్నాడు" కోపంగా అడిగింది మల్లమ్మ.

"ఏం సేత్తాం అమ్మీ డబ్బులేనోళ్ళం మనం. బలం లేనోళ్ళం మనం. ఆళ్ళు డబ్బు ఉన్నోళ్ళు, బలంగలోళ్ళు. ఏ రోజు అయినా మనమీద దాడిసేస్తరు. నా జగం ఎళ్ళేంతవరకు ఈడనే ఉంటా. నాదేటిగాని నీ జీయితం బాగుపడాల్నే."

మౌనంగా ఆలోచనలో పడింది మల్లమ్మ.

"మీ అమ్మ బతికున్నంతకాలం అంటాఉండేదే వజ్రంలాంటి మొగుడ్ని తేవాలని" మల్లమ్మ మనసు మారుస్తూ అన్నాడు కొండయ్య.

మల్లెమ్మ మనసు ఒక క్షణం రాబోయే మొగుడి వూహల్లోకి పోయినా, తరువాత తల్లి గుర్తుకువచ్చి చిన్నగా రోదించింది. కొండయ్య చిన్ననాటి విషయాలన్నీ గుర్తుతెచ్చుకొని చెప్పసాగాడు.

"అమ్మీ నీకు మూడేళ్ళప్పుడు నేనూ, మీ అమ్మ నిన్ను తీసుకొని రంగనాయకులసామి తిరనాళ్ళకు ఎల్లినమే. తిరనాళ్ళ రంగరంగ వైబోగంగా జరిగిందే. పెన్న ఏట్లో నీళ్ళులేవు. ఏటి గట్టునే రంగనాయకులసామి దేవాలయం. దేవాలయం ఎనక మెట్లమీద నుంచి దిగి నీళ్ళలో కాళ్ళు సేతులు కడుక్కొని దేవుడుడికి దణ్ణం పెట్టుకొని వచ్చినం. మా మద్దెన గునగున నడుస్తుండవ్. ఉన్నట్టుండి జనం ఒక్కతోపు తొసుకొని వచ్చిర్రు. ఇంకేటుంది. నువ్వు జనంలో కలిసి పోయినవ్ కనబడ్లే. ఎంత ఎతికితిమని. ఆ రేత్తిరంతా ఏటి ఇసకలో పొల్లిపొల్లి ఏడ్చింది మీయమ్మ. ఎంత ఓదార్చినా ఇన్లా. సివరకో పెద్దాయన మమ్మల్ని గుర్తులడిగి సెప్పించుకొని పోలీసోల్లకు చెప్పిండు. అదుస్టం బాగుండి తెల్లారి పోలీసోళ్ళు ఒప్పగిస్తే అప్పుడు నవ్వుతూ ఇసంత కాఫీ తాగింది నీ యమ్మ".

"అయ్యా నే కన్పడకపోతే నువ్వుకూడా ఏడిస్తివా" సందేహంగా అడిగింది మల్లమ్మ.

కిసుక్కున నవ్వాడు కొండయ్య. "అమ్మీ మొగోడ్ని కాబట్టి బయటపడ్లే మీ అమ్మని ఓదారస్తు ఉంటిని గాని నా గుండెలు మండిపోతున్నయే. నువ్వంటే మీ యమ్మకెంతిష్టమో నీకు నానంటే అంతిష్టం. ఎప్పుడూ నా గుండెలమీద తొక్కుతుండేదానివి. నువ్వు ఒక నిమసం కనబడకపోయినా నా కేటోగా ఉండేది" కూతురు తల ప్రేమగా నిమిరాడు కొండయ్య.

"అమ్మ ఇపుడేడుందో" గొణుక్కున్నట్లు అంది మల్లమ్మ.

"అమ్మీ అ మాటలన్నీ ఇపుడు దేనికిలేయే మీయమ్మ ఏడున్నా నీ సుకమేగదా సూస్తది. నీ మనువు మంచోడితో చేయమని సచ్చిపోతా నా చేతిలో చెయ్యేయించుకుంటే. అది నెరవేర్చిన తరువాత ఈ కట్టె ఈడ్చేసినా ఇబ్బందిలే. నా ఎరికలో ఒకడుండడే. నే సెప్పినట్లు ఆడ్ని చేసుకొంటావా."

"ఎవరయ్యా ఆడు" సగం సిగ్గుతో అడగలేక అడిగింది మల్లమ్మ.

"ఆడు ఎవడోకాదు మన గూడెం పోడేనే. మిలటరోడు కొడుకు రాముడే"

కొండయ్య మాటలకు మల్లమ్మ గుండె ఝల్లుమంది. తెగబారెడు ఎద, కండలు తిరిగిన దండలు, పెద్దకళ్ళు సన్నని కోరమీసం, మెళ్లో ఆంజనేయుడి బొమ్మున్న దండ గుర్తొచ్చింది. "ఆడు ఎంత కేటుగాడు" అని అనుకొంది. సంవత్సరం క్రితం సంగతి గుర్తొచ్చింది. ఊళ్ళో కూలీలకు మొత్తం నాలుగు గ్రూపులున్నాయి. నాలుగు గ్రూపులకు నలుగురు నాయకులు. చంద్రియ్య, చెంచుగాడు, నాగయ్య రాముడు. వీళ్ళ నాయకత్వం క్రింద కూలీలు పనిచేస్తారు. గ్రూపు నాయకులను మేస్త్రీలంటారు. మేస్త్రీలు ఆసామి దగ్గర పనిని కాంట్రాక్టు తీసుకొని కూలీలచేత చేయిస్తారు. వచ్చిన మొత్తంలో తాము కొంత కమీషను తీసుకొని మిగతా డబ్బు కూలీలకు పంచుతారు మేస్త్రీలు. మొదట తను చెంచుగాడి గ్రూపులో ఉండేది వాడు కమీషను క్రింద ఎక్కువ మొత్తం తీసుకొనేవాడు. కొద్ది రోజులకు అందరూ విసిగి వాడి మేస్త్రీ పదవిలోంచి బయటకు వచ్చి తలా ఒక గ్రూపులో చేరిపోయారు

ఆ చేరడంలో మల్లమ్మ తన స్నేహితురాళ్ళు రాజమ్మ కావమ్మ ఇంకొంత మందితో రాముడు గ్రూపులో చేరింది. రాముడు మిలటరీ రంగయ్య కొడుకు. రాముడు గ్రూపులో చేరిన మల్లమ్మకు తను అంతకముందు చూసిన దొంగరాముడు సినిమాలో నాగేశ్వరరావు గుర్తుకొచ్చాడు. చురకత్తిలాంటి చూపులు. కోరమీసం మల్లమ్మ గుండెల్లో కితకితలు పెట్టినయి. అందర్నీ అడిగినట్లే తననూ అడిగాడు.

"ఏమే నా దగ్గర్నే ఉండిపోతావా? మళ్ళా ఎటన్నా ఎల్తావా" అన్నాడు రెండర్థాలు సూచిస్తూ.

మల్లమ్మ ఇంకోవిధంగా అర్థం చేసుకొని సిగ్గుపడిపోయింది.

"అయితే నా దగ్గరే ఎప్పటికి ఉండి పోతావన్నమాట"

అవునన్నట్లు సిగ్గుతో తలూపింది. ఆ రోజునుంచి ఈరోజువరకు రాముడ్ని తన కథానాయకుడిగా నిర్ణయం చేసుకొంది. అయితే రాముడుకూడా తన హీరోయినుగా మల్లమ్మను అంగీకరించాడా అన్నట్లుగా మల్లమ్మ ఎక్కడుంటే అక్కడ ప్రత్యక్షమై ఆమెకు సాయంచేస్తూ ఉండేవాడు. రాముడికివ్వవలసిన కట్నం విన్న తరువాత మల్లమ్మ ఆశలు నిరాశలయ్యాయి. ఇప్పుడు తండ్రి పెళ్ళి సంగతి ఎత్తేసరికి గతమంతా గుర్తొచ్చింది మల్లమ్మకు....

"అయ్యా, అది కుదరని పని" అంది నిరాశగా. అందని ద్రాక్షపళ్ళు పుల్లన అనే భావంతో.

"ఏం? ఎందుకు కుదర్దే. నా కూతురుకేం లోటని"

"నీ కూతురుకేం లోటట్నా డబ్బు లోటు. ఆళ్ళకు అయిదొందల రూపాయలు కట్నాల ఇయ్యాలంట. పెళ్ళికొడుక్కు వాచీ పెట్టాలంట. కొత్త గుడ్డలు పెట్టాలంట కమీజు మంచము,పొరుపు కొత్తయి తీసియ్యాలంట. నీవల్ల వుద్దేటి"

"ఏచ్చే ఇసిత్రంగా మాట్లాడతవు. మనం డబ్బులియ్యాలంట్నా. నేను మీ యమ్మను సేసుకొనేందుకు దాని నాయనకు రెండొందలు ఒలిడబ్బులిచ్చినా. ఆనక ముత్తము వడ్లు ఇచ్చినా. అత్తకూ, మామకు కొత్త గుడ్డలు పెడితిని. పెళ్ళిఖర్చంతా నానే గదా బరించుకొంది మళ్ళా........"

"ఇప్పుడు రోజులు మారిపోయినయయ్యా! మనోళ్ళలోకూడా కట్నాలు ఇస్తేనే పెళ్ళి. రాముడోళ్ళ సంగతి నీకు తెలియదు. ఆళ్ళ ఇంట్లో మూడు కమీజు మంచాలు. రెండు పరుపులు, రేడియో, సైకిలూ ఉన్నాయి తెలుసా."

"ఆర్నాయనో అన్నండయా ఆడికి"

"అనునే అయ్యా! అందుకే అదిమనకు అంబుబాటులో లేదని సెప్తున్నాను"

"ఇక ఉంటాదే. ఇప్పుడు మనదగ్గర రొండొందలు రొక్కం ఉంది. ఇంకా కూడబెడ్దాము. మరిన్ని రూపాయలు చేసి ఆడికి నీకు పెళ్ళి సేసేత్తా. తెలిసిందా." శపథం చేస్తున్నట్లు అన్నాడు కొండయ్య.

"అయ్యా! నువం ఉన్న డబ్బులు కాజేసుకొంటే ఎట్టా. పనులు లేనప్పుడు ఆ డబ్బు ఎట్టుకొని తినాలి గదా."

"అమ్మీ! నువ్వేం దిగులు పడమాక. వచ్చే ఇయ్యేటికి నీ పెళ్ళి ఆడితో పేసెయ్యాల. నాను తింటనో తిననో నీ కెందుకు. సూత్తుండు ఆ డబ్బు నేను కూడేత్తాను" అన్నాడు లోతుకుపోయిన కళ్ళలో ఆశలు సృష్టించుకొంటూ.

"మా అయ్య చాలా మంచోడు. ఎట్టిన్నగాని" అనుకొంటూ కొండయ్యకు ఆనుకొని నిద్రపోయింది.

* * *

రోజులు గడిచిపోతున్నాయి. ఇంతకు ముందు కొండయ్య నెత్తిన కూరగాయల గంప పెట్టుకొని 'బెండకాయలు.... వంకాయలు....టమేటాలు' అంటూ అరిచేవాడు ఊళ్ళో. వాళ్ళు డబ్బులిచ్చినా, బియ్యమిచ్చినా, వడ్లిచ్చినా, నూకలిచ్చినా

మళ్ళీ ఒకసారి చుట్టూ చూసింది. కనుచూపుమేరలో ఎవరూ కనిపించలేదు. వరి పచ్చగా కనిపిస్తూ సమతలంగా ఉంది. "ఇక ఇబ్బందిలేదు" అనుకొంటూ చీరె, రవిక విప్పి గట్టునపెట్టి తొట్టెలో దిగింది. నగ్నంగా ఉన్న తన శరీరాన్ని ఒకసారి చూసుకొని సిగ్గుపడి ఎదమీద చేతులు అడ్డుపెట్టుకొంది. సిగ్గుతో ముడుచుకొని కూర్చుని నీళ్ళతొట్టెలో మునగసాగింది. ఆమె చుట్టూఉన్న నీళ్ళ స్పర్శ రాముడి స్పర్శలాగే ఉంది. రోజూ స్నానంచేసే పద్ధతి ఇదే అయినా రేపు రాముడితో సంబంధం ఖాయం కాబోతుందని తెలిసినప్పటినుంచి వాడే అంతా అయి తను కట్టుకొనే చీరలోను, వేసుకొనే జాకెట్టులోనూ వాడే ఉండి స్పర్శిస్తున్నట్లుగా ఉంది. ప్రకృతి కన్య నగ్నంగా వనవిహారం చేసినట్లు, ఆమె కొద్దిసేపటికి సిగ్గు విడిచి హాయిగా తొట్టెలో ఈత కొట్టసాగింది.

నాయుడు ఉదయంపూట తప్ప సాయంత్రంపూట ఎప్పుడూ పొలానికి రాడు. నాయుడు పాలేరు మాత్రం ఇంజనువేసి దూరంగా పొలాల్లో ఎక్కడో మడవలు కడుతూ రోజంతా ఉంటాడు. కాని ఈ రోజు ప్రక్కూర్లో ఒక బాకీ రావాల్సుంటే తన పాలేరును అక్కడికి పంపి షెడ్డులోపల మంచం వేసుకొని తలుపు దగ్గరకు లాగి పడుకొన్నాడు నాయుడు. షెడ్డు ఇవతలివైపు పంపు, అవతలివైపు తలుపు ఉంది. పంపునుంచి చక్కగా కొండయ్య గుడిసెకు దారి ఉండంతో నేరుగావచ్చి నలువైపులా చూసిన మల్లిమ్మకు షెడ్డులో చూడవలసిన అవసరం కనబడలేదు.

కొద్దిసేపు నిద్రపోయి లేచిన నాయుడు "ఇంజను చాలసేపటున్నించి నీళ్ళుకొడుతా ఉంది మోటారు వేడెక్కిపోయిందేమో. కొద్దిసేపు రెస్టిస్తాము'' అని లేచి స్విచ్ ఆపబోయి కిటికీలోంచి చూసాడు. ఆ దృశ్యానికి నాయుడు మతేపోయింది. తను కనబడకుండా కిటికీకి ఒక ప్రక్కగా నిలబడి చూడసాగాడు.

మల్లిమ్మ తొట్టెలో ఒక మూల నిలబడి వళ్ళు రుద్దుకొంటూ ఉంది. పంపులోంచి నీళ్ళు ఆమెకు ఒక వైపుగా పడుతున్నాయి. తొట్టెలోని నీళ్ళు ఆమె మోకాళ్ళవరకే ఉన్నాయి. ఆమె ఇటు తిరిగినప్పుడుల్లా బిగువుగా, బలంగా, నున్నగాఉన్న శరీరావయవాలు అతని కంటబడుతున్నాయి. అలా కన్పించినప్పుడల్లా నాయుడు కళ్ళు బూజర్లు క్రమ్ముతున్నాయి. మల్లిమ్మ ఇవేమి గమనించకుండా స్వేచ్ఛగా స్నానం చేసింది. మల్లిమ్మ అందాన్ని అన్నిదిశలా స్వేచ్ఛగా స్పర్శించినాయి నాయుడు కళ్ళు. "నల్లకలువ" అనుకొన్నాడు. స్నానం చేసిన తరువాత చీర మాత్రమే కట్టుకొంది. జాకెట్ వేసుకోలేదు. ఆరిన గుడ్డల్ని మడిచి పెట్టుకొంది.

"అయ్యా, నన్ను నాయుడు నాశనం చేసేసాడే నానింక పెళ్ళికి పనికిరానే. ఇంత ఎలికలమందు తిని సత్తానే" కొండయ్య ఒళ్ళో తలపెట్టుకొని వెక్కి వెక్కి ఏడ్చింది వెక్కిళ్ళు ఏడుపుతో కలిసి ఎగసెగసిపడుతూ ఉంది.

కొండయ్య శరీరం భూకంపం వచ్చినట్లు ఒణికిపోయింది. ఏం తోచక కాలు గాలిన పిల్లిలా ఎగిరాడు. చెవులు కోసిన మేకలా అరిచాడు. తరువాత చేతకాని వాడిలా భోరున ఏడ్చాడు. "అమ్మీ మనం ఏం జేసామని దేవుడు మనకి అన్యాయం చేసాడే. నేను ఆ నాయుడ్ని సంపి, ఆనక నేను సత్తానే. ఆడ్ని ఇంతటితో వదిలి పెట్టను"

"అయ్యా ఆడికెల్తే నీకే పెమాదం. నా మాట ఇను. తప్పుచేసింది నేను. నేను సావడం న్యాయం".

"అమ్మీ నువు సావడానికి ఈల్లేదే. రాముడితో నీకు పెళ్ళి జరగాల్సిందే" దుఃఖంతో పూడుకుపోయిన కంఠంతో అన్నాడు కొండయ్య.

"అయ్యా చెడిపోయినదాన్ని. రాముడితో ఏ ముకం పెట్టుకొని కాపరం చేసేది" ఏడ్చింది మల్లమ్మ.

చాలసేపు తర్జనభర్జనలు జరిగి చివరకు ఊరువదలి పెట్టడమే పరిష్కారంగా నిర్ణయించుకొన్నారు తండ్రికూతుళ్ళు.

మల్లమ్మ ఒక పెద్దగంపలో బొచ్చెలు దబర్లు, కుండలు వేసింది. మరొక బస్తాలో గుడ్డలూ, ఇంకా చిల్లర వస్తువులు వేసి మూటకట్టింది. ఉన్న రొక్కం డబ్బులు బొడ్లో దోపుకున్నాడు కొండయ్య. మల్లమ్మ అప్యాయంగా స్పర్శిస్తూ చెట్లనుంచి కొద్దికొద్దిగా కూరకాయలు ఒడినిండా కోసుకొంది. అన్ని చెట్లకూ పేరు పేరునా వీడ్కోలు చెప్పి ఏడ్చింది.

కొండయ్య కాలువలో దిగి మురుగు కాలవలోని నీళ్ళు నెత్తిన చల్లుకున్నాడు "అమ్మా గంగా బవానీ నీకు అంటు లేదంటారు పెద్దోళ్ళు. అందరికీ నీవు మురుగు కాలువవి నీ వాసన వాళ్ళకు గిట్టదు. అసలు నువ్వు ఏడనుంచి వస్తున్నావు. ఆళ్ళ ఇండ్లనుంచే ఆళ్ళ శరీరాల్ని సుబ్రంచేసి ఆ మురికిని తీసుకొస్తున్నావు. అంత సాయం చేత్తున్న నీవు ఆళ్ళకు మురుగు కాలువవి, మాకు దేవతవు. మా తాత ముత్తాతల కాలంనుంచి నీవు పండించిన కాయలు అమ్ముకొని తిని బతుకుతున్నం. ఎవరి మురికితో నయినా మేము బతగ్గలంగాని, నాయుడు మురికితో మేము బతక

లేమమ్మా. అడి మురికి ఈ కాలవలో ఉంది. వాడిది మురికి మనసు. స్వచ్ఛంగా ఉన్న మనసుల్ని మురికిసేసాడు. తల్లీ మా అమ్మ ఒంట్లో వాడి మురికిఉంది. వాడి మురికిని సుబ్రంసెయ్. ఇక మాకూ నీకు ఋణం తీరిపోయింది తల్లీ. ఇక వస్తాం" ఎలుగెత్తి ఏడుస్తున్నాడు. అతని ఆక్రందనలు ముల్లోకాలకు వినిపిస్తున్నాయి. అతని ఆవేదన సప్తసముద్రాల్ని మించిపోయింది.

తండ్రి అలా చెప్పుకొని, చెప్పుకొని దుఃఖిస్తూ ఉంటే మల్లిమ్మకు గుండె కలచి నట్లయింది. బానిసగా అమ్ముడుపోయిన వాడు తన ఖర్మ తల్లికి చెప్పుకొని ఏడ్చినట్లుంది. తోటకు, కాలువకు వీడ్కోలు చెప్పి తండ్రీకూతుళ్ళు వెడుతూ ఉంటే భూమికి అంటుకొని ఉన్న కూరగాయల చెట్లు శత్రురాజుచే బంధింపబడ్డ సైనికుల్లా ఏం చేయలేక నిస్సహాయంగా చూస్తూ ఉండిపోయాయి. మురుగుకాలువ తన వల్లని మురికిలోంచి పుట్టిన గడ్డిపరకల కనురెప్పలతో, తెల్లని అశ్రుకణాలను రాలుస్తూంది, పైన్నుంచి పడే మంచుతో.

వాళ్ళు ఆ చీకట్లో చేలల్లో పడి అడ్డదారిన అల్లూరు రైల్వే స్టేషను చేరుకొన్నారు. వీరికోసమా అన్నట్లు రైలు సిద్ధంగా ఉంది. వారి ప్రయాణం సూర్యోదయం వరకూ.



# కాకులు అరుస్తున్నాయి

ఇంటి ముందు కాకులు గోలగా అరుస్తున్నాయి. గుంపుగా చేరి ఏవో రహస్యాలు చెప్పుకొంటున్నట్లు ముక్కుకు ముక్కు ఆనించి మరీ అరుస్తున్నాయి. కాకి భాష మనుష్యులకు అర్థంకాదని కాబోలు పెద్దగా చెప్పుకొంటున్నాయేమో. ఇంటిముందు వరండాలో పిల్లలకు ట్యూషను చెబుతున్న రాజారావుకు విసుగ్గా ఉంది. కాకిగోల అనుకున్నాడు. వెళ్తాయేమోనని పాఠం ఆపి ఒక అయిదు నిమిషాలు చూసాడు. కాని వాటిధ్యాస వాటిది. ఏమాత్రం ఖాతరు చేయకుండా కావుకావుమని అరుస్తూనే ఉన్నాయి. రాజారావు విద్యార్థులపైపు దృష్టిసారించాడు. దాని భావం అర్థం అయినట్లుగా ఒక విద్యార్థి వెళ్ళి కాకుల్ని దూరంగా తరిమాడు. అవి ఎగిరి పోయాయి.

"సార్! ఇలా కాకులరిస్తే ఏదో అరిష్టం జరుగుందట. మా అమ్మమ్మ చెప్పింది" కాకుల్ని తరిమి వచ్చిన విద్యార్థి వినయంగా చెప్పాడు, రాజారావు దగ్గర కొచ్చి.

"ఏడిసావ్. వెళ్ళి కూర్చో"

ఆ కుర్రవాడు ముఖం చిన్నబుచ్చుకొని వెళ్ళాడు. రాజారావు పుస్తకం తెరిచి పాఠం చెప్పబోతుండగా పరుగెత్తుకు వచ్చాడు మురళి. వాడికి పదేళ్ళ వయసుంటుంది. మనిషెందుకో వణుకుతున్నాడు

"మావయ్యా! మావయ్యా ప్రమాదం జరిగింది. మా అమ్మ బావిలో పడింది" ఆదుర్దాగా చెప్పాడు.

రాజారావు గుండె ఒక్కసారి ఆగి కొట్టుకోసాగింది "అయితే.... అయితే" అని మాత్రమే అనగలిగాడు. ఇంకేం మాట్లాడలేకపోయాడు.

"ప్రక్కింటి నాగభూషణం అన్నయ్య వాళ్ళు బావిలో దూకి అమ్మని తీసారు. ఇప్పుడు బయట మంచంమీద పడుకోబెట్టి నీళ్ళు కక్కిస్తున్నారు".

దాంతో రాజారావుకు కొంత ధైర్యం వచ్చింది. "ఇప్పుడేం ప్రమాదంలేదు కదా". అని అడిగాడు.

"మరేం ఫరవాలేదంటున్నారంతా. డాక్టరుకోసం అన్నయ్య వెళ్లాడు. మీకు చెప్పమని నన్ను పంపాడు" ఆయాసం తీర్చుకుంటున్నాడు మురళి.

రాజారావు వెంటనే పిల్లల్ని ఆ రోజుకు వెళ్ళమని చెప్పి, ఇంట్లోకి వెళ్ళి భార్యకు విషయమంతా చెప్పాడు. ఆమె చేతిలోని పని కూతుర్లకు ఒప్పజెప్పి హడావుడిగా బయలుదేరింది. ఇద్దరు దంపతులూ మురళిని వెంటబెట్టుకొని వాళ్ళింటికి బయలుదేరారు.

రాజారావు మనసంతా ఆలోచనలతో నిండిపోయింది వసుంధర బావిలో ఎలా పడుతుంది! నీళ్ళు తోడుతూ తాడు జారిపడిందా. తాడు జారితే చేద బావిలో పడాలి గాని ఆమె ఎందుకు పడుతుంది. లేక గట్టుమీద ఎక్కి బాదంఆకులో మరేవయినా కోస్తుంటే కాలుజారిపడిందా? ఆలోచనలు తెగడంలేదు ఈ సందేహాలతో.

ఆమెకు తాము బంధువులు కాకపోయినా ఆమె భర్త సత్యనారాయణ తనతోటి టీచరు. సహృదయుడు. అతని పత్నిగా వచ్చిన నాటినుండి వసుంధరను కూడా తన చెల్లెలుగా స్వీకరించాడు రాజారావు. తన వయసును గౌరవించో లేక స్నేహానికి విలువనిచ్చో తన సలహా లేందే ముందుకు కదలరు. తనూ అంతే. తన కుటుంబ విషయాల్లోనూ వాళ్ల జోక్యం చేసుకొంటూంటారు. అందుకే ఏ ఇబ్బంది వచ్చినా ఒకరికొకరు దిక్కు.

రాజారావు దంపతులు ఇంటికొచ్చే సరికి ఇంటిముందు జనం పల్చగా ఉన్నారు. ఇంతలో డాక్టరు వచ్చాడు. ఒక ఇంజక్షనిచ్చి, ఏవో కొన్ని టాబ్లెట్లు వ్రాసిచ్చాడు. ఆమెకు బాగా గాలి తగలాలని, విశ్రాంతిని మించిన వైద్యం లేదని, భయపడవద్దని చెప్పి వెళ్ళిపోయాడు.

రాజారావు భార్య అక్కడే ఆ రోజంతా ఉండిపోవాలనుకొని పిల్లల్ని స్కూలుకు వెళ్ళమంది. రాజారావుకూడా ఆ రోజుకు సెలవు పెట్టాడు. సత్యనారాయణ ఏదో ఊరికి పోవాలని రెండురోజులు సెలవు పెట్టాడు. అతనుంటే ఈ దుర్ఘటన జరిగేదికాదేమో అనుకొన్నాడు రాజారావు.

వసుంధర తేరుకొన్న తరువాత అడిగాడు. "అమ్మా ఒంట్లో ఎలాఉంది. సత్యనారాయణ ఊరునించి ఇంకా రాలేదా?"

ఆమె గుండెల్లోంచి దుఃఖం ఒక్కసారిగా పెల్లుబికింది. చేతుల్లో ముఖం దాచుకొని వెక్కి వెక్కి ఏడ్చింది. రాజారావుకు పరిస్థితి ఏమీ అర్థంకాలేదు. "సత్యనారాయణ కేమయింది?" అడిగాడు ఆదుర్దాగా.

"ఆయనకేం జరగలేదు. జరిగిన అన్యాయం నాకే" కళ్ళు తుడుచుకొంటూ అంది.

"ఏమిటమ్మా ఆమర్దా. డాక్టరు ఫరవాలేదన్నాడుగా. అసలింతకూ ఎలా జరిగింది బావి గట్టుమీద నిలబడి ఏమైనా కోస్తూంటే కాలుజారిందా?"

"కాలుజారి పడలేదు అన్నయ్యా! నేనే కావాలని బావిలో దూకేను. చావక పోవడం నా ఖర్మ" అంది ఏడుస్తూ. తరువాత క్రమేణా తన కడుపులోని బాధనంతా వెళ్ళగ్రక్కింది.

"అన్నయ్యా! ఇంత జరిగిన తరువాత నేనెందుకు బ్రతకాలి. ఆయనంటే నాకెంత అభిమానమో నీకు తెలియంది కాదు" ముఖం దిండులో దాచుకొని వెక్కి వెక్కి ఏడ్చింది. ఈ విషయం విన్న తరువాత రాజారావు భార్యకు కూడా మనసు మొద్దుబారిపోయింది. ఇంత జరుగుతున్నా వసుంధర తనకెందుకు చెప్పలేదు. ఆడ వాళ్ళు సిగ్గువిడచి ఇటువంటి విషయాలు ఎవరికీ చెప్పుకోరేమో అనుకొన్నాడు రాజారావు.

సత్యనారాయణ స్కూల్లో తన తోటి టీచరు విమల పలలోపడి ఇంటికి రావడంలేదా. ఈ రెండు రోజులు ఎక్కడికో పోవాలని సెలవుపెట్టి విమల ఇంట్లో గడుపుతున్నాడా. రాజారావుకు కడుపులోదేవినట్లయింది. ఆయనకు నమ్మబుద్ధి పుట్టటంలేదు.

"ఇవన్నీ నీ కెవరు చెప్పారమ్మా" అడిగాడు లాలనగా.

"ఎవరు చెప్పడమేమిటి అన్నయ్యా ఇది చాలా రోజులుగా జరుగుతుందట."

ప్రక్కింటి పార్వతమ్మ, బాంకులో పనిచేసే సత్యవతి 'మీ ఆయన ఎవరో అమ్మాయిని వెంటేసుకొని రోజూ పార్కుల్లో తిరుగుతుంటాడమ్మా, అని ఎప్పట్నుంచో చెబుతున్నారు కాని నేను నమ్మలా. అయితే ఈరోజు ఉదయం సత్యవతి మా ఇంటికివచ్చి, పనుందని సెలవుపెట్టి విజయవాడకు పోయాడని చెప్పావే మీ ఆయన, ఇప్పుడు హిందీ టీచరు విమల ఇంట్లో ఉంటే చూసానని చెప్పింది. దాంతో మన మురళిని పంపాను. వాడు పేరివాకిట్లోంచి చూస్తే, ఆయన, విమల ఎదురెదురుగా కూర్చొని నవ్వుకొంటున్నారట. అంతే వాడు పరుగెత్తుకు వచ్చి నాకీ విషయం చెప్పాడు" ఏడవడం మొదలుపెట్టింది వసుంధర.

సత్యనారాయణ విశాల హృదయం తనకు తెలుసు. ఏ పరిస్థితుల్లో వసుంధరను చేసుకున్నాడో కూడా తెలుసు. తన స్వంత ఊరు ఇదే కావడంలో వసుంధర కుటుంబం చరిత్ర తెలుసు. వసుంధరకు పదేళ్ళ ప్రాయంలో వసుంధర తల్లి ఇంకొకడితో లేచిపోయింది వసుంధర తండ్రి మరల పెళ్ళిచేసుకోలేదు. వసుంధర యుక్తవయసు వచ్చేసరికి చాల అందగత్తెగా తయారయింది. ఆమె అందంచూసి యువకులు పెళ్ళిచూపులకు రావడం, లేచిపోయినదాని కూతురని తెలియగానే వెళ్ళిపోవడం జరుగుతూండేది. ఈ పరిస్థితిలో ఆ ఇంటి ప్రక్కనే గదిఅద్దెకు తీసుకొన్న సత్యనారాయణ మొదటిచూపులోనే ఆమెని ప్రేమించాడు. ఎంతమంది చెప్పినా వినక లోకుల కారుకూతలు విని భరించలేని భార్యకోసం అతను ఇష్టంలేకున్నా వేరే చోటుకు ట్రాన్స్‌ఫరు పెట్టుకొన్నాడు. అలా పన్నెండేళ్ళు ఊళ్ళుపట్టుకు తిరిగాడు కాని ఈ లోపల వసుంధర తండ్రి మరణించడంతో మళ్ళీ ఇదే ఊరికి ట్రాన్స్‌ఫర్ చేయించుకొని మామగారి ఇంట్లో ఉండవలసి వచ్చింది. ఒకప్పుడు కారుకూతలు కూసిన లోకం ఈనాడు భర్త, పిల్లలతో వచ్చిన వసుంధరనుచూసి తోకమూడిచారు లోకం నైజం అంతే. భయపడి నన్నాళ్ళు వెంట తరుముతారు. ఎదురు తిరిగి నిలబడిననాడు వెంట తరిమేవారే వెనక్కు తిరుగుతారు. అంతే కాకతమ రక్షణకోసం ఇంద్రుడు చంద్రుడు అని ముఖస్తుతి కూడా చేస్తారు. ఇప్పటిపరిస్థితి అదే.

ఇక హిందీ టీచరు విమల సంగతి. ఆమె చాల అందమైనది. నెమ్మదస్తురాలు. వివాహం కాలేదు. ఎప్పుడూ సమస్యల వలయంలో చిక్కుకున్నట్లుంటుంది సహజంగా కష్టాల్లో ఉండేవాళ్ళని ఓదార్చే అలవాటున్న సత్యనారాయణ ఆమెకుచేరువయ్యాడు. సత్యనారాయణ అంటే ఆమెకు అదొక రకమయిన అభిమానమేర్పడింది తన కడుపులోని దుఃఖాన్ని అతని దగ్గర వెళ్ళగ్రక్కేది. దాంతో వసుంధర కష్టాల్ని ఆదుకోవడం తన విధి అనుకొన్నాడు సత్యనారాయణ. రెండు సంవత్సరాల నుంచి వాళ్ళస్నేహం అలా జరుగుతోంది. వాళ్ళ స్నేహంలో ఏ మాత్రమూ చెడు కనిపించలేదు తనకు.

అందుకే నిష్కల్మషంగా ఉండే సత్యనారాయణ, బేలగా కనిపించే విమల ఇంతగా తెగించారంటేనే బాధగానూ, కోపంగానూ ఉంది రాజారావుకి.

విమల ఇంట్లో కుర్చీలో కూర్చొని కాఫీ త్రాగుతున్న సత్యనారాయణ రాజారావును ఆహ్వానించి కూర్చోబెట్టాడు. విమల ఆయనకు నమస్కరించి చిరునవ్వుతో కాఫీగ్లాసు అందించింది. వాళ్ళ చర్యలకు కోపంతో ఉడికిపోతున్న రాజారావు,

సత్యనారాయణ చెప్పింది విని అక్కడి పరిస్థితులను ఆకళింపు చేసుకున్న తరువాత, సత్యనారాయణ వ్యక్తిత్వం ముందు తాను గడ్డిపోచననుకొన్నాడు. విమల శిరస్సున చేయుంచి ఆశీర్వదించేంత వరకు ఆయన మనసు ఆగలేదు. సత్యనారాయణను విమలను చెడామడా నాలుగు చీవాట్లేసి బుద్ధిచెప్పాలని వచ్చిన రాజారావు తనుఅలాంటి ఆలోచనలు పెట్టుకొని విమల ఇంటికి వచ్చినందుకు ఇప్పుడు సిగ్గుపడుతున్నాడు. వసుంధర బావిలో దూకిన విషయం బయటపెట్టలేదు రాజారావు.

రాజారావు తిరిగివచ్చేసరికి వసుంధర మంచంమీద కూర్చొని ఎదురుకుర్చీలో కూర్చొని ఉన్న రాజారావు భార్యకు ఏదో చెబుతూ కళ్ళు తుడుచుకొంటోంది. వసుంధర ఈ మధ్య సమయంలో బాగాతేరుకొంది. రాజారావును చూసి ఇద్దరు లేచి నిల్చున్నారు.

"అమ్మా వసుంధరా త్వరగా బయలుదేరమ్మా మనం వెళ్ళాలి."

"ఎక్కడికి" అంది వసుంధర ఏదో చేస్తాడని పంపిస్తే ఏదో చేసుకొనివచ్చా డన్నట్లు తనను ఎక్కడికో బయలుదేరమంటున్నాడు అసలు విషయం చెప్పకుండా అనుకొంది.

"విమల ఇంటికి"

"దాని ఇంటికా" వసుంధర కళ్ళు తీక్షణంగా మారాయి. "అన్నాయ్యా నువ్వేదో దాన్ని నాలుగు మాటలడిగి విషయం తేల్చుకోమంటే నన్నే దాని ఇంటికి రమ్మంటావా. నేనురాను అవసరమయితే నా శవమే వస్తుంది అక్కడికి" గోడ వానుకొని వెక్కివెక్కి ఏడ్చింది వసుంధర.

అప్పటివరకు ఏమీ అర్థంకాక ప్రేక్షకురాలిగా చూస్తున్న రాజారావు భార్య "ఛీ! ఏమిటమ్మా పాడు మాటలు...." అంటూ మందలించింది.

"అయితే వదినా, నాకింత అన్యాయం చేసిన దానిఇంటికి రమ్మనడం ఏం న్యాయం. నువ్వే చెప్పు."

"వసుంధరా నా మాటవిను ఇందులో అవమానం పొందేది ఏమీలేదు. నువ్వు అక్కడికిరా. నా మీద గౌరవముంటే నా మాట విను."

"నీ మాట ఎప్పుడు వినలేదు అన్నయ్యా. నా చిన్నతనంనుంచీ నన్ను నువ్వెరుగుదువు. మా మంచిచెడ్డల్లో, మా కష్టసుఖాల్లో మాకు ఆప్తుడివి, తండ్రివి అన్నీ నువ్వే కాని ఇట్లాంటి విషయాల్లో ఏ ఆడది తండ్రిమాట కాదుకదా దేవుడి మాటకూడా వినదు"

"నాకు తెలుసు వసుంధరా ఆడదాని మనసు. చూస్తూచూస్తూ తన భర్తను ఇంకొకరికి అర్పించుకోలేదు. కాని ఈ ఒక్క విషయంలో నా మాట విని నాతో రా అతనిది తప్పయితే నీముందే అతన్ని చీవాట్లేస్తాను"

"అంత బ్రతిమాలాల్సిన అవసరం లేదు అన్నయ్యా. నేను వస్తాను అయితే ఆయన్ను నా ముందు తిట్టకండి. ఎంత తప్పుచేసినా ఆయన నా భర్త. నా ముందు ఆయన్ను మందలించడంవల్ల నాకు గౌరవం ఏముంటుంది."

రాజారావు నవ్వుకొన్నాడు. ఇంత తెలివిగలది, భర్తమీద ఇంత ప్రేమ గలది నిజం తెల్సిస్తే ఏమవుతుందో అనుకున్నాడు.

"సరే ఇక బయలుదేరు. మీ వదిన ఇంట్లోఉంటుందిలే" అన్నాడు వసుంధర తల సరిచేసుకొని చీర మార్చుకొని ఏదో నిశ్చయానికి వచ్చినదానిలా బయలుదేరింది

విమల ఇంటిముందు రిక్షాలు దిగేసరికి, విమల వీళ్ళకోసమే ఎదురుచూస్తున్న ట్లుగా బయట గుమ్మందగ్గరే నిలబడి ఉంది. సన్నగా, నాజూగ్గా, పొడవుగా ఉంది. తెల్లని శరీరచ్ఛాయ, విశాలమైన కళ్ళు, కోటేరులాంటి ముక్కు. రెండు చేతులకు నిండుగా సాదాగాజులు, వాయిల్‌చీర, కాటన్ జాకెట్టు ధరించి ఉంది. వసుంధర చూపులు త్రిప్పుకోలేక పోయింది. ఇంత అందగత్తె కనుకనే ఆయన్ను తేలిగ్గా వల్లో వేసుకొంది. ఆడవాళ్ళకే ఇలా ఉంటే, మగవాళ్ళకు ఇంకెలా ఉండాలి అనుకొంది.

"లోపలికి రా అక్కా" అంటూ ఎంతో చనువుగా వసుంధరచేయి పట్టుకొంది

"ఛీ....దరిద్రపుముండ, వరుసకలుపుతోంది. విడిచింది వీధికిపెద్ద అన్నారు. దీనికి సిగ్గేమిటి? అనుకొన్నవాళ్ళు సిగ్గుపడాలిగాని" మనసులో తిట్టుకొంటూనే ఆమెను అనుసరించింది. ప్రక్కన రాజారావు ఉండటంతో ఏం మాట్లాడాలన్నా ఆమెకు భయంగా ఉంది. విమలచేతి స్పర్శ కంపరమెత్తుతున్నా మౌనంగా రాజారావు వెనుకనే హాల్లోకి నడిచింది వసుంధర.

రాజారావు హాల్లో కుడిపైపు గది కర్టెన్ తొలగించి "అదుగో నమ్మా మీఆయన వెళ్ళి మాట్లాడు" అన్నాడు. ఆ దృశ్యాన్ని చూసి కెవ్వున అరచింది వసుంధర. సత్యనారాయణ మంచంమీద కూర్చొని ఉన్న కుష్టువ్యాధి గ్రస్తురాలికి గ్లాసుతో మందు త్రాగిస్తున్నాడు. కుష్టువ్యాధి గ్రస్తురాలు శరీరమంతా కురుపులతో అసహ్యంగాఉంది.

సత్యనారాయణ మందు తాగించడం పూర్తిచేసి, ఆమెకు సమీపంలో ఉన్న కుర్చీలో కూర్చొన్నాడు.

''ఏమండీ! దూరంగా వచ్చేయండి. మనం పిల్లలుగలవాళ్ళమండి. అది మనకు అంటుకొంటుందండి" బిగ్గరగా అంది వసుంధర అన్నీ మరచిపోయి.

ఆమె వెనుకపైపు దిండ్లొకసారి సరిచేసి కూర్చోబెట్టి, "అదే .మీ అమ్మయితే ఆ మాట అనగలవా" అన్నాడు సత్యనారాయణ భార్యపైపు నవ్వుతూ చూస్తూ.

"మా అమ్మా! ఆమెకు ఇలాంటి ఖర్మ ఎందుకు పడుతుంది" కంగారుగా అంది వసుందర

"అవును ఈమె మీ అమ్మ! విమల నీ చెల్లెలు."

"ఏమిటండి మీరు మాట్లాడేది. ఈమె నా అమ్మ ఎలా అవుతుంది. నా కాపురంలో నిప్పులు చల్లిన ఇది నాకు చెల్లెలా" కోపం పెల్లుబకగా అరచింది.

''అవును. ముమ్మాటికి"

వసుంధర కుష్టువ్యాధిగ్రస్తురాలు పైపు, విమలపైపు మార్చిమార్చి చూసింది. కుష్టువ్యాధిగ్రస్తురాలు తల తిప్పుకొంది. విమల కళ్ళలో నీళ్ళు గిర్రున తిరుగుతున్నాయి. ముక్కుపుటాలు అదురుతున్నాయి. ఏడుపును ఎంతో నిగ్రహంతో నొక్కిపట్టినట్లు ఆమె మెడదగ్గర నరాలు తెలియజేస్తున్నాయి. మాటిమాటికీ వసుంధరపైపు చూస్తూ పిలిస్తేవళ్ళో వాలిపోవాలన్నంత ఆదుర్దాగా ఉంది. మౌనంగా చూస్తున్నాడు రాజారావు

సత్యనారాయణ చెప్పుకుపోతున్నాడు. "విమల మా స్కూల్లో హిందీ టీచరుగా చేరింది. ఆమె అందమైన ముఖంలో ఎప్పుడూ చీకటినీడలు తారట్లాడుతూ ఉండేవి. ఇంత లేతవయసులో ఈమెకు ఎన్ని కష్టాలు అనుకొన్నాను. ఆమెను ఒదార్చదలచాను. ఆమెకు దగ్గరయ్యాను. పరిచయం పెంపొందింది. పర్యవసానంగా ఆమె తన కుటుంబ సమస్యలు నాతో చర్చించింది. నేను ఆశ్చర్యపోయాను కారణం ఆ సమస్యలు నాకు ముడిపడి ఉండటమే. వసుంధర తల్లి, వసుంధర పదేళ్ళప్రాయంలో ఒక నీచుడి మోసానికి గురై కాపురాన్ని కాలదన్ని వెళ్ళిపోయింది తరువాత ఆ నీచుడి వలన ఆమెకు విమల పుట్టింది. విమల పుట్టిన కొంత కాలానికి ఆ దుర్మార్గుడు వసుంధర తల్లిని వదలి ఎటో వెళ్ళిపోయాడు. ఆ పరిస్థితుల్లో బిడ్డను ఎన్నో కష్టాలుపడి చదివించింది. కాని దేవుడు ఆమెమీద కనికరం

లేకుండా కుష్టువ్యాధిని ప్రాప్తింపజేసాడు. ఇదీ విమల వెనుక చరిత్ర. ఎలాగో ఉద్యోగం దొరికిందన్న ఆనందమేగాని, ఆప్తులు లేక తన కష్టాల్ని కన్నీరుగా చేసుకొని పిలపిస్తూ ఉంది. ఈ విషయం వెంటనే వసుంధరకు తెలియజేయాలనుకొన్నాను. కాని ఆమె తల్లి ఒప్పుకోలేదు. తన పెద్దకూతురు యెడల ఎంతో ద్రోహం చేసిందని, ఇప్పుడు తననుచూస్తే ఆమె అసహ్యించుకొంటుందని భయపడింది. తను చనిపోయేముందు కడసారిగా చూస్తే చాలు అంది. విమలకూడా అక్కతో చెప్పవద్దు అంది. కారణం మీరు పిల్లాపాప గలవారు. అమ్మనిచూసి అక్కయ్య ఇంటికి తీసుకొనిపోవచ్చు. పిల్లలు భయపడతారు, అదీగాక వాళ్ళ ఆరోగ్య దృష్ట్యాకూడా ఇది మంచిది కాదు అంది. అందువలన నేను నా భార్యకు నిజం చెప్పలేక, ఇటు విమలను ఒంటరిగా వదలలేక రోజూ సాయంత్రం వచ్చి మా అత్తగారిని చూసి కబుర్లు చెప్పిపోతూ కాలంగడుపుతున్నాను. అంతేకాక రాజారావుగారికి కూడా ఈ విషయం తెలియనివ్వలేదు. ఇప్పుడు చెప్పండి, నేను చేసింది తప్పంటారా?'' ప్రశ్నించాడు సత్యనారాయణ.

వసుంధర గుండెల్లోంచి ఉవ్వెత్తున తన్నుకువచ్చిన దుఃఖం కట్టలు తెంచుకొని ప్రవహించింది. ఒక్క ఉదుటున వెళ్ళి "అమ్మా" అంటూ తల్లిని కౌగలించుకొంది. అప్పుడు ఆమెకు కుష్టువ్యాధిగాని దాని తీవ్ర పరిణామం గాని ఆమెకు అర్థంకాలేదు. ఎంతో బలవంతంమీద వసుంధరను ప్రక్కనున్న కుర్చీలో కూర్చోపెట్టగలిగాడు సత్యనారాయణ. విమల ''అక్కా" అంటూ వచ్చి నేలమీద కూర్చొని అక్కవళ్ళో తలదాచుకొని భోరున ఏడ్చింది. ఒంటరిగా ఎన్నో ఏళ్ళు ఆమె పడ్డ కష్టాలకు ఫలితంగా ఇప్పుడు తనవాళ్ళంటూ కొంతమంది ఆప్తులు బంధువులు దొరికారు. అందుకే ఆమెకు అంత దుఃఖం. వసుంధర తన ఒడిలో ఉన్న చెల్లెలు తలను ప్రేమగా నిమురుతోంది. ఆమెకు ఈ లోకంలో ప్రియమైన వస్తువేదో దొరికినట్లుంది.

''తల్లీ, నన్ను క్షమిస్తావు కదూ! నేను నీకు ఒకప్పుడు చేసిన ద్రోహానికి ఈనాడు ఫలితం అనుభవిస్తున్నాను" పశ్చాత్తాప హృదయంతో అంది వసుంధర తల్లి రాజమ్మ.

"అమ్మా! అలా అనకమ్మా. ఎంతో కాలానికి కలుసుకొన్నాం. నా కెంతో ఆనందంగా ఉంది. ఇక ఈ జబ్బు అంటావా అది మన అందరి దురదృష్టం. అంతమాత్రంచేత నిన్ను వదులు కొంటామా" అంటూ అంతవరకు తననే గమనిస్తున్న భర్తను చూసేసరికి ఆమె హృదయం ఉప్పొంగిపోయింది.

తనలో మొలకెత్తిన అనుమానం, తద్వారా బావిలో దూకడంవంటి నీచకార్యం చేయడం గుర్తుకొచ్చి చెల్లెల్ని విడిపించుకొని లేచి భర్తకాళ్ళదగ్గర వంగి పాదాలను కళ్ళకద్దుకొంది.

"ఛ... ఛ... లే వసుంధరా ఏమిటిది" అంటూ ఆమెను అప్యాయంగా లేవనెత్తాడు సత్యనారాయణ.

"నన్ను క్షమించండి. మీమీద లేనిపోని అనుమానాలు పెట్టుకొని మిమ్మల్ని అవమానించాను. దేవుడులాంటి మీరే నన్ను వివాహం చేసుకొని ఉండకపోతే ఈ స్థితిలో ఉండేదానినా'' అంది కృతజ్ఞతాపూర్వకంగా.

తనను పెళ్ళిచేసుకొనడానికి ఎవరూ ముందుకు రాకపోవడం, సత్యనారాయణ చేసుకోవడం అన్నీ చెప్పడం మొదలు పెట్టింది తల్లికి.

"ఇంకేం చెప్పకు తల్లీ. అబ్బాయి ద్వారా మన కుటుంబ విషయాలన్నీ తెలుసుకొన్నాను'' అంది ఆమె కూతురివైపు ప్రేమగా చూస్తూ.

"చెల్లెమ్మా పిల్లలు స్కూలునుంచి వచ్చేటయిమయింది. నీవు కనిపించక పోతే కంగారుపడుతుంటారు'' అన్నాడు రాజారావు రంగంలోకి దిగి.

''నిజమే అన్నయ్యా. అమ్మా నీ ఇద్దరు మనవళ్ళను, మనవరాల్ని తీసుకొని వస్తాను చూద్దువుగాని. నువ్వూ రా విమలా."

''ఇప్పుడొద్దులే అక్కా. అమ్మదగ్గర వుంటాను. బావద్వారా నేను అశోక్‌ను, మురళిని, జయను ఎప్పుడో చూసాను. నిన్నుకూడ. మీకు కాని నేనెవరైంది తెలియదనుకో" నవ్వుతూ అందివిమల.

సత్యనారాయణను అక్కడే ఉండమని రాజారావు, వసుంధర ఇంటికి బయలుదేరారు.

"ఏయ్ రిక్షాఅబ్బీ ఇలారా" పిలుస్తున్నాడు రాజారావు.

''వద్దు అన్నయ్యా, నాకిప్పుడు ఒంట్లో వెయ్యి ఏనుగుల బలం వచ్చింది. నడిచే వెళ్దాం" అంది వసుంధర.

ఇద్దరూ నడవడం మొదలు పెట్టారు. దారిలో కాలువమీద కట్టిన వంతెనను సమీపించారు. వంతెనకు సమీపంలో కాలువ గట్టుమీద కాకులు గుంపుగా చేరి అరుస్తున్నాయి.

"ఎందుకు కాకులు అలా అరుస్తున్నాయో చెప్పగలవా వసుంధరా?"

"అక్కడేదో వింత విషయం జరిగుంటుంది అన్నయ్యా!"

"సరే చూస్తాం రా" అంటూ వాటిని సమీపించి తరిమాడు. అవి ఎగిరి పోయాయి.

"ఇప్పుడేం కనిపించిందమ్మా నీకు."

"ఏమీ కనిపించలేదు"

"అంతేనమ్మా. లోకమూ అంతే. అందుకే లోకులు పలుగాకులు అన్నారు. లేని విషయాన్ని సృష్టించి దాన్ని పెద్దది చేస్తారు. చివరకు నిజం తరచిచూస్తే అక్కడ ఏమీ ఉండదు. అదే నీ విషయంలోనూ జరిగింది. సత్యవతి, పార్వతమ్మ లాంటివాళ్ళు చేసిన ప్రచారం నీ మనసును విషతుల్యం చేసింది. అది ఈ సంఘంలో మనుషుల నైజం తల్లీ."

"నిజం అన్నయ్యా."

"అందుకే ఇప్పుడు మీ అమ్మను తీసుకొచ్చి నీ ఇంట్లో పెట్టుకొంటే ఇదే లోకం నిన్ను దుమ్మెత్తి పోస్తుంది" అన్నాడు రాజారావు ఉడికిస్తూ.

"హు.... నన్ను తొమ్మిది నెలలు మోసి, అష్టకష్టాలు పడి నన్ను కన్నది ఈ లోకం కాదు. మా అమ్మ. మా అమ్మకోసం ఈ లోకాన్ని లెక్కచేయాల్సిన అవసరం లేదు. రేపే నా చెల్లెల్ని, మా అమ్మను తీసుకొచ్చి మా దగ్గరే పెట్టుకొంటాం" అంది రోషంగా.

"అదీ మనిషికి ఆ మాత్రం ధైర్యం ఉండాలమ్మా. లేకపోతే ఈ లోకంలో బ్రతకలేం."

రాజారావు మనసిప్పుడు నిర్మలంగా ఉంది. కాకులరిస్తే అరిష్టం అని అన్నాడొక విద్యార్థి కాని ఇప్పుడు అరిష్టం కాదుగదా, ఒక సమస్యకు పరిష్కారం దొరికింది అనుకొన్నాడు. కాలువ ఇవతలి గట్టున లేచిపోయిన కాకులు మరలా అవతలి గట్టున గుంపుగా చేరి అరుస్తున్నాయి.



# ఐరావతమ్మ

కొండల్రావుకు చచ్చే చావుగా వుంది. ఎక్కే గడప దిగే గడప క్షణం తీరిక లేకపోవడంతో అతనికి ఆయాసం వస్తూవుంది. హనుమంతుడు సంజీవి కోసం వెతికినట్లు కొండల్రావు గదికోసం టౌనంతా గాలించి వేస్తున్నాడు. మధ్యాహ్న మయింది కాని ఎక్కడా అతనికి చిన్నగది దొరకలేదు. కొండల్రావు యుక్తిపరుడు. అంతటి యుక్తిపరుడి ఆటలూ ఇక్కడ సాగటంలేదు.

'ఇదే ఆఖరు. ఇక ఈ పూటకు యిళ్ళ వేట ఆపుదాం' అనుకొంటూ 'కె. గోవిందయ్య, లాండులార్డు' అని నేమ్ ప్లేటున్న కాంపౌండు గేటు తీసుకొని లోపలికి అడుగుపెట్టాడు. ఇంటిముందు చిన్న పూలతోట వుంది. పూలచెట్ల మధ్యగా లోపలికి సన్నని దారి వుంది

కొండల్రావు ముందుకు నడిచి వరండాలో కుర్చీలో కూర్చొని పేపరు చదువుతున్న నడివయస్కుడికి "నమస్కారమండీ" అంటూ రెండు చేతులెత్తి నమస్కారం చేసాడు. ఆయన చీపురు పుల్లలా వున్న కొండల్రావును ఎగాదిగా చూసి ఫక్కున నవ్వాడు. తరువాత 'కూర్చో' అన్నట్లు ఎదురుగా కుర్చీపైపు చేయి చూపించాడు. ఆ నడివయస్కుడు తనను చూసి ఎందుకు నవ్వినా గదిస్తే చాలను కొంటూ కుర్చీలో కూర్చున్నాడు.

మధ్య వయస్కుడు పేపరు మడచి ప్రక్కన పెట్టి, కళ్ళద్దాలను తీసి పంచె అంచులతో తుడుస్తూ "ఐరా!" అంటూ పెద్దగా అరచాడు. కొండల్రావు బిత్తర పోయ్యాడు. 'అరె! ఈ జంతువు పేరు నేను ఎప్పుడూ వినలేదే' అనుకొన్నాడు. ఒకవేళ తను అతన్ని మధ్యలో డిస్టర్బ్ చేసాడని తన పెంపుడు కుక్కచేత కరి పిస్తాడేమోనని భయపడి కాళ్ళు రెండూ పైకి లాక్కొని కుర్చీలో పెట్టుకున్నాడు. వేదాంతిలా నవ్వాడు మధ్య వయస్కుడు.

ఒక నిముషం తర్వాత వెనకనుంచి పెద్దగా ఉచ్ఛ్వాసనిస్వాసలు వినిపించ డంతో తిరిగి చూసాడు. అంతే, భయంతో లేచి నిలబడి గడ్డిపోచలా వణకి పోసాగాడు కొండల్రావు.

మధ్యవయస్కుడు చిరునవ్వు నవ్వి, "భయపడకోయ్ బలవంతరావ్! ఈ గోవిందయ్య అర్ధాంగి ఆమె. నమస్కారం చెయ్ నువు అనుకొన్నపని అవుతుంది" అన్నాడు.

గోవిందయ్య ఇంతకు పూర్వం తనను చూసి నవ్విన నవ్వుకు ఇప్పుడు అర్థం తెలిసింది కొండ్రావుకు.

"నాపేరు బలవంతరావు కాదండి. కొండ్రావు" అన్నాడు.

ఎదురుగా ఓ భీకరమైన ఆకారం నిలబడి వుంది. ఆమె స్త్రీ అని కట్టు బొట్టు తీరు తెలుపుతూవుంది. అయితే ఆకారం గున్న ఏనుగులావుంది. పైనుంచి క్రింది వరకూ ఒకే సైజుతో నెట్టుకొచ్చి నిలబెట్టిన సారాపీపాలావుంది. ఆమె ఒక్కోచేయి కొండ్రావు ఛాతీకి రెండు రెట్లు లావుంటుంది. తల చిన్నదిగా పీపామీద బోర్లించిన చెంబులావుంది. ఆమె శరీరం కాఫునలుపు ముఖం కాఠిన్యంగా వుంది. ఆమెకు కొండ్రావును చూస్తే ఈర్ష్యగా వుంది. కొండ్రావుకు ఆమెను చూస్తే భయంగా వుంది.

గదివద్దు బాబోయ్ వెళ్ళిపోదాం అనుకునేంతలో ఆమె పక్కనేవున్న బెంచీ మీద కూర్చొంది. కొండ్రావు ఇంతకుముందు కూర్చొన్న కుర్చీలో రెండుకాళ్లు వుంచింది.

"ఏంకావాలి?" ముఖంలో కనిపించే కాఠిన్యత కంఠంలోలేదు.

"ఏమీ అక్కర్లేందండి" వెనక్కు తిరగబోయాడు కొండ్రావు.

"అదేమిటోయ్! రూముకావాలన్నావ్, వెళ్ళిపోతున్నావ్. అమ్మగారికి చెప్పుకో నీ పరిస్థితి" అన్నాడు, ఇంటి ఓనరు గోవిందయ్య.

కుదుటబడ్డ మనసుతో "అమ్మా! నేను గాంధీనగర్ బట్టల కొట్టులో గుమాస్తాగా పనిచేస్తున్నాను. ఒంటరివాణ్ని. తమరింట్లో ఏదైనా గది అద్దెకిస్తారేమోనని" నసిగాడు.

"అద్దె ఎంత ఇవ్వగలవ్" అంది ఆమె జబర్దస్తీగా.

"ఓ పాతిక అయితే ఇవ్వగలనండి"

"గది వందరూపాయలు చెప్పినా కళ్ళకద్దుకొని తీసుకొనేవాళ్ళు బోలెడుమంది న్నారు. పాతికకు గదేం వస్తుంది"

"నా జీతమే మూడువందలండి''

"అయితే గది దొరకదు అబ్బాయ్''

'ఈమాత్రం దానికి ఇంత ఇంటర్వ్యూ దేనికో' అనుకొంటూ మెట్లుదిగాడు భార్యాభర్తలిద్దరూ ఏదో మాట్లానుకొంటున్నారు.

కొండల్రావు కాంపౌండు గేటు దగ్గరకు వచ్చేసరికి "అబ్బాయ్" అంటూ పిలిచింది ఐరావతమ్మ.

వెనక్కు తిరిగాడు కొండల్రావు.

'ఏ పుట్టలో ఏపాముందో' అంటున్నాడు గోవిందయ్య.

కొండల్రావు వాళ్ళదగ్గరకు నడిచాడు.

"మీదేవూరు నాయనా" అనడిగింది ఐరావతమ్మ.

తన ఊరిపేరు, తన ఫామిలీని తీసుకురాలేకపోవడానికి గల కారణాలను వివరించాడు.

"అబ్బాయ్ నాకథ పూర్తిగా విని ఏదైనా పరిష్కారం దొరికితే చెప్పు నేను పెళ్ళయ్యేంతవరకు సన్నగా, చలాకీగా వుండేదాన్ని. కాని పెళ్ళయిన మరుసంవత్సరం మంచి. ఇంతింతై వటుడింతై అన్నట్లు ఇలా ఊరిపోయాను నాయనా. పెళ్ళప్పుడు మా అయన్ను, నన్ను చూసిన అమ్మలక్కలంతా మీ ఆయనేమో చింతమానులా వున్నాడు, నువ్వేమో గడకర్రలా వున్నావు అనేవారు. కాని ఇప్పుడు మా పరిస్థితి దానికి వ్యతిరేకమయింది. కూర్చుంటే లేవలేను. లేస్తే కూర్చోలేను....అమ్మా.... అబ్బా....ఉస్...." అంటూ ఆయాసం తీర్చుకోసాగింది ఐరావతమ్మ. ఆమె ఈ మధ్యకాలంలో ఎప్పుడూ అంతసేపు కంటిన్యూగా మాట్లాడలేదు పాపం.

గోవిందయ్య అందుకొన్నాడు "....బాబూ! నేను ఒకప్పుడు లాంచ్ లార్డునే. పెళ్ళానికి వైద్యం చేయించాలనే నెపంతో టౌనులో స్థిరపడి లాండ్ అంతా పోగొట్టు కొని లాండులేని లార్డునయ్యాను. ఇంత ఖర్చుపెట్టినా ఫలితం ఏ మాత్రమూ కని పించలేదు. ఇప్పుడు నా సమస్య అల్లా నా భార్య గురించే. ఒక సినిమా లేదు, ఒక షికారులేదు పాపం. మొన్నటికిమొన్న శివరాత్రికి గుడికి పోవాలంటే ఒక్క రిక్షా వాడూ ఎక్కించుకోలా. టాక్సీలోనా పట్టదు. నడిచిపోదామంటే అరమైలు దూరం ఆరుగంటలసేపు నడుస్తుంది, అందుకే ఏంచేసామంటావ్'' ప్రశ్నార్థకంగా ఆగాడు గోవిందయ్య.

'మీరే చెప్పండ'న్నట్లు గోవిందయ్య పైపు చూశాడు కొండల్రావు.

"అప్పుడేంచేసామో తెలుసా వీదిలో కూరగాయలు అమ్మే నాలుగు చక్రాల బండీ తెప్పించి, దానిమీద కూర్చోబెట్టి నెట్టుకు వెళ్లాం. ఇలావుంది మా పరిస్థితి. లావు తగ్గటానికి చెట్లకు నీళ్ళు తనే తోడిపోస్తుంది ఇల్లో పనంతా చేస్తుంది. ఎక్కువ పనిచేస్తే గుండెనొప్పి వస్తుందేగాని లావు తగ్గడంలేదు...."

"....కనుక నాయనా నీ ఎరికలో ఎవరయినా ఈ జబ్బుకు వైద్యం చేయగల వ్యక్తి ఎవరయినా వుంటే చెప్పు బాబూ! నీకు పుణ్యం వుంటుంది" రెండు చేతులెత్తి ప్రార్థిస్తూ అంది ఐరావతమ్మ.

కొండల్రావు మెదడులో ఒక స్పార్క్ మెరిసింది. పేషెంట్లులేక గోళ్లు కొరుక్కుంటూ మంచినీళ్ళు త్రాగి కాలం గడుపుతున్న ఆర్.ఎం.పీ డాక్టరు అప్పారావు గుర్తుకొచ్చాడు. ఇప్పుడు ఈ కేసు అతనికి పట్టిస్తే వాడి నోట్లోకి కూడుపోతుంది. తనకూ ఉండటానికి ఇక్కడ గూడు దొరుకుతుంది అనుకొన్నాడు.

"అమ్మమ్మా.... అమోఘంగా సెలవిచ్చారండి. నన్ను నేను తిట్టుకోవాలండి. ఎందుకంటారేమో ఈ విషయంమీద మీరడిగేంత వరకు నేను చెప్పలేదు అందుకని. నా స్నేహితుడొకడున్నాడమ్మగారూ! పేరు అప్పారావు. బ్రహ్మాండమైన వైద్యుడు. ఉదయగిరి కొండల్లోంచి తెచ్చిన వనమూలికలతో అద్భుతమైన మందు తయారు చేస్తాడు. గుర్తింపులేక అలా వుండిపోయాడుగాని, ఎవరైనా ప్రోత్సాహమిస్తే అతన్ని మించినవాడు. ఉండడు లావు వాళ్ళని సన్నగా చేయడంలో ఎక్స్‌పర్టు. మీ వ్యాధి నయంచేయగలవాడు అతనొక్కడే. ఇక నేను వెళ్తాను. ఎప్పుడు రమ్మంటారో చెప్పండి. అప్పుడే నేను వచ్చి స్వయంగా అక్కడకు తీసుకువెళ్తాను" తన వాక్చాతుర్యాన్ని బయటపెట్టాడు కొండల్రావు.

'నేచెప్పలా' అంటే 'నేచెప్పలా' అంటూ ఒకరికొకరు వాదించుకొన్నారు. తరువాత "కూర్చోనాయనా" అంటూ కుర్చీ చూపించింది.

'దారిలో పడుతున్నారు దంపతులు' అనుకొంటూ నక్కలా ముడుచుకొని కుర్చీలో కూర్చున్నాడు కొండల్రావు.

"నాయనా కొండల్రావూ! చీకట్లో చిరుదివ్వెలా దొరికావు మాకు. నన్ను నీవే కాపాడాలి. మా ఇంట్లోనే ఓ గదిలోవుండు. అద్దెవ్వనుకూడా ఇవ్వవక్కరలేదు.

నా జబ్బు నయం చేయించి నేను సన్నబడేలా చేయి చాలు. నా ఆస్తంతా వదులు కోవడానికైనా సిద్ధంగా వున్నాను" అంది ఆవేశంగా ఐరావతమ్మ

"అమ్మమ్మా! అంతమాటనకండి. మీరంత ఖర్చుపెట్టాల్సిన అవసరంలేదు. వాడు నా ఫ్రెండే. జబ్బు నయమయింతర్వాతనే డబ్బు ఇస్తురుగాని" అన్నాడు కొండల్రావు వినయం కనబరుస్తూ.

"నువ్వు ఎట్లాచెబితే అట్టా నడుచుకుంటాను. సాయంత్రమే వచ్చి గదిలో చేరు" ఆప్యాయంగా అంది ఐరావతమ్మ. గోవిందయ్య నిర్వికారంగా నవ్వాడు.

ఆరోజు సాయంత్రమే వరండాకు కుడివైపుగా నున్న గదిలో చేరాడు. మంచి రోజు చూసి డాక్టరు దగ్గరకు వెళ్దామని ఐరావతమ్మే అనడంతో కొండల్రావు తొందర పడలేదు. అలాగే అంటూ తన మిత్రుడి దగ్గరకు వెళ్ళి విషయమంతా చెప్పాడు.

"ఒరే ఆమె లావు తగ్గించడం నావల్లకాదు. నాకు ఆ డబ్బులు అక్కర్లేదు" నిరాశగా తల వ్రేలాడేసాడు అప్పారావు.

"ఓరి అమాయకుడా! డాక్టరు ఎక్కడైనా నేను జబ్బు నయంచేయలేనని ఒప్పుకుంటాడట్రా. నయమవుతుందని చెప్పి డబ్బు గుంజాలిగాని. ఇక పేషంట్లకు నమ్మకం లేకపోతే వాళ్ళే వేరే డాక్టరును చూసుకుంటారు."

"అయామ్ సారీరా! నిజాయితీగా నీళ్ళు త్రాగి బ్రతుకుతానుగాని మోసంచేసి పంచభక్ష్య పరమాన్నాలు తినను" నడుందగ్గర ప్యాంటు చిరుగును కప్పేడుతూ షర్టు క్రిందికి లాక్కొన్నాడు.

"ఒరే నువ్వు కాదంటే రేపు ఉదయమే నన్ను ఫుట్‌బాల్‌ని తన్నినట్లు నన్ను వీధిలోకి తన్నేస్తుంది అక్కడ నేను క్షేమంగా వుండాలంటే నీవీ సహాయం చేయక తప్పదు" రెండు చేతులు పట్టుకొంటూ అడిగాడు. చివరకు ఎలాగో ఒప్పుకొన్నాడు అప్పారావు.

ఐరావతమ్మను ఒకరోజు డాక్టరు దగ్గరకు తీసుకువెళ్ళాడు. అప్పారావు ఏవేవో పరీక్షలుచేసి, వనమూలికలతో ప్రసిద్ధమైన మందు తయారు చేయాలని, పదిరోజులలో మందు తయారుచేసి కొండల్రావుచేత పంపిస్తానని చెప్పాడు. ఎప్పటిలాగే చెట్లకు

నీళ్ళు పోయడం, చెట్లు త్రవ్వడం మొదలయిన పనులు చేయాలని చెప్పాడు. అప్పా రావు వద్దంటున్నా కొంత డబ్బు అతని చేతిలో పెట్టింది. ఐరావతమ్మ. అప్పటి ఆత్రుత ఆమెది మరి.

రోజులు గడుస్తున్నాయి కాని ఐరావతమ్మలో ఏ మార్పూ రావడంలేదు ఉద యాన్నే బావినుండి నీళ్ళులాగి బిందెతో మోసుకెళ్ళి చెట్లకు పోస్తుంది. అంత పెద్ద బిందె ఆమె చేతిలో చిన్న చెంబులా కనిపిస్తుంది. ఇంట్లో పనులన్నీ తన పైన వేస్కు న్ని చేస్తుంది. అయినా రోజు రోజుకూ ఆమె లావవుతుందేగాని, సన్నబడడంలేదు.

ఆరుసెలలు గడిచింతర్వాత ఒకరోజు "కొండల్రావ్! లాభంలేదోయ్! మీ అప్పారావు మందు లావు తగ్గించడానికి బదులు లావెక్కిస్తుందోయ్! యింకో డాక్టరును చూడు" అంది.

కొండల్రావు రకరకాల డాక్టర్లను మారుస్తూ వున్నాడు. ఆమెకు విసుగు వచ్చి నప్పుడు ఊరడిస్తున్నాడు. ఆమెలో ఆశను పెంపొందింపజేస్తూ ఎన్నో ఉదాహరణలు చెబుతున్నాడు. గోవిందయ్య ఇవేమీ పట్టించుకోవడం లేదు చూస్తుండడం తప్ప. ఇప్పుడు కొండల్రావు గది అద్దె కట్టకపోగా, భోజనంకూడా ఉచితంగా ఆ ఇంట్లోనే లభిస్తూ వుండడంతో సన్నగా రివటలా వుండే కొండల్రావు తెగ బలిసి గుండ్రా యిలా నున్నగా తయారైనాడు. ఐరావతమ్మకు గురువు, దైవం, ఆప్తుడు, ఆపద్బాం ధవుడు అన్నీ అతనే. కొండల్రావు ఆ ఇల్లు తన స్వంతంగా భావిస్తే ఆమె కొండల్రావును తన యింట్లో ఒక సభ్యుడిగా పోషిస్తూ వుంది. అండవుంటే కొండ దాటవచ్చు అనే నమ్మకం ఆమెది. అందుకే అన్ని రహస్యాలు అతనికి చెబుతుంది.

కాలం సాగిపోయే ఎలక్ట్రిక్ ట్రెయిన్‌లా జారిపోతూ వుంది. ఐరావతమ్మ విసిగి వేసారిపోయింది. ఇక తాను లావు తగ్గటం ఈ జన్మకు కల్ల అనుకొంది. తన జన్మ ఇలా గడచిపోవాల్సిందే అనుకొన్నదై కొండల్రావుతో మాట్లాడడం తగ్గించి వేసింది. కొండల్రావుకు భయం పట్టుకొంది. పరిస్థితుల్ని అన్ని కోణాల్లోంచి పరిశీలించి చూశాడు. ఆమెకు తనమీద విశ్వాసం పోయింది. ఇక రెండురోజులు పోతే తనను హోటల్లో తినమన్నా ఆశ్చర్యపోనవసరంలేదు. తరువాత గదిలోంచి వెళ్ళగొట్టటం ఖాయం అనుకొన్నాడు. 'ఇంత బ్రతుకూ బ్రతికి ఇంటివెనకాల చచ్చి నట్టు ఇది తనకు ఎంత అవమానం!' మనసులోనే మథన పడసాగాడు కొండల్రావు.

రోజులు భారంగా గడుస్తున్నాయి ఇద్దరికీ. గోవిందయ్యకు ఇవేమీ పట్టవు. అడిగితే చిరాకు, అడగకపోతే పరాకు చూపిస్తున్నాడు. ఇలా భారంగా నడుస్తున్న

రోజుల్లో ఒకరోజు దగ్గర కాలం స్తంభించిపోయింది. పల్లెటూర్లో వున్న నాలుగెకరాల పొలంలో రెండెకరాలు అమ్మి బ్యాంకులో డిపాజిట్టు చేద్దామని అంతకుముందురోజే తెచ్చి బీరువాలో వుంచిన ఇరవైల రూపాయలు డబ్బు మాయమయ్యింది.

ఐరావతమ్మకు రోజూ నిద్రలేవగానే బీరువా తలుపు తెరిచి నగలను, డబ్బును కళ్ళకద్దుకోవడం అలవాటు. ఆ రోజు ఉదయం యథాప్రకారం నిద్రలేచివచ్చి కళ్ళు నులుముకుంటూ బీరువాతలుపు తెరిచింది. అందులో నగలున్నాయికాని, తను అంతకు ముందురోజు పెట్టిన డబ్బు మాయమయ్యింది. మళ్ళీమళ్ళీ కళ్ళు నులుముకొని చూసింది. బీరువా అంతా వెతికింది. అంతా శూన్యం. కళ్ళుతిరిగి క్రింద పడిపోయింది గోవిందయ్య పరిచర్యలకు తెలివివచ్చిన ఆమె నెత్తీ నోరు కొట్టుకొంటూ ఏడ్చింది. వరండాలో కొచ్చిన గోవిందయ్యకు కొండ్రావు గది తలుపులు బార్లా తెరిచి వుండడం కనిపించింది. అందులో కొండ్రావు పెట్టె బట్టలూ, సంచీ వగైరా ఏమీలేవు గది శుభ్రంగా వుంది. ఇది కొండ్రావు చేసాడంటే నమ్మలేకపోయినా, అతనే చేసాడని తెరచిన గది తలుపులు తెలియచేస్తున్నాయి

మొదట కొండ్రావును నానా దుర్భాషలాడిన ఐరావతమ్మ తన అయమాకత్వానికి, తనకు సంభవించిన మోసానికి తనకు తనే నిందించుకొంది. నగలు అట్లాగే వున్నందుకు సంతోషించినా, ఇరవై వేల రూపాయలు రెక్కలొచ్చి ఎగిరిపోయినందుకు కడుపులో కెలికినట్లుగావుంది. పల్లెటూరి నుంచి రెండెకరాలమీద వచ్చే ధాన్యం పెట్టుకొని. బ్యాంకు డిపాజిట్‌లోంచి వచ్చే వడ్డీ పెట్టుకొని గుట్టుగా సంసారాన్ని గడుపుదామనుకొన్నారు ఐరావతమ్మ, గోవిందయ్య. ఇప్పుడు ఇది జరగడంతో అనుకొన్న మొత్తం బ్యాంకులో డిపాజిట్ చేయలేకపోయారు. కొండ్రావు పనిచేసే బట్టల షాపులో విచారిస్తే అతను అంతకు ముందురోజే తనకు రావలసిన డబ్బు తీసుకొని వెళ్ళిపోయాడని చెప్పారు గోవిందయ్యకు మొదటినుంచి కష్టపడి పనిచేయడం అలవాటులేదు కూర్చొని తినడం తప్ప. ఇప్పుడొచ్చే ఆదాయం చాలదు కనుక బ్రతుకు ఎలా గడపాలా అన్నది వాళ్ళకు సమస్య అయికూర్చొంది.

* * * *

ఇంటి వెనకనున్న ఖాళీస్థలం చదునుచేసి అక్కడంతా కాయగూరలు వేసింది. ఇంటిముందు పూలచెట్ల స్థానంలో ఇప్పుడు రకరకాల పాదులు చేరాయి. ఐరావతమ్మ తన శ్రమనంతా వెచ్చించి కాయగూరలు పుష్కలంగా పండిస్తూ వుంది. ప్రతిరోజూ

వాటిని గంపలకెత్తి మార్కెట్టుకు వేస్తూవుంది. తిండికి ఇబ్బంది లేకుండా జరిగి పోతున్నా, అన్యాయంగా పోయిన ఇరవైవేలూ గుర్తుకొచ్చి ఓ మూల కూర్చొని ఏడుస్తుంది. అది ఆమెకు ఆరని కడుపుమంట. సంవత్సరాలు గడచిపోతున్నాయి.

ఆ రోజు ఐరావతమ్మ నాలుగు గంపల్లోనూ నాలుగురకాల కూరగాయలుసర్దింది. రిక్షావాడు ఒక్కొక్కటి తీసుకువెళ్ళి రిక్షాలో పెడుతున్నాడు. ఇంతలో పోస్టుమన్ ఐరావతమ్మకు ఒక కవరు అందించి వెళ్ళిపోయాడు. పనిలోవున్న ఐరావతమ్మ చదవమని ఉత్తరం గోవిందయ్యకు అందించింది. గోవిందయ్య ఉత్తరం అమూలాగ్రం తన మనసులోనే చదువుకొని, "ఐరా! నీకు మంచిరోజులొచ్చాయి" అంటూ ఆమె కందించాడు. ఎందుకు గోవిందయ్య ముసిముసి నవ్వులు నవ్వుతున్నాడో ఆమెకు అర్థం కావడంలేదు. ఉత్తరం చదవడం మొదలు పెట్టింది.

పూజ్యులు, గౌరవనీయులైన ఐరావతమ్మగారికి, గోవిందయ్యగారికి మీ విధేయుడు కొండవీటి కొండలార్రావు వ్రాయునది-

నేను మీ ఇంట్లో మూడు సంవత్సరములు వున్నాను. ఆ కాలంలో ఉచిత భోజన నివాస సదుపాయములతో నన్ను ఎంతో ఆదరించారు. దానికి నా కృతజ్ఞతలు తెలియజేసుకొంటున్నాను. కాని, పాపం మీ వ్యాధి నయం చేయించలేక పోయానే అని నాలో నేను ఎంతో మధనపడేవాడ్ని. ఎలాగయినా మీ వ్యాధినయం చేయించాలి అనే కృత నిశ్చయానికి వచ్చాను చివరికి. "నా సర్వస్వం త్యాగం చేస్తాను. వున్న డబ్బంతా ఖర్చుపెడతాను" అని మీరు చెప్పిన మాటలు పదేపదే గుర్తుకు వచ్చేవి. దానికి తగ్గట్లు మా ఓనరు నన్ను ఉద్యోగంలోంచి తీసివేయడంతో ఆ రాత్రంతా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాను. వేకువజామునే లేచి, బయట ఆదమరచి నిద్రపోతున్న మిమ్మల్ని గమనించాను. అంతే నా నిర్ణయాన్ని అమలులో పెట్టదలచి దిండు క్రిందనున్న బీరువాతాళాలు తస్కరించి దొరికిన డబ్బుతో పారిపోయాను.

"....ఓరి దొంగ గాడిదా ఎంతప్లాను వేసావురా" పళ్ళు పటపట లాడించింది ఐరావతమ్మ.

అంతవరకు అపుకున్న కోపం మాటల రూపంలో బయటకు క్రక్కింది. రేడియో ప్రాంతీయ వార్తలంతా స్పష్టంగానూ, కాబూలీవాలా బాకీదారుడ్ని తిట్టినంత అసహ్యంగానూ కొండలార్రావును తిట్టడం మొదలు పెట్టింది.

"ఐరా! పూర్తిగా చదివి, తరువాత తిట్టదలిస్తే తిట్టవే" అనునయంగా అన్నాడు గోవిందయ్య. మరలా ఉత్తరం చదవడం మొదలు పెట్టింది.

నాలుగు రోజుల క్రితం నేను వ్యాపారం నిమిత్తం ఈ ఊరికి వచ్చాను. మీరెలాగున్నారో చూద్దామని మీ ఇంటి కెదురుగా ఉన్న కిళ్ళీకొట్టు దగ్గర నిలబడ్డాను వరండాలో ఎవరో సన్నగా, రివటలా వున్న స్త్రీ చలాకీగా . తిరుగుతూ కనిపించింది చివరకు ఆ సన్నగా ఉన్న స్త్రీ మీరేనని తెలుసుకొని చాల సంతోషించాను. మీరు పోయిన డబ్బు తలచుకొని కృంగి, కృశించి అలా తయారయ్యారని కూడ అర్థం చేసుకొన్నాను. ఎలాగైతేనేం, మీ జబ్బు నయం చేసేనన్న తృప్తి నాకుమిగిలింది మీకు ఆ పాపపు లావు తగ్గిపోయింది అయితే నా ఫీజు మీరు చెల్లించలేదు. కాని దానికి బదులు మీ దగ్గరనుంచి దొంగిలించి తెచ్చిన వడ్డీలేని అప్పు (నా దృష్టిలో) నాకెంతో ఉపకరించింది. నేను ఆ యిరవై వేలతో మా ఊర్లో చిన్న బట్టలకొట్టు పెట్టాను. ఈ ఆరేళ్ళలో ఆర్థికంగా నిలదొక్కుకున్నాను. నా భార్య బిడ్డలతో తృప్తిగా జీవిస్తున్నాను. ఇప్పుడు నా వ్యాపారం మీద పెట్టుబడి డెబ్బయివేలు మీ ఇరవై వేలు, దానికో అయిదువేలు జతచేసి మొత్తం ఇరవయి అయిదువేలకు రెండు రోజుల్లో బాంకు చెక్కు పంపుతున్నాను. నా అడ్రసు కోసం వాకబు చేయవద్దని మనవి.

గోవిందయ్యగారికి నా నమస్కారములు తెలియజేయండి.

ఇట్లు

కొండపీటి కొండలార్రావు

"ఎంతయినా కొండల్రావు మనసే మనసండీ. చేసింది దొంగతనమయినా ఎంత సమర్థతగా, ఎంత తెలివిగా తనమీద మాటరాకుండా చూసుకొన్నాడండి" ఆర్తిమానంగా అంది ఐరావతమ్మ. ఒకనాటి తన విపరీతమైన లావును, ఈనాటి సన్నని నాజూకయిన శరీరాన్ని తలచుకొని ఎంతో ఆనందించింది.

"అవునే. కొండల్రావు తన మాట నిలబెట్టుకున్నాడు చివరకు" అన్నాడు గోవిందయ్య.

భర్త మాటకు సిగ్గుపడి తూనీగలా ఇంట్లోకి పరిగెత్తి ఐరావతమ్మ. రాబోయే చెక్కు గురించి ఊహిస్తూ ఆరోజంతా ఆనందంగా గడిపింది.

# వెన్నెముక విరిగింది

"విజయరావ్! ఎక్కడికి వెళ్తున్నావ్?" అంటూ ఎదురుగా కూర్చున్న వ్యక్తి పలకరించేసరికి ఈ లోకంలోకి వచ్చాడు విజయరావు. రైలు కదులుతుంటే పరుగెత్తుకుంటూ వచ్చి ఎక్కిన విజయరావు ఇంకా ఆయాసంతో రొప్పుతూనే ఉన్నాడు. పామును చూసినట్టు వణికిపోయాడు అటు చూసిన విజయరావు. గుండెల్లోంచి పట్టరాని ఆవేశం పెల్లుబికింది. తను ఎవరివల్ల ఇలా మోడుబారిన జీవితం గడపాల్సివచ్చిందో ఆ వ్యక్తే అతను. తనను ప్రతిక్షణం కలవరపరచే ప్రశ్నలకు జవాబు అతనే.

విజయరావుని గతం వెన్నుతట్టి హెచ్చరించింది. అతనితో మాట్లాడవద్దని

ఏమిటి అలా చూస్తున్నావ్? నేను యూనివర్సిటీలో మీ ప్రొఫెసర్ని గుర్తులేదూ?" అన్నాడు ఆ వ్యక్తి చిరునవ్వు నవ్వుతూ. అతను ఫుల్ సూటులో ఉన్నాడు సన్నగా ఎర్రగా ఉన్నాడు. కళ్ళకు గోల్డుఫ్రేమ్ అద్దాలు. నలుపు, తెలుపు సగం సగం కలిపిన తలవెంట్రుకలు.

"ప్రొఫెసర్!.... ఆ తీయని చిరునవ్వు వెనుక ఎంత విషం ఉంది మిస్టర్ ప్రొఫెసర్! నా జీవితాన్ని ఎదగకుండా సీలింగు పెట్టింది నువ్వేకదూ! ఎప్పుడూ చిరునవ్వు పులుముకొని ఉండే నా ముఖాన అదెలాంటిదో మరచిపోయేటట్లు చేసిందెవరు? ఉత్సాహంగా ఎగిసిపడే నా కోరికల అలలను చిన్నాభిన్నం చేసింది నువ్వే మిస్టర్!"

విజయరావు మనసు అప్రయత్నంగానే గతంలోకి వెళ్ళిపోయింది.

* * *

ఆనాడు విజయరావు యూనివర్సిటీ విద్యార్థి. బ్రిలియంట్ స్టూడెంటని పేరుంది. ప్రతి క్లాసులోనూ ఫస్టే. క్లాసుమేట్సు నుంచి ప్రొఫెసర్ల వరకూ ఇతనంటే మంచి అభిప్రాయముంది. విజయరావుకు తాగుడు అలవాటులేదు, ఆడపిల్లలను పూసుకుతిరిగే అలవాటు అసలే లేదు. తన చదువేమిటో తనేమిటో.

ఎమ్.ఎ. ప్రీవియస్ ఫస్టుక్లాసులో పాసయ్యాడు. మార్కులుకూడా సెవెంటీ పర్సెంటొచ్చాయి. తరువాత ఎమ్.ఎ. ఫైనల్‌లో కూడా ఫస్టొచ్చాడు.

పి.హెచ్.డి. చెయ్యాలనేది విజయరావు చిరకాల వాంఛ. క్లాసులో ఎక్కువ పర్సెంటు మార్కులు వచ్చిన ఇద్దరికి రీసెర్చి చేసే అవకాశముంటుంది. విజయరావు ఆనందంగా ఆ ప్రొఫెసర్ దగ్గర రీసెర్చిచేసేందుకు అప్లికేషను పెట్టుకొన్నాడు తెల్లనివన్నీ పాలు, నల్లనివన్నీ నీళ్ళు అని నమ్మే విజయరావుకు తన అప్లికేషను తిరిగి వచ్చాక గాని జరిగిన మోసం తెలియలేదు. విచారించగా తనకంటే తక్కువ మార్కులు వచ్చిన ఇద్దరు ఫస్టుక్లాసు విద్యార్థులను రీసెర్చికి సెలక్టు చేసుకున్నారని తెలిసింది.

గురువుల్ని దైవంగా భావించే విజయరావ్‌కి కడుపు మండిపోయింది.

"నేను మీకేం ద్రోహం చేశాను సార్? నాకింత అన్యాయం చేశారు" అంటూ ప్రొఫెసరు ముందు వాపోయాడు.

"విజయరావ్! నాకేం తెలియదు నాయనా, యూనివర్సిటీ సిండికేట్ ఎవర్ని సెలక్టు చేస్తారో వాళ్ళనే నేను అడ్మిట్ చేసుకోవాలి. నేను నిమిత్తమాత్రుణ్ణి" అంటూ బాధపడ్డాడు.

"నాకంతా తెలుసు సార్ ఎవరేం చేశారో. చూస్తాను! రూల్సు ప్రకారం నాకు సీటు ఎట్లా రాదో."

"నీ ఇష్టం విజయరావ్! కాని ఒకటి మాత్రం చెప్పగలను. వచ్చే సంవత్సరము నిన్ను తప్పకుండా తీసుకుంటాను. ఫస్టు ప్రిఫరెన్సు నీకే" అనునయంగా అన్నాడు.

విజయరావు చేసేదేం లేక గుడ్లు నీరు కుక్కుకుంటూ తన దురదృష్టానికి ఎవరిని నిందించాలో అర్థంకాక అక్కడ నుంచి వెళ్ళిపోయాడు.

తరువాత యూనివర్సిటీ సిండికేటుకు పిటీషను పెట్టుకొన్నాడు తనకంటే తక్కువ మార్కులు వచ్చిన వాళ్ళని సెలక్టు చేసుకున్నారని, తన అప్లికేషన్ రిజెక్టు చేశారని దాంతో యూనివర్సిటీ సిండికేట్ ఎంక్వయిరీకి ఆదేశించింది.

రెండు రోజులు గడిచిన తరువాత విజయరావు ఇంటిముందు ఒక స్కూటరు ఆగింది. అందులోంచి తన ప్రొఫెసరు, ఇంకో ప్రొఫెసరు కిందికి దిగారు.

విజయరావు ఇద్దర్నీ లోపలకు ఆహ్వానించాడు. కొత్త ప్రొఫెసరు వచ్చాడు గాని, విజయరావుకు సంబంధించిన ప్రొఫెసరు బయటనే రోడ్డుమీద నిలబడిపోయాడు ఇంట్లోకి వెళ్ళి తల్లిచేత కాఫీ పెట్టించి రెండు కప్పుల్లో కాఫి పోసుకొని వచ్చి ఒక కప్పు లోపలున్న ప్రొఫెసరికిచ్చి, బయట వేపచెట్టు కింద ఉన్న ప్రొఫెసరుకు ఇంకో కప్పు కాఫీ ఇచ్చాడు.

"లోపలికి రండిసార్! లోపలికొచ్చి కూర్చోండి" అన్నాడు.

ప్రొఫెసరు ముఖం చెల్లలేదు. "ఫరవాలేదు బాబూ! ఇక్కడే ఉంటాను" అన్నాడు. అతని దృష్టంతా విజయరావు పూరింటిమీద ఉంది.

"విజయరావ్! ఇంత అర్జంటుగా నిన్ను కలుసుకొనడానికి ఎందుకొచ్చామో తెలుసా?" అన్నాడు లోపలున్న ప్రొఫెసరు.

"నాకేం అర్థం కావటంలేదు సార్" అన్నాడు విజయరావు అమాయకంగా.

"నువ్వు చేసిన పని బాగ లేదయ్యా! అయినా నువ్వింతకు తెగిస్తావని నేననుకోలేదు."

"నేనా, నేనేం చేశాను సార్" కంగారుగా అన్నాడు విజయరావు.

"ఇంకా ఏమి చెయ్యాలేమిటి? మీ ప్రొఫెసరు మీదనే పిటిషన్ పెట్టావు గదయ్యా!"

"సార్! నేను ప్రొఫెసరుమీద విరోధంతో పిటిషన్ పెట్టలేదు. పి.హెచ్.డి. చేసుకునేందుకు నేనెందుకు అనర్హుణ్ణో తెలుసుకునేందుకు మాత్రమే పిటిషన్ పెట్టాను. నా పిటిషన్లో నేనెవర్నీ దోషిగా పేర్కొనలేదు.

"నువ్వు పేర్కొనకపోవచ్చు. అందరూ అనుకొనేది ప్రొఫెసర్ని దోషి అనేగదా!"

"మీరెలా అనుకున్నా నాకేం అభ్యంతరం లేదు, నాకు అన్యాయం జరిగింది మాత్రం నిజం."

"దానికి నేనొప్పుకుంటాను విజయరావ్! అతను మీ గురువు గదా! గురువు పరువు తీయటం న్యాయమా?" బ్రతిమాలుతున్న ధోరణిలో అన్నాడు ప్రొఫెసరు.

"సార్ నేను గురువుల్ని దైవసమానంగా చూసుకొనేవాణ్ణి. గురువు అభిమానం చూపించి ఉంటే నా చర్మం ఒలిచి చెప్పులు కుట్టించి వుందును." ఉద్వేగంతో అన్నాడు విజయరావు. అతని కళ్ళలో నీళ్ళు గిఱ్ఱున తిరిగాయి.

కొద్దిసేపు ఆగి అన్నాడు ప్రొఫెసర్.

"ఇంతకీ నువ్వేం చెబుతావ్?"

"నేను చెప్పేదేమిటి సార్? ఎలా జరగాల్సుంటే అలా జరుగుతుంది."

"జరిగేదేముంది? న్యాయం నీపై వుంది. చట్టం ప్రకారం నీకు ఎట్టి పరిస్థితుల్లోనూ పి. హెచ్.డి. లో సీటు ఇవ్వాలి. ఎలాగూ సెలక్షను అయిపోయింది. ఇప్పుడు నీకు సీటు ఇవ్వడంగాక నీ వుణ్యమాని ప్రొఫెసరు ఉద్యోగానికే ప్రమాదం వచ్చేటట్టుంది."

విజయరావు మౌనంగా ఊరుకున్నాడు.

"చూడు విజయరావ్ నీవు విద్యార్థివి మాత్రమే. కాని ప్రొఫెసర్ పరిస్థితి ఇంకో అయిదేళ్ళలో రిటైరవుతాడు ఈలోపల ఆయన ఉద్యోగానికేదైనా జరిగితే అతని సోషల్ ప్రిస్టేజి ఏం గావాలి. ఫామిలీ, పిల్లలు-ఒకసారి ఆలోచించు."

విజయరావు ఒక్క నిముషం మాత్రం ఆలోచించాడు.

"సరే, ఏం చెయ్యాలో చెప్పండి"

"నీవు మేం చెప్పిన విధంగా ఒక స్టేటుమెంటు రాసివ్వ చాలు" అన్నాడు ప్రొఫెసరు ఆనందంగా.

"అలాగే" అన్నాడు ఒక నిర్ణయానికొచ్చిన విజయరావు.

వెంటనే ప్రొఫెసరు తన చేతిలో ఉన్న బాగులోంచి అంతకు ముందే రాసి పెట్టి ఉన్న స్టేట్‌మెంటు విజయరావు కిచ్చాడు.

అందులో విజయరావు తన రీసెర్చికి అప్లికేషను లేటుగా పెట్టుకొన్నాననీ, ఇందులో ప్రొఫెసర్ తప్పు ఏ మాత్రమూ లేదనీ, అదీగాక తనకు ఈ సంవత్సరం రీ సెర్చి చెయ్యాలని లేదనీ, కనుక తన పిటిషన్ మీద ఎంక్వయిరీ డ్రాప్ చేయమని ఉంది.

విజయరావు దాన్ని చూసి అలాగే ఒక స్టేటుమెంటు రాసి కింద సంతకం పెట్టి "సార్ చాలా! ఇంకెక్కడయినా సంతకం పెట్టాలా?" అన్నాడు.

ప్రొఫెసర్ విజయరావుకు షేక్‌హాండిచ్చి భుజం తడుతూ "నాయనా! నీ వల్ల విద్యార్థుల విలువ పెరిగింది. ఒక ప్రొఫెసర్ చేసిన పొరబాటును సరిదిద్దేందుకు తోటి ప్రొఫెసరుగా నేను రావాల్సి వచ్చినందుకు చింతిస్తున్నాను. నన్ను క్షమించు" గాద్గదికంగా అని కర్చీఫ్‌తో కళ్ళు తుడుచుకొని బయటకు కదిలాడు.

బయట ఉన్న ప్రొఫెసరు స్కూటరు స్టార్టు చేశాడు. అతనికి వెనక్కు తిరిగి విజయరావు వైపు చూసే ధైర్యం లేదు. విజయరావు కళ్ళకు నీటిపొరలు కమ్మి దూరమవుతున్న వాళ్ళు అస్పష్టంగా కనిపించారు.

విజయరావు ఆ సంవత్సరమంతా ఇంటిదగ్గరే ఉండిపోయాడు. అప్పుడు అతనికి ఇంట్లో వాళ్ళ ఆర్థిక బాధలు పూర్తిగా అర్థమయ్యాయి. ఇంతకాలం వాడేదో చదువుకుంటున్నాడు, వాడి చదువు పూర్తికాగానే మంచి ఉద్యోగం వస్తుందిలే, ఈ లోపల వాడికెందుకు ఇంట్లో బాధలు చెప్పడం అనుకొని, ఉన్న రెండెకరాల పొలం సాగుచేస్తూ దానిమీద అప్పులు తెస్తూ, అవి చాలక ఇంటిమీద కూడా కొన్ని అప్పులు తెచ్చాడు విజయరావు తండ్రి.

ఇంట్లో పరిస్థితులు అతని మనసును వికలం చేశాయి. తను ఉద్యోగం చేయాల్సిన ఆవశ్యకత ఉందని తెలిసింది. అంతకు ముందయితే తనకొచ్చే స్కాలర్ షిప్‌లు, ఇంట్లో తెచ్చే అప్పులతో గడిచిపోయింది. దాంతో పిహెచ్.డి. విషయం గాలికి వదిలేసి ఉద్యోగ ప్రయత్నాలు మొదలు పెట్టాడు. టెన్తు క్లాసు చదివే తమ్ముడు, ఎయిత్ క్లాసు చదివే చెల్లెలుకు పైచదువులు చెప్పించే బాధ్యత తన భుజాలమీద వేసుకున్నాడు.

ఎలాగో తంటాలుపడి చిన్నదో, పెద్దదో స్టేటు గవర్నమెంటులో గుమస్తా ఉద్యోగం సంపాదించుకొన్నాడు. ఇదిగో, ఇప్పుడు మూడేళ్ళ తరువాత ట్రెయిన్కు తారసపడ్డాడు, ఒకనాటి తన ప్రొఫెసర్-

"ఏమిటి ఆలోచిస్తున్నావు ? జనరల్ కంపార్టుమెంటులో ఎందుకు ప్రయాణిస్తున్నాననా?" ప్రొఫెసర్ పలకరించాడు.

విజయరావు మాట్లాడలేదు.

"అర్జెంటుగా ఢిల్లీ సెమినార్‌కు వెళ్ళాల్సొచ్చింది విజయరావ్ ! ఇకలోడ రిజర్వేషను దొరకలేదు విజయవాడకు ట్రంక్ కాల్ చేసి ఢిల్లీకి రిజర్వు చేయమని నా ఫ్రెంచ్‌కి చెప్పాను. అక్కడనుంచి ఇబ్బంది ఉండదు."

అయినా విజయరావు మాట్లాడలేదు

"ఏం విజయరావ్, నామీద కోపమా?" అన్నాడు ప్రొఫెసరు.

"పేదవాడి కోపం పెదవికి చేటన్నారు. నాకోపం మిమ్మల్నేం చేస్తుంది?"

"అయితే నువ్వింకా అది మరచిపోలేదన్నమాట!" నిట్టూర్చాడు ప్రొఫెసరు

'ఎలా మరచిపోతాను సార్? నా జీవితాన్ని గాడి తప్పించి గతుకుల బాటలో. పెట్టిన మిమ్మల్ని మరచిపోగలనా' అనుకొన్నాడు మనసులో.

"జరిగిపోయిందేదో జరిగిపోయింది ఆయామ్ వెరీ సారీ! మరుసటి సంవత్సరం వచ్చి చేరుతావని ఎంతగానో ఎదురు చూశాను. కాని నీవు రాలేదు. ఇప్పుడేం చేస్తున్నావు విజయరావ్?"

విజయరావు మౌనాన్ని చూసి మళ్లీ మళ్లీ అడిగాడు ప్రొఫెసరు.

"గొడ్రెతోక బెత్తెడన్నట్లు నా జీవితం కుదించుకుపోయింది సార్! మీ చర్య వల్ల నా వెన్నెముక విరిగిపోయింది. ఇక ఎలా లేచి నిలబడగలను ? ప్రస్తుతం గుమాస్తాగా బ్రతుకు ఈడుస్తున్నాను. రిటైరయ్యేలోగా మేనేజరు నవుతానన్న భరోసాకూడా లేదు." అన్నాడు.

ప్రొఫెసర్ మనసు జాలితో నిండిపోయింది. తను ఆశ్రిత పక్షపాతానికి పాల్పడి చేసిన ఒక చిన్న తప్పు రత్నంలాంటి ఒక విద్యార్థి బంగారు భవిష్యత్తును ఎలా తారుమారు చేసిందో అతనికి పూర్తిగా అర్థమైంది. తాను ఆదర్శానికి మరో పేరయిన గురువు స్థానంలో ఉండి కూడా న్యాయాన్ని పరిరక్షించ లేకపోయాడు. న్యాయాన్ని పరిరక్షించడమేమిటి, తానే అన్యాయానికి పాలుపడ్డాడు. దీన్ని ఏ న్యాయమూ, ఏ చట్టమూ హర్షించదు.

ఇంతలో రైలు పక్క స్టేషన్లో ఆగింది. అందరూ ఒక్కొక్కరే దిగుతున్నారు. ప్రొఫెసరు విజయరావు వెనకనే ప్లాటుఫారం మీదికి దిగాడు.

వెళ్తున్న విజయరావు భుజం మీద చేయివేసి ఆపాడు ప్రొఫెసరు.

"విజయరాక్! నేను చేసిన తప్పుకు ఆ రోజునుంచి మనస్ఫూర్తిగా బాధపడు తున్నాను. నువ్విలా ముభావంగా ఉంటే నా మనస్సెప్పటికీ శాంతించదు. ఇక నైనా నన్ను క్షమించవా?'' బొంగరు పోయిన గొంతుతో అన్నాడు. తను చేసిన పనికి ఆయన చాలా 'గిల్టీగా ఫీలవుతున్నాడు.

'సార్! మీ మీద నాకు ఈ క్షణం వరకు కోపం ఉన్నమాట నిజమే. కాని ఈ రోజు మీతో సంభాషించిన తరువాత ఆ కోపం ఎగిరి పోయింది. ఒక విధంగా నేను పి.హెచ్.డిలో చేరకపోవడం నా కుటుంబం మంచికేమో! లేకపోతే నేను రీసెర్చి అంటూ ఉన్న ఆస్థిని అమ్మించేవాణ్ణి. ఇంటి దగ్గర ఉండబట్టి ఇంట్లో ఆర్థిక బాధలు తెలిసి ఇపుడు కొంతవరకైనా ఆదుకోగలుగుతున్నాను' అన్నాడు మాటలు తడబడగా.

'చిన్నడిపైనా ఎంతో లోకానుభవం సంపాదించావు నాయనా!" అంటూ శిష్యుణ్ణి కౌగలించుకున్నాడు ప్రొఫెసర్.

ఇంతలో రైలు బయలుదేరుతున్నట్లు పెద్దగా కూసింది.

ఇంతలో టైము చూసిన సప్తగిరి హడావుడిగా "సరే, గోవిందరావ్. ఒక్క నిముషం నువ్వు బయటకూర్చో వరండాలో కుర్చీఉంది" అన్నాడు.

"ఇక్కడ కూర్చుంటే ఏం, గురూ!"

"నువ్వు కూర్చో అమ్మా. మా బాబువికదూ. రెండు నిమిషాలే" అంటూ గోవిందరావుని రెక్కబట్టి బయటికి నెట్టి తలుపులు మూసి లోపల గడియ పెట్టుకున్నాడు.

"నీలవేణీ, నీలవేణీ" అంటూ చిన్నగా పిలిచాడు.

బిందె చంకనపెట్టి పూలతీగలా నడిచిపోతున్న నీలవేణి కిటికీ దగ్గరకు వచ్చి ఆగిపోయింది.

"దేవిగారి దర్శనం ఉదయం నుంచికాలేదు."

"మా నాన్న ఇప్పటివరకు ఇంట్లోనే ఉన్నాడు. మీకేమో కిటికీ దగ్గర నిలబడి గంటలకొద్ది కబుర్లు చెప్పాలాయె. అందుకే ఆయన్నలా వెళ్ళనిచ్చి వచ్చాను" వగలుపోతూ అంది నీలవేణి.

"కిటికీ దగ్గర నిలబడి కబుర్లు చెప్పకపోతే గదిలోకి రాకూడదేమిటి?

"అమ్మో గదిలోకే. అందులోనూ మిమ్మల్ని నమ్మిరావడం."

"ఏం? నేను సింహాన్నా నిన్ను నమిలి మింగేస్తాననుకోవటానికి?"

"మరికాక. నువ్వు మగపురుగువయితే, మేము ఆడపురుగులం. మీకూ మాకు తరతరాలనుంచి యుద్ధమే కదా. మోసం చేయడం మీ వంతు మోసపోవడం మా వంతు."

"అబ్బో మాటలు చాలా నేర్చావే."

"అంతా రచయితగారి పుణ్యం."

రచయిత అని సంబోధించేసరికి సప్తగిరి ఉబ్బిపోయాడు.

"అయితే 'డబ్బు సంపాదించడమెలా?' పుస్తకం ఇంకో కాపీ ఇచ్చేదా" అన్నాడు ఆనందంగా.

"ఎందుకు? ఒకటిచ్చావుగా "విత్ లవ్" అని వ్రాసి."

"ఇంతకీ నీ అభిప్రాయమేమిటి, నీలవేణి. వర్త్ రీడింగ్ కదూ?"

"నిజం చెబుతున్నాను-బాధపడకు. దానిపేరు "మోసంతో డబ్బు సంపాదించడమెలా?" అని ఉండాలి."

"అంటే?"

"అపార్థం చేసుకోకు, మహాశయా. టైటిలు ఆ విధంగా మార్చావంటే నీ పుస్తకాలు కొత్తగా రిలీజయిన సినిమా టిక్కెట్లలా అమ్ముడుపోతాయి. అసలు డబ్బు సంపాదించాలంటే మోసంచేయాలి కదా."

"నిజమే నీలవేణి. అలాగే చేస్తా. కాని టైటిలు మార్చాలంటే మళ్ళీ ఎంత ఖర్చవుతుందో" ఆలోచనలో పడిపోయాడు సప్తగిరి.

తరువాత ప్రేమ కబుర్లతో కొంత సమయం గడిపారు ఇద్దరూ.

"మా అమ్మ పిలుస్తోంది. నే వెడతా" అంటూ కదిలిన నీలవేణి జడ పట్టుకొని కిటికీ దగ్గరకు లాగాడు. ఆమె తన బుగ్గమీద ముద్దు పెట్టుకోవడంకోసం జాంబవంతుని మూతిలా పొడవుగా సాగివస్తున్న అతని మూతిని ఒకచేత్తో లోపలికినెట్టి జడ విదిలించుకొని బయటికి నడిచింది 'ఆఫ్టర్ మ్యారేజి' అంటూ.

దాంతో నిరాశగా తలుపు తీశాడు సప్తగిరి.

"సారీ, బ్రిదర్. నిన్ను బాధపెట్టినట్లున్నాను. బోరుకొట్టిందికదూ?"

"బోరేంలేదు. ఇంటికి వెళ్ళి భోజనంచేసి వచ్చి ఇప్పుడే కూర్చున్నాను."

"అః" అని ఆశ్చర్యంగా నోరుతెరచి, "సరే, రా లోపలికి" అన్నాడు.

సప్తగిరి కుర్చీలో కూర్చుని టేబులు మీద కాళ్ళు పెట్టుకున్నాడు. గోవిందరావు ఈజీచెయిర్‌లో కూర్చున్నాడు.

"అయితే ఏం చేయాలంటావు, గురూ?"

సప్తగిరి తలను ఒకసారి తడుముకొని 'ఎలాఉంది నా తల' అన్నాడు.

టెన్నిస్ కోర్టుకు ఆ అంచూ, ఈ అంచున పెరిగిన పచ్చిగడ్డిలా సప్తగిరి నడినెత్తి వెంట్రుక లూడిపోయి నున్నగా మెరుస్తూంటే, చెంపలమీద మాత్రం వెంట్రుకలున్నాయి. గోవిందరావు సప్తగిరి తలను చాలారోజుల నుంచి చూస్తూనే ఉన్నాడు కాని 'గురూగారూ, ముప్పై ఏళ్ళకే మీ తల టెన్నిస్‌కోర్టులా ఎందుకయింది?. అని అడగలేక మథన పడుతున్నాడు. ఇప్పుడు తన సమస్య తీరే సమయమొచ్చిందని సంబరపడ్డాడు.

"మీ తలకేసుండి ఎంతో బ్యూటిఫుల్‌గా ఉంది."

"ఏం? నీకూ ఫన్నీగా ఉందా"

"అయ్యయ్యో! ఫన్నీగాదండి. గురువుగారూ, మీరు ఎలా ఉండని అడిగితే సమాధానం చెప్పాను". నొచ్చుకొంటూ అన్నాడు గోవిందరావు.

"ఏం చెప్పేదయ్యా గోవిందరావు నా పరిస్థితి. ఉద్యోగంలో చేరిన కొలొత్త నా తల వెంట్రుకలు కర్లింగ్సుతో ఎంతో దట్టంగా ఉండేవి. తరువాత ఇదిగో ఈ పుస్తకం వ్రాశానయ్యా. దాంతో నెత్తిమీద వెంట్రుకలూడడం మొదలయింది. పుస్తకం వ్రాయడం పూర్తికావడం, వెంట్రుకలన్నీ వూడిపోవడం ఒకేసారి జరిగింది రచయితల కిదొక శాపమయ్యా బాబూ. పేరుగాంచిన రచయితల్ని వెతుకు వాళ్ళలో నూటికి తొంభై మందికి బాల్డ్‌హెడ్డే."

కొమ్ములు తిరిగిన రచయితలతో సప్తగిరి తనను పోల్చుకున్నందుకు రాబో యిన నవ్వు ఆపుకొన్నాడు గోవిందరావు. "చిత్తం. సెలవియ్యండి" అన్నాడు.

"నా బాధంతా ఒకటేనయ్యా. పుస్తకాలు ఈ రోజు కాకపోతే రేపు అమ్ము డవుతాయి, కొంత పర్సెంటు రిడక్షనిస్తే కానీ వూడిపోయిన వెంట్రుకలు ఎలాతిరిగి వస్తాయయ్యా!"

సప్తగిరి బాధను చూసి గోవిందరావుకు అతనిమీద జాలి కలిగింది.

"బాధపడకండి. మీ బాల్డ్ హెడ్డు ఏమాత్రమూ అసహ్యంగా లేదు. మీకు రచయితగా అదొక గుర్తింపు కూడాను."

"ఏం గుర్తింపు. గోవిందరావ్? బంగారంలాంటి పర్సనాలిటీ పోయింతర్వాత. నా ప్రేమకూడా ఈ బాల్డుహెడ్ కారణంగానే ఫెయిలయ్యేటట్లుంది. ఈ మానసిక క్షోభ ఎలా భరించేది?"

"ఏం బాధపడకండి మంచి డాక్టర్ని కన్సల్టు చేద్దాం."

"ఒక డాక్టరేం ఖర్మ ఇప్పటికి ఎంతోమంది డాక్టర్లు అయిపోయారు. కాని నా జబ్బు నయంకాలేదు."

"మీరు ఆయుర్వేద డాక్టర్లను కూడా కన్సల్టు చేశారా?"

"ఆఁ! వాళ్ళుమాత్రం ఏం చేస్తారు? వోదార్పుమాటలు చెప్పడం తప్ప."

"అలా అనుకోవడం మంచిదికాదు గురువుగారూ. నే చేప్పే ఈయన ఇటువంటి విషయాల్లో ఆరితేరిన వాడు. మీ జబ్బుకు సరైన వైద్యం చేస్తాడు" సప్తగిరి ధైర్యం చెప్పాడు.

*　　*　　*

"నీలవేణీ! నిజంగా నన్ను ప్రేమిస్తున్నావా?'' నీలవేణి కోమలమైన చేతిని తన చేతితో నిమురుతూ ప్రేమగా అడిగాడు.

"ఎందుకు ఇన్నిసార్లు అడుగుతున్నావు? మనం ప్రేమించుకొన్నది నిజం మన పెళ్ళికాబోయేది తథ్యం."

"అదే నువ్వు ప్రేమిస్తున్నట్లు సరదాకి చెబుతున్నావా లేక నిజంగానా? నా పర్సనాలిటీ చూసి చెప్పు.''

''నీ పర్సనాలిటీకేం. నా కలల్లో రాకుమారుడివి."

"నా బాల్డుహెడ్ చూశావు గదా. ఇది తెలిసే మాట్లాడుతున్నావా?"

"బాల్డుహెడ్ ఉంటే ఏం? ఫారిన్‌లో ఎక్కువమంది ఆడపిల్లలు బాల్డుహెడ్‌ను చూసి ప్రేమలో పడుతారట. అదొక డిగ్నిటిగా ఫీలవుతారట. నేను నీలో నచ్చి ఆకర్షింపబడ్డ అంశం అదేనేమోనని నా అనుమానం."

"నో. నెవర్. నీవు నా అందం చూసిగాదు ప్రేమించింది."

"మరి?"

"నా ఉద్యోగం చూసి.''

"ఈ రోజు నా కేదో అగ్నిపరీక్ష పెడుతున్నట్లున్నావు. ప్రేమ అనేది పరస్పర ఆకర్షణవల్ల ఏర్పడుతుంది. ఐశ్వర్యానికి, అందానికి అది అతీతం. ఇక ఉద్యోగం అనేది ప్రేమ గట్టిపడడానికి దోహదం చేస్తుంది. ఉద్యోగం లేకపోయినా ప్రేమించి పెళ్ళిచేసుకొన్న జంటలు ఎన్నిలేవు."

"రేపు పెళ్ళయింతర్వాత నా బాల్డుహెడ్‌ను అసహ్యించుకొంటూ నన్ను చిన్నచూపు చూస్తావు కదూ!''

"ఛ.... నేనెందుకు అలా చేస్తాను. అలాంటివేం మనసులో పెట్టుకోకు. ప్రేమికులు అన్న తరువాత పరస్పరం గౌరవించుకోవాలి."

"నో, నేను నమ్మను. ప్రతి ఆడదీ భర్త అవకతవకల్ని వేలెత్తి చూపి బాధ పెడుతుంది."

నీలవేణి సప్తగిరివైపు కోపంగా చూసింది. తరువాత చరచరా వెళ్ళిపోయింది

ఇంతలో బయట తలుపుమీద చప్పుడయింది.

తలుపు తీయగానే లోపలికి వచ్చాడు గోవిందరావు. "అంతా రెడియేనా?" అన్నాడు.

"రెడి వెళ్దాంపద."

వీళ్ళు వెళ్ళేసరికి ఆయుర్వేద భిషక్‌గారు ఇంట్లోనే ఉన్నారు. చాపమీద కూర్చొని, ముందున్న చిన్నటేబిలు మీద ఏదో వ్రాసుకొంటున్నాడు. అతని కెదురుగా రోగులు కూడా చాపలమీద కూర్చొని ఉన్నారు. కొద్దిదూరంలో కల్వంలో ఏవేవో ఆకులు, ఓషదులు నూరుతూ ఇద్దరున్నారు. కొద్ది దూరంలో మందు సీసాలకు పట్టిస్తూ మరొక ఇద్దరున్నారు.

భిషక్‌గారి ఆహ్వానం మీద సప్తగిరి, గోవిందరావు, చాపమీద కూర్చొన్నారు ఆయన ఒక్కొక్కరిని వ్యాధి గురించి అడుగుతూదానికి సంబధించిన మందుపొడులు భస్మాలు, మాత్రిలు కట్టి ఇస్తున్నాడు. సప్తగిరి తనవంతు రాగానే అంతా వివరించి చెప్పాడు.

ఆయుర్వేద వైద్యులుగారు మొదట కొంత స్పీ చిచ్చారు. "అయ్యా, భారత దేశంలో అనాదిగా వాడుకలో ఉన్న వైద్యము, తిరుగులేని వైద్యము ఆయుర్వేదమైయున్నది. 'ఆయు' అనగా లైఫ్ అని 'వేదము' అనగా నాలెడ్జి అని ఇంగ్లీషు అర్ధం. అంటే సుఖజీవనము గడుపుటకు సరియైన జ్ఞానం అని భావం. కనుక ఆయుర్వేదం అన్ని వైద్యములలోకి ఉత్కృష్టమైనదని పెద్దలు చెప్పుచున్నారు.

అయ్యా; మీరు చెప్పే వెంట్రుకలు వూడే జబ్బును ఆయుర్వేదంలో 'ఖాలిత్య" అని అంటారు. దీనికి ఆయుర్వేదంలో అద్భుతమైన మందున్నది. నేనొక భస్మం ఇస్తాను. ప్రస్తుతానికి వాడండి. నిద్ర లేవగానే ముఖం కడుక్కొని తులంభస్మాన్ని తేనేలో కలుపుకొని ఆరగించండి. తరువాత నేనిచ్చిన తైలాన్ని తలమీద మర్ధన చేయండి. అలా చేయడంవలన మొదట్లో బలహీనమైన వెంట్రుకలన్నీ వూడిపోతాయి. అయినా భయపడకండి. అలా వాడుతూఉంటే ఫలితం కనిపిస్తుంది.

నాయనా! నీవు అనుమానించాల్సిన అవసరంలేదు. దీనికి తగ్గకుంటే మహత్తరమైన మందు మరొకటుంది. ఒక నాలుగు వందలు ఇచ్చిపోండి. ఏనుగు దంతాలను పుటంపెట్టి చూర్ణం చేయించి ఇస్తాను. దాన్ని తెనేలో కాని, నేతిలో కాని

రంగరించి బట్టతలమీం మర్దన చేశారంటే దానికి తిరిగుఉండదు. అయితే అది వాడ బోయేముందు నున్నగా గుండు చేయించుకోవాలి."

సప్తగిరికి కళ్ళు తిరిగాయి. నాలుగొందలు అంటున్నాడు. ఇంత ఖరీదా? చేసిన అప్పులు ఇప్పటికీ తీర్చలేకున్నాడు. అదీగాక వెంట్రుకలు తీయించేస్తే మరలా వస్తాయో, రావో! ఉన్నవి పోగొట్టుకోవడం అంత అవివేకం మరొకటిలేదు ఆ పర్సనాలిటీతో నీలవేణికి ముఖం చూపించలేడు.

సప్తగిరి గోవిందరావు తొడగిల్లాడు- "ఇక వెళదాం" అంటూ.

"తరువాత వచ్చి నాలుగు వందలు ఇస్తాం కాని ఇంతకు ముందు చెప్పిన భస్మము, తైలము ఇవ్వండి చాలు."

ఆయుర్వేద బిషక్ తన పీజుతో కలిపి మొత్తం పదిహేను రూపాయలు బిల్లు చెప్పాడు. బిల్లు చెల్లించి బయటపడ్డారిద్దరూ.

"గురువుగారూ ఏదో అనుమానిస్తున్నట్టున్నారు." దారిలో అడిగాడు గోవింద రావు.

"అవునోయ్. నాకీ వైద్యం ఇష్టంలేదు."

నడుస్తున్న గోవిందరావు టక్కున ఆగిపోయాడు. "గురువుగారూ! మీరు అదృష్టవంతులు. మీకు పర్మనెంటు క్యూర్ దొరికింది."

"నిజం?" ఆశ్చర్యంగా అడిగాడు సప్తగిరి.

"సర్టెన్లీ. పక్కవీధిలో ఖాసింఖాన్ అని నా మిత్రుడొకడున్నాడు. వాడికి గొర్రెతోక బెత్తెడు అన్నట్లు తల వెనక నాలుగే నాలుగు వెంట్రుకలున్నాయి. వాటిని ఆరేళ్ళనుంచి ప్రాణంగా కాపాడుకుంటూ వస్తున్నాడు. వాడీమధ్య నాకో విషయం చెప్పాడు."

"ఏమిటది?"

"ఢిల్లీలో హేర్ ట్రాన్స్‌ప్లాంటేషన్ క్లినిక్ ఒకటుందని. అక్కడకు వెళ్ళి తలమీద వెంట్రుకలు నాటించుకొని వస్తాడని"

"అలా జరుగుతుందంటవా?"

"ఈ అణుయుగంలో సాధ్యంకానిది ఏమీ లేదు, గురూ."

"అయితే ఆలస్యం దేనికి? వెళదాంపద."

ఇద్దరూ ఖాసింఖాన్ ఇంటికి వెళ్ళారు. గోవిందరావు కాలింగుబెల్ నొక్కాడు

"ఎవరూ?" వోరగా తలుపు తెరిచి అడిగిందో ఆకారం.

"నే నమ్మా జి. గోవిందరావుని. అంటే గోడకింద గోవిందరావుని ఈయన మా గురువుగారు."

ఒక నిమిషం తరువాత "మీకు మాత్రమే అనుమతి లభించింది. మీ గురువు గారిని అక్కడే కూర్చోపెట్టండి." అని తిరిగి ఆదే ఆకారంచెప్పింది.

"పరవాలేదులేమ్మా, ఖాన్ ఏం అనుకోడులే" అంటూ చనువుగా సప్తగిరిని తోపలికి తీసుకొని వెళ్ళాడు గోవిందరావు. అక్కడ ఖాన్ లుంగీతో కుర్చీలో కూర్చుని ఉన్నాడు. అతని నున్నని తలమీద ఎర్రసిరాతో చదరపు గళ్ళు గీచి ఉన్నాయి. చూడ్డానికి అతనో వింత జంతువులా ఉన్నాడు. వెనుక గొర్రెతోకలా బెత్తెడు జుట్టుంది.

"ఏమిట్రా ఏమిటీ విషయం?"

"అవన్నీ తరవాత చెబుతాను కాని, ముందు గెస్టును పరిచయం చెయ్యి" అన్నాడు గళ్ళు కనబడకుండా తలకు చేతులడ్డు పెట్టుకుంటూ.

"వీరు సప్తగిరిగారని మా ఆఫీసే ఈయన బాల్డుహెడ్‌తో బాధపడుతున్నాడు. హేర్ ట్రాన్స్‌ప్లాంటేషను గురించి తెలుసుకోవాలని వచ్చాడు."

"ప్లీజ్డు టు మీట్ యు, మైడియర్ సప్తగిరిగారూ. హేర్ ట్రాన్స్‌ప్లాంటే షను గురించి అడిగారు కనుక చెబుతున్నాను. దీని ఆఫీసు ఢిల్లీలో ఉందండి. తల మీద ఎక్కడైనా కొంతమేర వెంట్రుకలుంటే చాలు. దాన్ని తీసి మిగతా తలమీద నాటుతారు. ఇక చూసుకోండి నా సామిరంగా! వెంట్రుకలు విచ్చలవిడిగా పెరుగు తాయి. పని గంటా, రెండు గంటల్లో అయిపోతుంది."

"ఎంత అవుతుందంటారు సుమారు?"

"ఒక చదరపు అంగుళం నాటడానికి నాలుగు వందలు అవుతుందండి. ఆ లెక్కన బట్టతల ఎంత వైశాల్యముంటే అంత. అందుకే నా తల మీద చదరపు గళ్ళు గీయించుకున్నాను. ఇవి పదిహేను ఉన్నాయి. అంటే ఆ లెక్కన ఆరు వేలు అవుతుంది."

"ఓ మైగాడ్!"

సప్తగిరి ఆ తరువాతి క్షణంలో మరి అక్కడ లేడు.

సప్తగిరికి రోజులు భారంగా గడుస్తున్నాయి రోజురోజుకి కృశించి పోతున్నాడు. అతను కృశించే కొద్దీ వెంట్రుకలు వూడడంకూడా ఎక్కువగా అయింది నీలవేణి, గోవిందరావుల ఓదార్పు మాటలే లేకపోతే అతనేమయి పోయేవాడో!

ఆ రోజు ఆఫీసు పనిమీద రాజధాని నగరానికి పోవాల్సి వచ్చింది.

సప్తగిరి హైదరాబాదు ఎలాగూ పోతున్నాడు కనుక, గోవిందరావు ఏయే డాక్టర్లను కన్సల్టు చేయాల్సింది చెప్పాడు. సప్తగిరి హైదరాబాదు చేరుకుని తను రికార్డు హెడ్ ఆఫీసులో ఇచ్చాడు. దానిమీద వచ్చే ఉత్తర్వులు తనే స్వయంగా పట్టుకెళతానని, అప్పటివరకు ఇక్కడే ఉంటానని వాళ్ళతో చెప్పాడు.

బాల్డుహెడ్ కంటూ ఒక స్పెషలిస్టు రాజధాని నగరంలో లేకపోవడంతో గోవిందరావు చెప్పిన పెద్ద డాక్టరును కలుసుకో దలిచాడు. రెండో రోజు అపాయింట్‌మెంటు వచ్చింది. డాక్టరుని చూడగానే సప్తగిరికి నమ్మకం కలిగింది. కారణం డాక్టరు తలంతా నిండుగా వెంట్రుకలున్నాయి.

సప్తగిరిని అన్ని పరీక్షలు చేసిన డాక్టరు చివరకు ఏ జబ్బూ లేదని నిర్ణయించాడు.

"సార్. ఏన్నో ఆశలు పెట్టుకువచ్చిన నన్ను ఇంత నిరాశతో వెనుదిగిరి పంపడం న్యాయమా'' అన్నాడు చివరకు. తను ఎలా వ్యథ చెందుతున్నాడో కన్నీటి గాథగా వివరించాడు.

డాక్టరు చిరునవ్వు నవ్వాడు. తన నుదుటిని గోటితో గీచి తలమీద విగ్గును తీసి టేబులుమీద పెట్టాడు. తల నున్నగా, గుండ్రంగా గ్లోబులా ఉంది. రాష్ట్రంలో ప్రఖ్యాతి వహించిన డాక్టరు, మొన్ననే వైద్య వృత్తిలో ఉత్తమ డాక్టరుగా కేంద్ర ప్రభుత్వ అవార్డు తీసుకున్న వ్యక్తికీ బాల్డుహెడ్డే. సప్తగిరి కళ్ళప్పగించి చూస్తున్నాడు.

డాక్టరు నవ్వి, "సంఘంలో నా విలువ తగ్గి పోతుందని ఇది పెట్టుకోలేదు. నేనెప్పుడూ హాస్పిటలుకు విగ్గు లేకుండా వస్తాను. నిన్న మా వాళ్ళు మీకు అపాయింట్‌మెంటు ఇచ్చిన తరువాత నా పరిస్థితి మీకు ఉదాహరణంగా చూపాలని విగ్గు పెట్టుకొచ్చాను.

బాల్డునెస్ అనేది జబ్బుకాదు. తలమీద చర్మం క్రింద కణజాలం వీక్‌గా ఉంటే వెంట్రుకలు త్వరగా వూడుతాయి. దీని గురించి ఎక్కువగా ఆలోచిస్తే అనవసరమైన మానసిక శ్రమ, ఆత్రత తప్పవు. దీనివల్ల శారీరకంగా బాధ లేకపోయినా ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సుతో మనిషి కృంగిపోతాడు. తన అందం తరుక్కు

పోయిందని బాధపడతాడు. నిజానికి ప్రతి మనిషి ఉన్నతమైన తన నడవడికతో పదిమందికి ఆదర్శవంతుడు కావాలి. అంతేకాని తుచ్ఛమైన బాహ్య సౌందర్యానికి విలువ ఇవ్వకూడదు."

అసలైన గాంధి మహాత్ముడ్ని మన కళ్ళముందు నిలబెట్టిన "ఆటిన్‌బరో" "గాంధీ" సినిమా చూశావా? ఆయనకు ఎంత బట్టతల, దానివల్ల సంఘంలో ఆయనకు విలువ పోయిందా? భారతజాతి పిత అని దేశదేశాల్లో ఎలా కొనియాడబడుతున్నాడో మనకు తెలిసిందే కదా. వై డు యు ఫీల్ బాల్డ్‌నెస్ యాజ్ ఎ షేమ్ ఫుల్ థింగ్ వై నాట్ యు ఫీల్ ఇట్ యాజ్ ఎ సింబల్ ఆఫ్ నాలెడ్జి" అంటూ సప్తగిరి మనస్తాపాన్ని పోగొట్టాడు డాక్టర్.

"మీరు బట్టతల గురించి ఆలోచన మాని నేను చెప్పినట్లు ఆహారంలో మార్పులు చెయ్యండి."

"అలాగే సార్" అంటూ బుద్ధిమంతుడిలా తల వూపాడు సప్తగిరి.

"మీరు నాన్ వెజిటేరియన్ అయితే మాంసం; చేపలు ఎక్కువగా తినండి. వెజిటేరియన్ అయితే పెరుగు, పాలు, నేయి, మీ ఆహారంతోపాటు విరివిగా తీసుకోండి. వెంట్రుకలు రాలిపోవడం చాలావరకు అరికట్టబడుతుంది." అంటూ వివరించి చెప్పి కొన్ని విటమిన్ టాబ్లెట్లుకూడా వ్రాసిచ్చాడు డాక్టరు.

సప్తగిరి డాక్టరు స్వాంతన వచనాలకు కొంత తెప్పరిల్లినవాడై డైరెక్టరు ఆఫీసుకు వెళ్ళి తన పనికి సంబంధించిన ప్రొసీడింగ్సు పట్టుకొని తిరిగి భువనగిరికి వచ్చాడు.

ఇంటి లోగిలిలో అడుగు పెట్టగానే మొట్టమొదట చూడాలనుకున్నది నీలవేణిని అదృష్టవశాత్తూ నీలవేణి పంపుదగ్గర నీళ్ళు పడుతూవుంది. "నీలవేణీ" అంటూ ఆనందంగా పిలిచాడు. నీలవేణి తలెత్తి ఇతనిపై పొకసారి విసుగ్గా చూసి పంపు కట్టి విసవిసా నడిచి వెళ్ళిపోయింది.

సప్తగిరి తల తిరిగిపోయింది. తన ఆరాధ్యదేవత నీలవేణి ప్రవర్తన అతనికి అర్థంకాలేదు. గదిలోకి వెళ్ళి బట్టలుమార్చుకొని కొద్దిసేపు పడుకున్నాడు. ఆ రోజంతా ఆమె కనబడలేదు. ఆ రోజేకాక క్రమేణా ఆమె అతనికి దూరం కాజొచ్చింది. సప్తగిరి ఈ వేదన భరించలేక పోయాడు. ఎన్ని రాయబారాలు పంపినా నీలవేణి ఇతనికి ముఖం చూపించలేదు

సప్తగిరి జ్వరాన పడ్డాడు. పక్కింటి వృద్ధురాలు మానవత్వంతో అతనికి సేవ చేస్తూ ఉంది. ఒకరోజు స్నేహితుడు గోవిందరావుతో, 'తను నీలవేణి లేక పోతే చచ్చిపోతానని, ఎలాగయినా తామిద్దరినీ కలపా'లని గోడు పెట్టాడు.

వెళ్ళిన గంటకు తిరిగి వచ్చాడు గోవిందరావు.

"ఏమంటున్నది నా దేవత!" ఆత్రతగా చేతులు పట్టుకుని అడిగాడు.

"కూర్చోండి. గురువుగారూ. అసలు తప్పంతా మీదే."

"నాదా? ఇదేం అన్యాయం" వాపోయాడు సప్తగిరి.

"ఆమె చెప్పిన మాటలు చెబుతాను విను. నువ్వు బాహ్య ఆడంబరాలకు పోతావుట. ఈ రోజు బట్టతల అని నిన్ను నీవే అసహ్యించుకునేవాడివి, రేపు వివాహం అయిన తరవాత అదే న్యూనత కారణంగా తనలో అందం తగ్గిపోగానే ఎవరేమనుకుంటారేమోనని తరిమేస్తావుట. అదీ ఆమె భయం. అందుకని అటు నీ ప్రేమనూ వదలుకోలేక ఇటు తన జీవితం నాశనం చేసుకోలేక నిన్ను ప్రేమించిన ఖర్మానికి కుమిలిపోతూ ఉంది."

"అయామ్ వెరీ సారీ గోవిందరావ్. నేనిక ఒక్క నాటికీ అలా చేయను. ఆమె ముందు ప్రమాణం చేసి చెబుతాను, ఒక్కసారి ఆమెను తీసుకురా."

"నేను తీసుకు రావడమేమిటి? ఆమె రోజూ వచ్చి ఆ పైపు కిటకీలోంచి చూస్తూంటుంది. అదిగో చూడు" అన్నాడు గోవిందరావు.

అప్పటివరకు కారే కన్నీటిని తుడుచుకుంటున్న నీలవేణి వెళ్ళబోయింది. చప్పున వెళ్ళి చేయి పట్టుకున్నాడు సప్తగిరి. ఇద్దరి కళ్ళలో కన్నీరే.

మరుసటి నెలలో ఇద్దరికీ వివాహం జరిగిపోయింది.

అద్దంలో ముఖం చూసుకున్నప్పుడు 'రచయితల కిదొక శాపం' అని తల తడుముకొని నాలుక కొరుక్కుంటాడు ఇప్పటికీ సప్తగిరి.

సంసారం పెరిగి బాధ్యతలు ఎక్కువయితేనే కాని ఆ ఆలోచన పోదేమో?

# అమ్మా మీకిది న్యాయమా !

ఆకాశహర్మ్యాలు నాగరికతకు నిదర్శనాలుగా తలెత్తి చూస్తుంటే, చీమల బారుల్లా సాగిపోయే వాహనాలతో నిండిన రోడ్లు "దేశపురోభివృద్ధికి మేమే బాటలం" అంటున్నాయి. దీని కంతటికి కారణం పాదరసంలా ఒక చోట నిలవకుండా పరుగెత్తే మానవమేధ.

నేనెక్కవలసిన బస్సు నాముందు అగేసరికి నా ఆలోచనలుకూడా ఆగిపోయాయి నా ప్రక్కనే గాజులు గలగలమనడంతో, ఎక్కబోయే వాడినల్లా ఆగిపోయాను లేడీస్ ఫస్ట్ అన్న జాతీయ నినాదం గుర్తుకొచ్చి. ఆమె నావైపు ఓ చిరునవ్వు విసిరి బస్సెక్కింది.

నా ఒళ్ళు జల్లుమంది. ఆమె అందానికి, ఆమె విసరిన వాడైన ఆ వేడి చిరునవ్వుకు నేను ఆ షాక్‌నుంచి తేరుకోకముందే, నా వెనక వాళ్ళంతా ఎక్కడం, బస్సు స్టార్టు కావడం జరిగిపోయింది. అంతే ఒక అంగలో ముందుకురికి బస్సు కడ్డీ అందుకున్నాను.

మా పట్టంణలో ఎన్ని బస్సులున్నా ప్రయాణీకుల రద్దీ తగ్గదు. రాజధాని తరువాత వ్యాపారంలోగాని, నాగరికతలోగాని, జనాభాలోగాని మా పట్టణమే రాష్ట్రంలో రెండవస్థానం ఆక్రమిస్తుంది. అయితే బస్సు ప్రమాదాల్లో మాది మొదటి స్థానమని పత్రికలు పదేపదే చెబుతుంటాయి.

రెండు, మూడు స్టేజీలు దాటేసరికి నేను ఫుట్‌బోర్డు స్థాయినుంచి బస్సు మధ్యలో హేంగర్స్ పట్టుకొని వేలాడే వాళ్ళలో ఒకడినయ్యాను. సభ్యతకాదని తెలిసినా నా గుండెలో అలజడి కలిగించిన సుందరాంగి కోసం బస్సంతా కలయజూసాను. ఆమె ఎక్కడా లేదు. నా ప్రక్కనున్న సీట్లో కిటికీ దగ్గరగా కూర్చొని ఉంది. ఆమె ప్రక్కనే ఒక సీటు ఖాళీగాఉంది. పక్కన ఖాళీఉంటే ఆడదాన్ని ఆహ్వానించే సాహసం మగాడికి లేదు. అలాగే పరాయి మగాడి ప్రక్కన కూర్చొనే ధైర్యమూఆడదానికి లేదు ఇది అనాదిగా వస్తున్న సాంఘిక కట్టుబాటు.

నా మనసులోని భావం గ్రహించిందన్నట్టుగా, "కూర్చోండి" అంటూనన్ను ఆహ్వానించింది తను కొద్దిగా సర్దుకొని.

నా అంచనాలు తల్లకిందులయ్యాయి. ఆమె సంస్కార హృదయానికి జోహారు అర్పించకుండా ఉండలేకపోయాను. వెళ్ళి ఆమె పక్కన కూర్చున్నాను హేంగర్స్ పట్టుకొని వేలాడుతున్న మగవాళ్ళంతా నావైపు ఈర్ష్యగాను, ఆమెవైపు కసిగాను చూశారు. తమకు రావలసిన దేదో పోగొట్టుకొన్నట్టు.

ఆమె రిజర్వ్డుగా ఉంది. నాతో ఏం మాట్లాడలేదు. ఆమె అందమైన గుండ్రని ముఖం, బంగారు శరీరచ్ఛాయ, సంస్కారం ఉట్టిపడే ముఖం, కట్టుబొట్టు తీరు, అలంకరించుకున్న విధానం బాగా చదువుకొన్న యువతిలా ఉంది.

డ్రైవరు బస్సు నెమ్మదిచేసి, అదేపనిగా హారను కొట్టడంతో, కిటికీలోంచి కనిపించినంతమేరకు ఆ దృశ్యాన్ని చూశాను. అదొక ఊరేగింపు. అంతా ఆడ వాళ్ళే. కాలేజి అమ్మాయిలున్నంచి, ఉద్యోగం చేసే ఆడవాళ్ళు, గృహిణులు ఉన్నారు. అందరి చేతుల్లోనూ రకరకాల వ్యాఖ్యాలు వ్రాసి ఉన్న అట్టలున్నాయి.

"అసభ్య సినిమాలు బహిష్కరించాలి."

"స్త్రీల హక్కులు పరిరక్షించాలి."

"రోడ్డు రోమియోలను అరెస్టు చేయాలి."

"ఉద్యోగాలలో స్త్రీలకు రిజర్వేషన్లు ఇవ్వాలి"

ఒకరు అరుస్తూ ఉంటే మిగతావాళ్ళు నినాదాలిస్తున్నారు.

నాకు చాలా సంతోషమనిపించింది. స్త్రీ స్వాతంత్ర్యం, స్త్రీ అభ్యుదయం కోరేవాళ్ళలో మొదటివాణ్ణి నేను జాతి జీవనాన్ని పునరుజ్జీవింపజేసిది బిడ్డను ఒక ప్రయోజకుడిగా, వ్యక్తిత్వం కలవాడిగా తీర్చిదిద్దేది స్త్రీ. తల్లిగా, భార్యగా స్త్రీ అతి క్లిష్టమైన పాత్రలో జీవిస్తూ ఉంది. తెర వెనుకనుండి తమ తెలివితేటలతో భర్తల్ని చక్రవర్తుల్ని చేసింది స్త్రీలే! రాజ్యాధినేతలుగా, కవయిత్రులుగా, సంఘ సంస్కర్తలుగా పురుషులతో సమానంగా స్త్రీలు రాణించారు. దీనికి చరిత్రలో ఎన్నో ఆధారాలున్నాయి. నవీన యుగంలోకూడా స్త్రీలు అదే వైభవం కలిగిఉన్నారు అయితే ఈనాడు నాగరికత పెరిగింది. కనుక తమకు మిగిలిపోయిన హక్కుల్ని బాహాటంగా చాటుకొంటున్నారు.

ఊరేగింపు మెల్లగా బస్సును దాటిపోయింది. ఆమేదైనా మాట్లాడుతుందే మోనని చూశాను. మౌనంగా ఉంది, పెదాలమీద చెదరని చిరునవ్వుతో. ఆమెతో ఏదైనా మాట్లాడాలని ఉంది. కాని ఆమె మాట్లాడితే గదా!

బాంకులో జాబ్ చేస్తున్నాను. బ్రహ్మచారిని. ఎవరైనా మనసెరిగిన వాళ్ళని వివాహం చేసుకోవాలని నా ఉద్దేశం. ఇంతగా నచ్చిన అమ్మాయి. నా మనసును ఆకర్షించిన యువతి ఉద్యోగంలో చేరిన ఈ రెండేళ్ళలో నా దృష్టిలో పడ లేదు. చూడగానే ఒక మనిషిని గురించి ఒక నిర్ణయానికి రావడం మంచిదికాదని తెలిసినా ఈ అమ్మాయి అంటే నాకో విధమైన గౌరవం, ఆరాధనాభావం స్థిరపడి పోయింది.

ఇంతలో నేను దిగవలసిన స్టాపు వచ్చేసింది.

"థాంక్సండీ" అన్నాను ఇంత పెద్ద నగరంలో ఈ అమ్మాయిని మరలా చూడగలనా అనుకొంటూ.

"నో మెన్షన్, ప్లీజ్!" అంది చిరునవ్వుతో. నేను బస్సు దిగి నగరంలో గొప్పదైన షాపింగ్ సెంటరులో నిలబడ్డాను. ఆ సెంటర్‌లో నేను ఎప్పుడూకొనే ఆ టెక్ స్టైయిల్ షాపులో ప్రవేశించాను. విశాలమైన బట్టలంగడది. సీలింగు లోపల ఇమిడిపోయిన ట్యూబ్‌లైట్లు తెల్లని వెన్నెలలు కురిపిస్తున్నాయి. రకరకా లయిన మిల్లులకు సంబంధించిన వస్త్రాలు షెల్ఫుల్లో అమర్చిఉన్నాయి. ఒక్కొక్క షెల్ఫుదగ్గర ఒక్కొక్క సేల్స్‌మాన్ ఉన్నాడు. ఆడవాళ్ళకు సంబంధించిన చీరెలు, బ్లౌజులుఒక పైపు ఉన్నాయి.

నాకు కావలసిన రకాల్లో రెండు పాంటు పీసులు, రెండు షర్టు పీసులు కట్ చేయించి కాష్ కౌంటర్‌పైపు నడిచాను. అంత రద్దీగల షాపులోనూ ఒకే ఒక కాష్ కౌంటరు ఉంది. కాషియర్ కెదురుగా నిలబడ్డ స్త్రీమూర్తిని చూసి చకితుణ్ణ యాను. ఆమె బస్సులో కనిపించిన స్త్రీ. కలసిరావడమంటే అదేనేమో మ్యారేజెస్ ఆర్ మేడ్ ఇన్ హెవెన్" అన్నారు. బ్రహ్మదేవుడు గీత గీస్తే తప్పుతుందా? ఎలాగయినా పరిచయం చేసుకొని పెళ్ళిదాకా తీసుకురావాలి. "కృషితో నాస్తి దుర్భిక్షం" అన్నారు పెద్దలు.

"ఇంకో ఎనిమిది రూపాయలివ్వండి. మీ బిల్లు నాలుగు వందల ఎనిమిది" అన్నాడు క్యాషియర్.

"ఇంకా ఎనిమిదేమిటండి! నాలుగు వందలు సర్దుకోండి" అందామె.

"అమ్మా! మేమిక్కడ గుమాస్తాలం. ఓనర్లంకాదు. బిల్లు ఎంత ఉంటే అంత తీసుకోవడం మా బాధ్యత."

"అవునయ్యా! మేరే చెప్పండి ఓనర్లకు."

నాకొద్దిగా విసుగలిపించింది. అది నగరంలోనే పేరు ప్రఖ్యాతులున్న వస్త్రాలయం. అక్కడన్నీ ఫిక్సిడ్ రేట్స్. మిగతా షాపుల్తో పోల్చిచూస్తే ఇక్కడే చౌక అనుకోవాలి. ఇన్ని తెలిసి ఆమె ఇలా ఎందుకు మాట్లాడుతుందో నాకర్థం కావడంలేదు. ఏది ఏమయినా ఈ జాగ్రత్త ముందే ఉండాలి.

"ఇక మీ ఇష్టం అండి నేను చెప్పాల్సింది చెప్పాను" అంటూ ఇంకో బిల్లు అందుకొని కాష్ తీసుకొంటున్నాడు.

'పాపం! డబ్బులేవేమో, సహాయం చేద్దాం' అనుకొన్నాను.

ఇంతలోనే ఆమె నసుగుతూ భుజానికి వేలాడుతున్న మినీబాగ్‌లోంచి విసురుగా ఓ పది రూపాయల నోటుతీసి అతని కందించింది.

అతను క్యాష్ బాక్సులోంచి రెండు రూపాయలనోటు తీసి ఆమె కందించాడు. పాకెట్‌ను ఆమెవైపు నెట్టి మరోబిల్లు అందుకొని డబ్బు లెక్కపెట్టుకొంటున్నాడు.

ఆమె అక్కణ్ణుంచి కదల్లేదు.

"ఏమిటి రెండు రూపాయలు ఇచ్చారు?"

నా దగ్గర డబ్బు అందుకొని లెక్కపెడుతున్న కాషియర్ "మీకు రావలసింది అంతే కదా" అన్నాడు.

నా పని పూర్తయినా అక్కడే నిలబడ్డాను. ఆమెతో కొంత దీర్ఘంగా చర్చించాల్సిన పనిఉంది కనుక.

"నేనిచ్చింది వంద రూపాయలనోటు. నాకు తిరిగి రావల్సింది తొంభై రెండు కదండీ!" కొద్దిగా కోపంతో అంది.

"బాగా గుర్తుతెచ్చుకోండి." వరుసగా వచ్చే కస్టమర్స్ దగ్గర డబ్బు తీసుకొంటూ యాథాలాపంగా అన్నాడు కాషియర్. అటువంటి అనుభవాలు అప్పుడప్పుడూ జరుగుతూ ఉంటాయి. తర్వాత వాళ్ళు తమ దగ్గరున్న మిగిలిన డబ్బు లెక్క పెట్టుకోవడమో, లేక ఇచ్చినది గుర్తు తెచ్చుకొనో సర్దుకొని పోతుంటారు.

"గుర్తు తెచ్చుకోవడమేమిటయ్యా! నేనిచ్చింది వందరూపాయల నోటే. మీరేబాగా గుర్తు తెచ్చుకోండి." అంది స్థిరంగా.

ఈసారి స్టన్ అయ్యాడు కాషియర్. "అమ్మా దేవుని సాక్షిగా మీరిచ్చింది పది రూపాయలే. నా మాట నమ్మండి."

"అంటే నేను నమ్మకంలేని మనిషినా?" రోషంగా అందామె.

"నేను మిమ్మల్నిఅనడం లేదమ్మా. మీ బాగ్ ఒకసారి చూసుకోండి."

"ఏమిటి నీ ఉద్దేశం? నా బాగ్‌లో డబ్బులు కరెక్టుగానే ఉన్నాయి. నేను ఆడదాన్నని నలుగురిలో నన్నిలా అల్లరి పెడతావా?" ఆమె ఎగిరిపడింది. ముఖం రోషంతో ఎర్రబడింది. వ్యవహారం తీవ్రరూపం దాల్చడంతో అందరూ అక్కడ గుమికూడారు. కొద్దిసేపు తీవ్రంగా వాదించిన కాషియర్ చల్లబడిపోయాడు.

కాషియర్ ముఖం దీనంగా ఉంటే, ఆమె ముఖం కోపంగా ఉంది. అతను లో బి.పి.లో ఉంటే, ఆమె హై బి.పి.లో ఉన్నట్లుంది. అందరూ కాషియర్‌ను మందలిస్తున్నారు. ఆమెపై జాలి చూపిస్తున్నారు.

నేను కళ్ళారా చూశాను. ఆమె ఇచ్చింది ఖచ్చితంగా పదిరూపాయలనోటే. కాని కాషియర్‌పై పు మాట్లాడటానికి నాకు ధైర్యం చాల్లేదు. ఎందుకంటే అక్కడున్న వాళ్ళంతా ఆమెనే సమర్థిస్తున్నారు. అంతసేపు మాట్లాడిన కొట్టు వర్కర్లుకూడా ఆమె వాదన చూసి "ఆమె ఇచ్చింది నిజమేనేమో, మన కాషియర్ సరిగా చూసుకోలేదేమో" అనే నిర్ణయానికి వచ్చి నిశ్శబ్దమైపోయారు. కాషియర్ తప్పనిసరై తొంభై రూపాయలు చెల్లించాడామెకు.

నేను ఒక నిజాన్ని దాచినందుకు సిగ్గుపడ్డాను నాకేదో ఓ మూలనుంచి ఆమెమీద నుంచి అభిప్రాయముంది. కొట్టు దాటింతర్వాత నెమ్మదిగా ఆమెతో మాట్లాడి, ఉన్న విషయం చెప్పి, ఆ డబ్బు మళ్లీ కాషియర్‌కు ఇప్పించగలననే ధైర్యముంది. పొరపాటు అనేది ప్రతిఒక్కరికీ సహజం. సంస్కారం గల స్త్రీ కనుక వెంటనే తప్పు ఒప్పుకొంటుంది.

"సార్! మీలో ఎవరో చూసుంటారు. సార్! నిజం చెప్పండి సార్.... మా ఓనర్ జీతంలో ఆ డబ్బు కోసేస్తాడు, సార్.........పిల్లలు కలవాణ్ణిసార్...." అతను అందరిపై పుచూస్తూ ప్రాధేయపడుతున్నాడు. ఆ చూపు నామీద పడకముందే మెట్లుదిగాను.

ఆమె ముందు నడుస్తూఉంది. ఆమెను చేరుకోవాలి. యదార్థాన్ని చెప్పి ఆమె పశ్చాత్తాపపడేటట్లు చేయాలి. ఇంకో పదడుగుల్లో ఆమెను చేరుకుని ఉండేవాణ్ణి.

"ఏరోయ్. విశ్వం. ఇప్పుడే మన ఊర్నించి వస్తున్నాను" అంటూ రాజారావు అడ్డుపడ్డాడు.

రాజారావు మా ఊరివాడు. నేనే వాడు ఊరికి పోతానంటే ఇంటి దగ్గర విషయాలు కనుక్కొని రమ్మన్నాను. నేను ఈ మధ్య వచ్చేప్పుడు మా అమ్మ ఆరోగ్యం సరిగాలేదు. వెళ్ళివద్దామనుకుంటే సెలవు దొరకలేదు.

బస్సు స్టాపువైపు వెళుతున్న ఆమెను కనుకొనల్లోంచి గమనిస్తూనే రాజారావు చెప్పేది వింటున్నాను. మా అమ్మ ఆరోగ్యం బాగానే ఉందని, రెండు రోజుల్లో మా నాన్న రాబోతున్నాడని చెప్పి సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు రాజారావు. నేను వడివడిగా బస్సు స్టాపువైపు నడిచాను.

బస్సు దూరంనుంచి వస్తూఉంది. బస్సురాగానే ఆమె హడావిడిగా ఎక్కింది. నేనూ అందుకోగలిగాను. ఇంతకుముందు వచ్చినప్పటికంటే ఇప్పుడు బస్సు రద్దీ ఎక్కువగా ఉంది. ఆమె నా తర్వాత నలుగు రయిదుగురి ముందు ఉంది. ఒక చేత్తో బట్టల పాకెట్ గుండె కదుముకుని, రెండవ చేత్తో హేంగరు పట్టుకొని నిలబడి ఉంది. పెదాలపై ఆ చెరగని చిరునవ్వు గుండెని స్పర్శిస్తూఉంటే, ఇంతవరకూ ఆమెతో మాట్లాడలేకపోయినందుకు బాధగాఉంది. ఆమె ఇంతకుముందు ఎక్కినచోటే దిగితే బాగుణ్ణు. ఆమె పేరు, ఊరు అడిగి నా ప్రేమ విషయం చెప్పెయ్యొచ్చు అనుకున్నాను. ఆమెను భార్యగా పొందడంకంటె ఆనందం వేరొకటుండని నేనను కోవడంలేదు.

కండక్టరు టికెట్లు కొడుతూ వస్తున్నాడు. ఆ అమ్మాయి చుట్టూ ఉన్నవాళ్ళు ఆమె అందాన్ని త్రాగేసేట్టు చూస్తున్నారు. ఆమెను ఎక్కడికి పోవాలని అడిగాడు కండక్టరు. ఆమె తను దిగవలసిన స్టేజి చెప్పింది. అది ఇంతకు ముందు తను ఎక్కిన స్టేజి. టికెట్ అందుకొని, బస్సు స్పీడ్‌కు తట్టుకొంటూ సునాయాసంగా బాగ్ తెరచి రెండు రూపాయలనోటు అందించింది. ఆమె అందాన్ని ఆరాధిస్తూ ఆమె చర్య లను అప్యాయంగా పరిశీలిస్తున్నాను. ఎప్పుడెప్పుడు స్టేజి వస్తుందా, ఆమెతో మాట్లాడుదామా అని ఉవ్విళ్ళూరుతున్నాను

"ఏమిటండీ, రూపాయ అరవై పైసలిచ్చారు. నేనిచ్చింది ఇరవై రూపాయల నోటుకదా?" అమాయకంగా, ఆర్ద్రంగా అడిగిందామె.

నా కాళ్ళక్రింద ప్రదేశం జరజరా ఎక్కడికో కదలిపోతున్నట్టు, నేను ఉన్న చోటనే కూలిపోయినట్టు అనుభూతి కలిగింది. రెండు రూపాయల నోటిస్తూంటే నా ఈ కళ్ళతో చూశాను. అయితే ఆమె క్లెయిమ్ చేసేది ఇరవై రుపాయల నోటని. ఇది పచ్చిమోసం! దగా! ఇంతకుముందు జరిగింది పొరపాటని భావించిన నేను ఈ సంఘటనతో ఆమె కావాలనే మోసం చేస్తుందని అర్థంచేసుకున్నాను.

కండక్టరు ఆమె ప్రశ్నలకు జవాబివ్వలేదు. నిర్లక్ష్యంగా తల ఎగురవేసి మిగతా వాళ్ళకు టిక్కెట్లు కొడుతున్నాడు.

"చూడండి. ఆడవాళ్ళం గదాని జవాబు చెప్పకుండా వెడుతున్నాడు. నాకు రావలసిన డబ్బు లిప్పించండి" ప్రక్కనున్న యాభై సంవత్సరాలాయనకు ఫిర్యాదు చేసింది.

"ఏమయ్యోయ్, ఏంది సంగతి? ఆమెకివ్వాల్సిన డబ్బులిచ్చి వెళ్ళు" అరిచాడాయన!.

"ఆమె ఇచ్చింది రెండు రూపాయలే!'' విసుగ్గా అని, తిరిగి తన పనిలో మునిగిపోయాడు కండక్టర్.

''కాదండీ, ప్లీజ్! మీరు న్యాయం చెప్పండి. నేనిచ్చింది ఇరవై రూపాయల నోటేనండి." ఆమె చుట్టుపక్కల వాళ్ళని ప్రాధేయపడుతూ అడిగింది. నిలబడి ఉన్నవాళ్ళంతా మగవాళ్ళ.

అందరూ కండక్టరును తిట్టసాగారు.

"ఇచ్చెయ్యవయ్యా ఆమె డబ్బులు" అని కొందరంటే.

"ప్రతి బస్సుల్లో ఇంతేనండి! కాగితం ఇచ్చేప్పుడు ఎటో చూస్తుంటారు. చిల్లర సరిగా ఇవ్వరు" అని మరి కొందరంటున్నారు.

ఇంకొందరు "అసలు దొంగలు కండక్టర్లే నండీ" అంటున్నారు.

లేడీస్ సీటలో కూర్చుని ఉన్న ఆడవాళ్ళయితే మరీను "పాపం, ఏం చేస్తుంది పిచ్చిపిల్ల" అని "చాలా అమాయకురా"లని అనుకొంటున్నారు

ఇంతలో ఓ స్టూడెంట్ ముందుకువచ్చి అన్నాడు. "ఈమె ఇచ్చింది ఇరవై రూపాయల నోటు. నేను కళ్ళారాచూశాను." అప్పటి వరకూ అతను ఏ సాహసం చేసి ఆమెముందు హీరోలా నిలబడాలా అని ఆలోచిస్తున్నాడు.

"ఏమిటి నువ్వు చూసింది? ఆమె రెండు రూపాయల నోటిస్తే ఇరవై అంటావు బస్సులో ఇంతమంది ఉన్నా ఎవరు ఎంతిచ్చింది మాకు గుర్తుంటుంది" మండిపడ్డాడు కండక్టర్. అతనికి ఇటువంటి వాళ్ళంటే లెక్కలేదు. కాని బస్సులోని వాళ్ళంతా ఆ స్టూడెంట్‌నే సపోర్టు చేశారు. కండక్టరు మెత్తబడక తప్పలేదు.

నేను ఇదే సమయమని ముందుకొచ్చాను "అయ్యా! అందరూ వినండి. ఈమె ఇచ్చింది అక్షరాల రెండు రూపాయలు. నేను బాగా చూశాను" అన్నాను. ఇంతకు ముందొక నిజాన్ని దాచినందుకు సిగ్గుపడుతూ.

అందరూ నావైపు ఆశ్చర్యంగా చూశారు. మళ్లీమళ్లీ అదే చెప్పాను. కండక్టర్ నావైపు ప్రశంసాపూర్వకంగా చూశాడు.

ఆమె ఏమాత్రమూ అధైర్యం చెందలేదు. "ఇతనెవరోనండి, రోడ్డురోమియో లాగున్నాడు. మధ్యాహ్నంనుంచి నన్ను వెంబడిస్తున్నాడు. నేను ఎక్కడికి పోతే అక్కడ ప్రత్యక్షం. అతన్ని తప్పించుకోవడం చచ్చినంత పనిగాఉంది" అంది నావైపు కోపంగా చూస్తూ.

అంతే. అందరూ ఒక్కసారిగా అరిచారు.

"కొట్టండి గాడిదను."

''నరకండి రాస్కెల్‌ను''

"ఆడపిల్లను అవమానిస్తావురా?"

ఫట్ ఫట్ మంటూ అందరూ తలా ఒకదెబ్బ కొట్టారు. కాని ఆ దెబ్బలు నాకు తగలకుండా కండక్టర్ అడ్డుపడి తను తిన్నాడు. ఇక నేను ఉండబట్టలేక క్లాత్‌స్టోరులో జరిగిన విషయం చెప్పి, ఆమెను పోలీసులకు పట్టిస్తాం అన్నాను.

''అబద్ధం, సార్! అతని మాటలు నమ్మకండి. మేము ఎంతో విలువగా బ్రతికిన వాళ్ళం. పరువుపోయిన తరువాత ఇక బ్రతకడం దేనికి" అంటూ కన్నీళ్ళు కార్చింది.

"ఏడవకమ్మా! అడ్డగాడిదలు ఏవైనా కూస్తారు''

"రాస్కెల్స్! ప్రొద్దునలేస్తే ఆడపిల్లల వెంటబడడమే వీళ్ళపని''

''ఇటువంటి వాళ్ళని ముందు పోలీసులకు పట్టించాలి."

"తను అబద్ధం చెబుతూనే, ఇంకొకరి మీద తప్పుడు ప్రచారం చేస్తున్నాడు"

అందరూ తలా ఒక విధంగా ఆమెను ఊరడిస్తున్నారు.

నాకు చాలా అసహ్యమేసింది. ఈ మనుషులమీద, వీళ్ళ సంకుచిత మనస్తత్వాలమీద, ఆడవాళ్ళంటే కరిగిపోవడం వీళ్ళ బలహీనత. తమ ప్రత్యేకతను చాటుకోవాలనుకోవడం వీళ్ళ నాగరికత. న్యాయాన్యాయాల గురించి వీళ్ళాలోచించరు

కండక్టర్ ప్రయాణీకుల ఒత్తిడిని తట్టుకోలేక గొణుక్కుంటూ మిగతా చిల్లర ఆమె చేతిలో ఉంచాడు.

కండక్టర్ నా దగ్గర టిక్కెట్టు డబ్బులు తీసుకుంటూ నావైపు జాలిగా చూశాడు. అతనికి జరిగిన ఆర్థిక నష్టంకంటే, నాకు జరిగిన అవమానం ఎక్కువగా భావించి నట్లున్నా డతను.

నా స్టేజి రాగానే బస్సు దిగాను. ఆమెకూడా దిగి, నావైపు అసహ్యంగా చూసింది. రిక్షా రూపాయకు బేరమాడుతూ ఉంది. వాడు రూపాయిన్నర అడుగు తున్నాడు. చివరకు రూపాయకు బేరంతెగి ఆమె రిక్షా ఎక్కింది. రిక్షా ఓ సందున బడి పోసాగింది సన్నగా ఎండిపోయిన ఆపిశె చెట్టులా ఉన్న శ్రామికుడు రిక్షా వాలాను చూస్తే జాలేసింది. ఎందుకంటే వాడికి రూపాయ బాడుగ ఇచ్చి, నే నిచ్చింది అయిదు రూపాయలని, నాలుగు రూపాయలు చిల్లర తీసుకొంటుందని· అందుకే రిక్షీవాడి దగ్గర అయిదు నోటు ఉండకూడదని దేవుని ప్రార్థించాను.

నా కిప్పు డామె అంటే అసహ్యం.

ఇంతమాత్రంచేత స్త్రీ జాతిమీద గౌరవం తగ్గలేదు.

కారణం, ఇది అన్నంకాదు గదా ఒక మెతుకుపట్టి, అన్నమంతా ఏ స్థితిలో ఉందో తెలుసుకోవడానికి.

ఇది సమాజం. విభిన్న మనస్తత్వాలు, రకరకాల వేష భాషలు, పలు మతాలు, వివిధ రకాల నాగరికతలతో కలగాపులగంగా తయారైన విచిత్ర వ్యక్తుల సమూహం.

"మేం ఆడవాళ్ళం. మాకు సమాన హక్కులు కావాలి" అన్నంత మాత్రాన సరిపోదు ఆడవాళ్ళకు గాని, మగవాళ్ళకు గాని నాగరికత, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు, భావప్రకటన ఉండాల్సిందే. అయితే ఎంతవరకు? సమాజం వెర్రితలలు వేయనంతవరకు. స్త్రీ వినయ విధేయతలు వీడనంతవరకు.

ఆమె నాకు మరలా తారసపడితే, "అమ్మా, నీ కివి న్యాయమా! తల్లిగా గౌరవాన్ని, భార్యగా ప్రేమను, కూతురుగా అనురాగాన్ని పొందే స్త్రీమూర్తిగా పుట్టి నీ విలాంటి పనిచేయడం తగునా? మొత్తం స్త్రీజాతికే ఇది అవమానం" అని అడగదలచుకొన్నాను.

నా మనసులో ఇప్పు డొకటే మానసిక రొద.

నా అసమర్థత కారణంగా తొంభై రూపాయలు పోగొట్టుకొన్న క్లాత్ స్టోరు కాషియర్‌కి ఆ డబ్బిచ్చి ఆదుకోవాలి. అప్పటివరకూ తృప్తిలేదు.

దగ్గరలో వున్న నా రూమ్‌వైపు అడుగులు పడ్డాయి.

# ప్రేమ బలికోరుతుందా?

నేను ఆఫీసులో అడుగుపెట్టేసరికి టైము పదయింది. ఆఫీసు మొదలయ్యేది పదిన్నరకు గనుక నెమ్మదిగా రీడింగు రూముపైపు నడిచాను. అప్పటికే చాలా మంది చేరిఉన్నారు. కొంతమంది చెస్ ఆడుతున్నారు ఒకవైపు. ఇంకోమూల కేరమ్సు ఆడుతున్నారు మరికొందరు. మిగతా వాళ్ళు పత్రికలు చదువుతూ కూర్చొని ఉన్నారు. నా దృష్టి వీళ్ళందర్నీ చుట్టి నారాయణ చదువుతున్న నవల "డెవిల్స్ ఆన్ ది ఎర్త్" మీద పడింది. వాడు కుర్చీలో జారిగిలపడి కూర్చొని, నవల పైకెత్తి చదువుతున్నాడు.

"రేయ్ ఎప్పట్నుంచి ఈ అలవాటు" అన్నాను వాడి కెదురుగా కూర్చుంటూ.

"ఏ అలవాటు?" పుస్తకంలోంచి దృష్టి మరల్చకుండానే అడిగాడు.

"అదేరా ఆఫీసు లైబ్రరీలోంచి పుస్తకాలు తెచ్చుకొని చదవడం."

"నా కేమంత దుర్గతి పట్టిలా. ఇది నేను డబ్బులిచ్చికొన్నాను"

"నువ్వా! డబ్బులుపెట్టి కొనడమా! ఒరేయ్ ఇంతకాలంనుంచి కలసి మెలసి పనిచేస్తున్నాం. ఏనాడయినా స్టాపు ముఖాన ఇన్ని టీనీళ్ళు పోయించావా? అంతెందుకు? మెంబర్‌షిప్ చందా కట్టాల్సివస్తుందని లైబ్రరీ పుస్తకాలను అడక్కపోతివి. ఇది చాలదూ, నీ పిసినారితనానికి నిదర్శనం."

"ఒరేయ్! బాబూ, ఆపరా నీ సొద." కణతలు రుద్దుకుంటూ పుస్తకం మూసి టేబుల్‌మీద పడేశాడు.

"నిజం చెప్పరా, దయ్యా లున్నాయంటావా?" సందేహం వ్యక్తపరిచాడు.

నాకు నవ్వాగలేదు. పకాపకా నవ్వాను. నా నవ్వు విని విశేషమేమా అని కొంతమంది చేరితే, నారాయణ దయ్యాల టాపిక్ ఎత్తేసరికి ఉత్సాహంగా మరి కొందరు ముందుకు వచ్చారు.

ఇప్పటివరకు వాడు చదివింది దయ్యాల పుస్తకం గనుక, వాడిలో ఆ టెన్షన్ ఇంకా పోలేదు. "రేయ్, నేను అషామాషీగా అడగడం లేదు. సీరియస్‌గా అడుగుతున్నాను. నీ ఉద్దేశం చెప్పు" అన్నాడు.

వాడికి నా మాటమీద చాలా నమ్మకముంది. నేను ఏది మాట్లాడినా రీజనింగ్ ఉంటుందని అంటూంటాడు. అందుకే మొదట నా ఉద్దేశం అడిగాడు. మిగతా సీట్లలో కూర్చున్నవారంతా మాట్లాడడంఆపేసి నేనేం చెబుతానోనని ఆత్రతగా ఎదురు చూస్తున్నారు. వాళ్ళ ఆత్రతకు నాకు నవ్వొచ్చింది. ఎందుకో ఈ మానవులు లేనిదాన్ని ఉన్నట్లుగా వూహించుకొని అనుభూతి చెంది ఆనందిస్తుంటారు అను కొన్నాను. వాతావరణం సీరియస్ కావడంతో నేనూ సీరియస్ అయ్యాను.

"నో!....నో!!.... దయ్యాలు లేవు, భూతాలు లేవు. ఇవన్నీ కట్టుకథలు. రాళ్ళను ఆయుధాలుగా చేసుకొని జంతువుల్ని చంపి పచ్చిమాంసం చీల్చుకొని తినే రాతియుగం నుంచి సృష్టిలో అతి చిన్నదైన అణువుతో ప్రపంచాన్నే భస్మీపటలం చేయగల అణుయుగంలోకి చేరుకున్నాడు నేటి మానవుడు. ఇంకా ఆ కాకమ్మ కథలు వినడానికి సిద్ధంగా లేడు. తీరికా లేదు" అన్నాను కొట్టిపారేస్తూ.

నారాయణ నా రీజనింగును ఒప్పుకోలేదు. "ఆఫ్టారిల్ నువ్వు చెబితే సరి పోద్దా? ఇంతింత పెద్ద నవల్లు వ్రాసిన అమెరికన్స్‌కి అది తెలియదంటావా? వాళ్ళు సైన్సులో మనకంటే ఎంతో ముందున్నారు తెలుసా."

ఎప్పుడూ నా వాదనను సమర్థించే స్టాపు ఈ విషయంలో నాకు వ్యతిరేక మయ్యారు. ఒకరికొకరు దయ్యాలతో తమ చిన్ననాటి అనుభవాలను చెప్పుకొంటు న్నారు. తమ తాతల హయాంలో దయ్యాలు విచ్చలవిడిగా ఇండ్లలో తిరిగేవని, వాటిని తమ తాతలు మంత్రశక్తితో బంధించి అన్నిపనులు చేయించుకొనేవాళ్ళని చెప్పుకుంటున్నారు.

"మీలో ఎవరయినా దయ్యాన్ని చూశారా" అన్నాను కోపంగా.

"మన ఆఫీసులో దయ్యాలున్నాయి తెలుసా" అన్నాడు పంతులు జవాబుగా.

"నో నెవర్....ఇంకోసారా మాట అన్నావంటే పళ్ళూడ పీకేస్తాను."

"నీకేం తెలుసోయ్ అట్లా ఎగిరిపడతావ్? అతనెందుకు నేను చూశాను దయ్యాన్ని. మన ఆఫీసులో నా రెండేళ్ళక్రితం అనుభవం చెబుతాను విను" మొదలు పెట్టాడు ఏభై సంవత్సరాల "ఆర్" సెక్షన్ హెడ్.

అందరూ బెల్లం కొట్టిన రాయిల్లా అయిపోయి చెవులు రిక్కించి వినసాగారు.

"వర్కు పెండింగు ఉండడంతో ఆ రోజు ఉదయం ఎనిమిది గంటలకే నేను ఆఫీసులో అడుగుపెట్టాను. వాచ్‌మన్ తప్ప ఎవ్వరూ లేరు. నేను మేడ

మెట్లెక్కి నా సెక్షన్ చేరుకొని తాళం తీశాను. తలుపులు బార్లాతీసి నా సీట్లోకి వెళ్ళి ఫైళ్ళన్నీ బల్లమీద పెట్టాను. ఎవరో ఉన్నట్లు అలికిడి వినిపిస్తే చూశాను. దూరంగా టైపుమిషన్ దగ్గర అటు తిరిగి కూర్చొని ఉంది మా సెక్షన్ టైపిస్టు రజని. ఆమె నెత్తిన కొంగు కప్పుకొని ఉంది. అటుతిరిగి ఉండడంవల్ల ఆమె వీపు మాత్రమే నాకు కనిపిస్తూ ఉంది.

'ఈమె ఎప్పుడొచ్చిందబ్బా అనుకొన్నాను నా వెనకనే వచ్చిందేమోలే' అనుకొని నా పనిలో మునిగిపోయాను. ఒక గంట గడిచింది. ఆ ఫైలు వ్రాయడం పూర్తిచేసి, రెండో ఫైలు తీసుకొంటూ అటు చూశాను. గంటనుండి కూర్చొని ఉన్న ఆమె ఒక్క అక్షరం టైపుచేసిన శబ్దం లేదు. శిలలా అటుతిరిగి బిర్ర బిగిసి కూర్చొని ఉంది. అదీగాక ఎప్పుడూ అలవాటులేని నెత్తిన ఆ కొంగు....

నాకెందుకో అనుమానమొచ్చి "ఏం రజనీ, పెళ్ళి కాలేదని నిరాహారదీక్ష చేస్తున్నావా? లేక ఇంట్లో ఏదన్నా గొడవపడి ఇలావచ్చి కూర్చొని ఆలోచిస్తున్నావా" అన్నాను వేళాకోళంగా. అంతే. ఇటు తిరిగింది. నా గుండె పగిలింది. అక్క-డుండేది టైపిస్టు రజని కాదు. ముఖమంతా తెల్లగా అలికినట్లుగా ఉంది. ముక్కు, కళ్ళు, నోరు ప్రత్యేకంగా లేవు. చూస్తుండగానే ఆ ఆకారం గాలిలోకి లేచింది. కాళ్ళు, చేతులు వెనక్కు తిరిగిఉన్నాయి. రెండు నిముషాల్లో క్రిందికి పరుగెత్తి ఆయాసం తీర్చుకున్నాను" అప్పుడే అవి జరిగినట్లు గుండెను చేత్తో రాసుకుంటూ, తన అనుభవం చెప్పడం పూర్తిచేశాడు 'ఆర్' సెక్షన్ హెడ్.

సదరు అనుభవంలోని టైపిస్టు రజని భయంతో వణికిపోతూ, ప్రక్క నున్న ముంతాజ్ చేతిని గట్టిగా పట్టుకొంది. మిగతా వాళ్ళంతా భయంభయంగా చూస్తు న్నారు. పట్టపగలు ఉదయం పదిగంటల వేళ భయపడడంలో అర్థమే లేదు.

"సార్ మీరు పండుగపూట దేవాలయాల్లో హరికథలు చెప్తారటగా" అన్నాను నేను సెక్షన్ హెడ్ నుద్దేశించి.

"అవున్నాయనా! ఏదో దైవభక్తి గలవాడిని. నా జీవితాన్ని చరితార్థం చేసుకొందామని...."

"హుం! జీవితం చరితార్థం అయ్యేది మనిషిజీవితంలో తోటి మనిషికి చేసే మంచిచెడులను బట్టిండీ. ఇంతకూ నేను చెప్పేదేమంటే మీరు చెప్పిన ఆ దయ్యం కథను ఒక పిట్టకథగా వాడుకోండి. అంతేగాని లేనిపోనివి ఇక్కడ చెప్పి అందర్నీ హడలుగొట్టకండి."

"నాలుగేళ్ళ క్రిందట గుమాస్తాగా చేరావో లేదో నన్నే అనేవాడివయ్యావా నీ వయసుకంటే ఎక్కువ సర్వీసున్న నన్నే అవమానిస్తావ్" అంటూ చిందులు వేస్తూ వెళ్ళిపోయాడు హెడ్.

"ఒరేయ్, నువ్వు అదీ వినకపోతే నా ప్రార్థనను మన్నించి నా అనుభవం విను" 'సి' సెక్షను గుమాస్తా పంతులు ప్రాధేయపడుతూ ముందుకు వచ్చాడు.

"సరే చెప్పు" అన్నాను.

"నేనూ, మా సెక్షన్ హెడ్డూ ఆరోజు అందరిలాగే సాయంత్రం ఆరుగంటల కల్లా క్రిందికి వచ్చాం. వాచ్‌మన్ గేటు తలుపులు వేసుకొన్నాడు. మేము కాంటీన్‌లో కాఫీ త్రాగి మాట్లాడుకొంటూవుండగా, 'పంతులు ఫైలు బైపుకిచ్చి మర్చి పోయానోయ్. అది చాలా కాన్ఫిడెన్షియల్ ఫైలు. రేపుఉదయం ఎవరయినా చూస్తే సీక్రెట్ బయటపడుతుంది' అన్నాడు. సరే ఫైలు తెద్దాం అని ఇద్దరం బయలు దేరాం. మా సెక్షన్ హెడ్ తనసీట్లో కూర్చొని, 'పంతులూ ఫైలుతీసుకొని రా వెళ్దాం' అన్నాడు. నేను ఫేర్‌కాపీ సెక్షన్‌వైపు నడిచాను. దానికి తాళం వేసి ఉంది. అయినా నా దగ్గరున్న తాళంతో ప్రయత్నించాను. ఉహుం. రాలేదు.

నిరాశగా వెనుకకు తిరిగాను. ఇంతలో ఏదో చప్పుడయితే, అగి కిటికీలోంచి చూశాను. ఇంకేముంది? అన్ని బైపుమిషన్ల ముందు ఒక్కో దయ్యం కూర్చొని ఉంది. నైట్‌గౌన్‌లాగ పైన్నుంచి గిరకలదాకా గాలికి కదలాడే వైట్ పెటికోట్ ముసుగుల్లో ఉన్నాయి. ఇంకో దయ్యమైతే గాలిలో తిరుగుతూ చేతిలోని బొమికను ఆడిస్తూ కమాండ్ చేస్తున్నట్లుగా ఉంది. వాటి పాదాలు, చేతివ్రేళ్ళు ప్రత్యేకంగా కనిపించడం లేదు. పరుగెత్తుకు వచ్చి మా సెక్షను హెడ్‌కు చెప్పాను. దాంతో ఆయన వెర్రెత్తిపోయి 'పంతులూ! అవి దయ్యాలు నాయనా. వాటికి ఆహారం సంపా దించుకొనే వేళ అయ్యింది. మనమిక్కడ ఒక్క క్షణమున్నా నంచుకొని తింటాయి. అంటూ హడావుడిగా బయటికి వచ్చాడు. ఇద్దరం ఒకర్ని ఒకరం తోసుకుంటూ కిందికి పరిగెత్తాము."

"స్టాపిట్... డోన్ట్ టాక్ నాన్సెన్స్" అరిచాను పంతులు చెప్పేది వినలేక.

"అవును, బాబూ! ఇది నిజం. నేను ఆ సెక్షన్ హెడ్‌ను" 'సి' సెక్షను హెడ్ ఏదో చెప్పబోయినవాడల్లా, నేను ఉరిమిచూడ్డంతో ఆగిపోయాడు. నాకు ఒకరిని శాసించే అధికారం లేకపోయినా, ఒక విద్యావంతుడిగా, నవీన భావాలున్న యువకుడిగా, మూఢ విశ్వాసాలను ఖండించే నాగరికుడిగా నాకా హక్కు ఉంది

మూఢవిశ్వాసాలే దేశ పురోభివృద్ధికి, సంఘ పురోభివృద్ధికి ప్రతిబంధకాలని దేశ శ్రేయస్సుకోరే ప్రతి విద్యావంతుడికీ తెలుసు.

"ఎస్! మీ రందరూ చెప్పినట్లు మన ఆఫీసులో, దయ్యా లున్నాయని నేను నమ్ముతున్నాను. అయితే నేను పరీక్ష చేయాలి. ఈ రోజు రాత్రికే నా పరిశోధన. ఆసక్తి ఉన్నవాళ్ళు నాతోవచ్చి తెలుసుకోవచ్చు" అన్నాను లేచి నిలబడి.

"నేను రెడీ" అన్నాడు రాజేష్.

"నేనూ మీతో వస్తాను" ముందుకు వచ్చాడు వాసు.

"మాకు చాలా ఇంటరెస్టుగా ఉంది. మేమూ వస్తాం" అంటూ డేవిడ్, పంతులూ ముందుకు వచ్చారు.

లేడీస్‌లో చిన్న కలకలం బయలుదేరింది.

"సార్, మీరు అనవసరంగా పులినోట్లో తల పెడుతున్నారేమో" అంది భయంగా టైపిస్టు రజని.

"ఎందుకొచ్చిన పీడ సార్, ఇది. మనపనేదో మనం చేసుకొని పోక" ముంతాజ్ అంది.

"ఏమండోయ్, వాటిని ఒక్కసారి కదలించారంటే, అవి అందరికీ ప్రమాదాన్ని తెచ్చిపెడతాయి." అందుకొంది శోభారాణి.

"సార్, నా రిక్వెస్టు దయచేసి వినండి. ప్రశాంతంగా ఉన్న మీ జీవితంలోకి కోరి కష్టాల్ని ఆహ్వానించకండి మన ఆఫీసులో ఎవరికి ఇబ్బంది కలిగినా అందరమూ బాధపడతాం" అంది రాగిణి నాకేదో ప్రమాదం జరిగినట్లే భయపడుతూ.

నేను ఖచ్చితంగా చెప్పాను నా పరిశోధన తప్పదని, వాటిఅంతు ఈ రోజే తేలుస్తానని. నా దృష్టి దూరంగా కూర్చుని ప్రశాంతంగా మా మాటలు వింటున్న అశోక్‌మీద పడింది. ఇంత కలకలం రేగినా వాడిలో అణుమాత్రం చలనం లేదు. వాడి ధైర్యానికి మెచ్చుకొన్నాను.

"ఏరా, మాకు సహాయం రావా" అన్నాను.

"ఛ....ఛీ....మా నాయనమ్మ దయ్యాల కథలే వినవద్దంది. విన్నా ప్రమాదమేనట. అందుకే ఇప్పటివరకూ చెవుల్లో వ్రేళ్ళు దూర్చుకొని ఇప్పుడే తీశాను" అన్నాడు.

"ఒరేయ్, అశోక్ నీకు దేవుడు హెర్క్యులిస్‌కున్న కండలిచ్చాడు గాని, చీమతలంత గుండెధైర్యాన్నివ్వడం మరచిపోయాడురా" అన్నాను, వాణ్ణి పెద్ద ధైర్యస్థుడని అంచనా వేసినందుకు నన్ను నేను తిట్టుకొంటూ.

టైమ్ కావడంతో ఎవరి సీట్లలోకి వాళ్ళు వెళ్ళిపోయాం. ఆరోజు సాయంత్రం వరకూ దయ్యాల పరిశోధన మానుకోమని ఎవరో ఒకరు చెబుతూనే ఉన్నారు.

## 2

ఆ రోజు రాత్రి తొమ్మిది గంటలకు అనుకొన్న ప్రకారం అందరూ ట్రంకు రోడ్డులోని సీమా హోటల్‌ముందు చేరాము. రాజేష్ తనతోపాటు రెండు మీటర్ల పొడవున్న కర్రలు వో నాలుగు కట్టితెచ్చాడు. వాసు తనసంచీలో దాదాపు పదిహేను మీటర్ల పొడవున్న లావుపాటి తాడు పట్టుకొచ్చాడు. అది అతని సంచిలో చుట్ట చుట్టుకొని ఉన్న పాములా పడిఉంది. డేవిడ్ నైఫ్ తెచ్చాడు. పంతులుమాత్రం చేతులూపుకుంటూ వచ్చాడు. నేను టార్చి మాత్రమే తెచ్చాను.

అర్ధరాత్రిపైన అయితే పరిశోధన జయప్రదంగా జరుగుతుందని, ప్రశాంత మయిన ఆ సమయంలో ఎంతో అనుకూలిస్తుందని వాళ్ళకు చెప్పి. అందర్నీ లీలా మహల్లో 'ఎగ్జార్సిస్టు' సినిమా సెకండ్ షోకి తీసుకువెళ్ళాను.

సినిమా చూస్తున్నంతసేపూ అందరికీ గుండె దడగానే ఉంది. చివరి సన్ని వేశంలో నా ప్రక్కన కూర్చున్న పంతులు కుర్చీలో బిర్రబిగుసుకు పోయాడు. దయ్యాలతో హీరో ముఖాముఖిగా పోరాడుతున్న దృశ్యాలు శరీరాన్ని గగుర్పొడి పిస్తున్నాయి. సినిమా అయిన తర్వాత అందరం ఆఫీసువైపు దారితీశాము.

సైన్సు బాగా అభివృద్ధిచెందిన దేశాల్లోనే దయ్యాలమీద సినిమాలు తీస్తు న్నారు. నవలలు వ్రాస్తున్నారు. అటువంటప్పుడు ప్రజలు విజ్ఞానవంతులయ్యారని అనుకోవాలా లేక అజ్ఞానాంధకారంపైపు దారితీస్తున్నారని అనుకోవాలా అనేది నన్ను వేధించే సమస్య.

ఆఫ్రికా ఖండంలోని కొన్ని వెనుకబడిన జాతుల్లో ఇప్పటికీ దయ్యాలమీద చాలా నమ్మకముంది. మగదయ్యాల్ని డెవిల్స్ అని, ఘోస్ట్స్ అని అంటే, ఆడ దయ్యాల్ని విచెస్ అని అంటారు. టెంపర్‌మెంట్‌లోను, సెన్సిటివ్‌నెస్‌లోను ఆడ దయ్యాలు మగదయ్యాలకంటే ఎంతో యాక్టివ్‌గా ఉంటాయంటారు. విచెస్‌లో నాలుగు రకాలున్నాయి. హెడ్ విచ్‌ను డెమన్ అంటారు. మిగతావి హైయర్ విచ్,

లోయర్ విచ్, వర్కర్ విచ్ అని తమతమ స్టేటస్‌ని బట్టి విధుల్ని నిర్వర్తిస్తుంటాయి. ఇవి అర్ధరాత్రి డెమన్ నాయకత్వంలో శ్మశానంలో సమావేశ మవుతుంటాయి.

వీటికి సంబంధించిన మంత్రగాళ్ళు కూడా భూమ్మీద ఉన్నారు. శత్రువుల మీద పగతీర్చుకోడానికి విచ్ క్రాఫ్ట్స్ అనే మంత్రగాళ్ళను వాడుకొంటారు అక్కడి ప్రజలు. ఆ మంత్రగాళ్ళు చేతబడుల్లాంటి క్షుద్ర విద్యలతో అవతలివాడిని పిచ్చి పిచ్చిచేసి తరువాత చంపేస్తారు. ఇంకోరకం మంత్రగాళ్ళు ఉన్నారు. వాళ్ళను 'సోర్సరర్స్' అని పిలుస్తారు. వీరు చాలా మంచివారు. విచ్‌క్రాఫ్ట్స్‌కంటే ఎక్కువ శక్తివంతులు. వీళ్ళు చేతబడులని తిరగ్గొట్టి అనారోగ్యంగా ఉన్న వ్యక్తిని ఆరోగ్యవంతునిగా చేయడం, దుర్మార్గులయిన మంత్రగాళ్ళు చేసే ప్రతి పనికి అడ్డుపడి ప్రజల్ని ఆదుకొనడంచే మంచివాళ్ళనిపించుకొంటారు సోర్సరర్స్. ఈ ప్రాంతపు ప్రజలు ఆ విధంగా దయ్యాలకు తమ దైనందినజీవితాల్లో ప్రథమ స్థాన మిచ్చారు.

ఆలోచనల్లోనే ఆఫీసుకు చేరాము. ఆఫీసు తూర్పుముఖంగా ట్రంకురోడ్డును ఆనుకొని ఉంటుంది. ఆఫీసు ఎడమవైపు ఆర్. అండ్ బి. ఆఫీసు భవనాలు, కుడివైపున స్టేట్ బ్యాంక్ హెడ్‌ఆఫీసు ఉన్నాయి. వెనుకవైపున శ్మశాన ముంది. వెన్నెలరాత్రుల్లో అందులోని సమాధులు రాజదర్బారులో సమావేశమైన ముఖ్యోద్యోగులను జ్ఞప్తికి తెస్తుంటాయి

సమయం ఒంటిగంట కావటంతో ఒకటీ అరా లారీలు రోడ్డుమీద పోతున్నాయి. జనసంచారం లేదు. మెయిన్‌గేటు మీద చేయివేసి, "యానాదీ........ యానాదీ...." అంటూ వాచ్‌మన్‌ని పిలిచాను.

వరండాలో నిద్రపోతున్న యానాది లేచి లైటువేశాడు. మా దగ్గరకు నడిచి వచ్చి మెయిన్‌గేటు తలుపు తాళంతీసి, "యాండి సామిలు ఇట్టా వచ్చిన్రు" అంటూ ఆశ్చర్యంగా అడిగాడు.

"అర్జంటు పనుందిలే లోపలికి పద చెబుతాను" అన్నాను. అందరూ నా వెనకనే నడిచారు. అందరం వరండాలోకి వచ్చాము. యానాది యథాస్థానంలో కూర్చొని చుట్ట చుట్టుకుంటూ మా సమాధానంకోసం ఎదురుచూడసాగాడు.

"యానాదీ! ఆఫీసు తలుపులు తియ్యి. లోపలికి వెళ్ళాలి" అన్నాను.

"ఈ పొద్దప్పుడు యాంపని సామే. సెప్తన్రు."

నేనేదో చెప్పబోయాను. ఇంతలో "మేం మన ఆఫీసులో దయ్యాలున్నాయా లేవా అనే పరిశోధన చేయడానికి వచ్చాం" అని పంతులు గబుక్కున అనేశాడు.

"ఏంది దయ్యాలుండయా లేదా అని పరిచ్చ సేయడానికొచ్చిర్నా, సారులూ. ఇంతకీ ఇంటికాడ ఈ సంగతి తెలుసా అంట!" నవ్వుతూ అడిగాడు యానాది.

"అవన్నీ నీకెందుకు? ముందు తాళాలు తియ్యి" అన్నాడు దురుసుగా వాసు.

"అయితే నేనో సంగతి చెప్తా. ఇని ఆనక మీ నిర్నయం చెప్పండి" అంటూ చెప్పడం మొదలుపెట్టాడు యానాది.

"అది నేను వాచ్‌మాన్‌గా చేరిన మొదటిరోజు బాబులూ. ఈడనే మేడమెట్ల దగ్గర సాప పరుసుకొని దుప్పటి కప్పుకొన్నా. రేత్తిరి పన్నెండు గంటలు అయ్యే సరికి ఎవరెవరో మీద నడిసిపోయినట్టుగా ఉండాది. యాందిరా సిత్రం అని ఆలోచిత్తనే ఉన్నా. ఎవరో ఫెడీమని తన్నారు. అంతదూరంలో ఎల్లి పడ్డా. ఏందీ మాయ—ఏసిన తలుపులు ఏసినట్టే ఉండాయి. ఇదంతా ఏదయినా కలా, బెమా అనుకుందామంటే దెబ్బ తగిలిన నడుము పీకుతుందే...."

"తర్వాత ఏమయింది?" ఆత్రంగా అడిగాడు పంతులు.

"నేనన్నీ సెప్తా. అట్టా బయపడిపోమాకండి, సారూ. అమాయిన కొద్దీ సేపుంకి, ఏట్లేదులే అని నాలోనేను సర్దిసెప్పుకొని మళ్ళా పడుకొందునుగందా, మళ్ళా వందలమంది నామీద నడిసిపోయినట్లుండాది. ఏందిది? అని కళ్ళుతెరిసేలోగా ఎవడో లాగి తన్నినట్లు ఆడబోయి పడితిని. ఒక్క పన్నాడె. నేను ఎక్స్ మిలటరీ మనిషిని గందా. నానేం భయపడ్లా. ఏందీ తమాసా అని లైటువేసుకొని ఆఫీసంతా తిరిగి సూత్తిని, ఏటి లేదు నిద్రకు ఉండలేక పడుకోవడం, తన్నించుకోవడం ఈ ఇదంగా తెల్లవారులూ తంటాలు పడితిని. తెల్లారి ఇంతకుముందు ఇక్కడే వాచ్‌మన్‌గా పనిచేసి మానుకొన్న తిరపతిదగ్గర కెళ్ళి ఇసయం అడిగితిని. ఆడు అసలు సంగతి సెప్పిండు గందా...."

"అసలు సంగతేమిటి?"

"ఒరే, యానాదిగా, ఆడదయ్యా లుంటయిరా. అయి ఎల్లే మార్గాల్లో పడుకొంటే అట్నే తంతయి. అందుకనే గందా నేను ఉద్యోగం మానుకొండి' అన్నాడు. ఆనాటినుంచి నేను జాగర్తగా సూసి, పడుకోడానికి పెమాదంలేని ఈసోటు

ఎన్నుకొన్నా." వాచ్‌మన్ చెప్పడం ఆపి, "ఏటి, అట్టా సూత్తుండరు. ఇకను గూడా పరిసోదన సేత్తరా" అన్నాడు.

అందరూ నా ముఖాలు చూస్తుంటే నాకు ఒళ్ళు మండింది. "ఏరా, అలా బిత్తరపోయి చూస్తారు? భయమైతే మీ రింటికి వెళ్ళండి. నేనొక్కడ్నే వాటి అంతేదో తేల్చుకొని వస్తాను." సీబ్బరంగా అన్నాను.

"అబ్బబ్బే, అదేం కాదురా. యానాది ప్రశ్నకు నువ్వు కరెక్టు సమాధానం చెబుతావేమోనని చూస్తున్నాము" నొచ్చుకుంటూ అన్నాడు రాజేష్. మిగతా వాళ్ళంతా నాకు క్షమాపణలు చెప్పుకున్నారు.

"సామీ, బవిసెత్తు గల్లోళ్ళు. ఆటి జోలి కెళ్ళకండి. నా మాటిని ఈ పని మానుకోండి. మిమ్మల్ని పార్దిత్తా" అన్నాడు చేతులెత్తి.

"ఇదిగో, యానాదీ ఈ విషయంలో ఎవరు ఏంచెప్పినా వినేదిలేదు. నీ దగ్గరున్న ఆఫీసు తాళాలు నా కిచ్చెయ్. నీకు మాటరాకుండా చూసే బాధ్యత నాది" అన్నాను తాళాలకోసం చేయి ముందుకు చాచి.

యానాది ఏమనుకున్నాడో ఏమో ఖద్దరు బనీను జేబులోంచి తాళాంగుత్తి తీసి నా చేతిలో పెడుతూ, "సామే, మీరు ఇంతగట్టిగా అడిగినను కనుక ఇత్తుండా ఇక రేపట్నుంచి ఈ ఆఫీసులో నేను పనిసేయలేను. ఈ ఊళ్లోనే ఉన్న బ్రాంచి ఆఫీసుకి వాచిమన్‌గా ఏయమని అర్జీ ఇచ్చుకుంటా. లేకపోతే ఇప్పుడు మీరు రెచ్చగొట్టిన దయ్యాలు నన్ను భూమ్మీద ఉండనిత్తా యనుకున్నారా? నేను ఇప్పుడే ఎళ్ళిపోతున్నా" అన్నాడు. అలా అనటమేమిటి, వెంటనే గుడ్డలమూట, చాప సంకలో పెట్టుకొని మేము చూస్తుండగానే గేటు తీసుకొని రోడ్డుమీదికి వెళ్ళిపోయాడు.

నేను మెయిన్‌గేటు లాక్‌చేసి వచ్చి, ఆఫీసు తలుపులు తెరిచాను. ఆఫీసు రెండంతస్తుల భవనం. నలుచతురస్రాకారంలో ఉంటుంది. భవనం మధ్యలో చాలా ఖాళీస్థలం. ఆకాశం కనిపిస్తూ ఉంటుంది. సాయంత్రం పూట ఏదయినా ఉపన్యాసాలు ఏర్పాటుచేస్తే అక్కడ జరుగుతాయి. ఆఫీసు భవనం కింద అంతస్తులో అంతా రికార్డు, లేబొరేటరీ, మేడమీదికి మధ్యలో కిందినుంచి ఒకేదారి ఉంది. రెండవ అంతస్తు చేరుకోగానే అక్కడ కంట్రోలురూము ఉంది. అక్కడ రిసెప్షనిస్టు ఆఫీసుకొచ్చే ప్రతి కాల్ రిసీవు చేసుకొంటుంది.

కంట్రోలురూము ముందునుంచి బయలుదేరిన వరండా మేడమీద అని గదుల్ని లోపలివైపున చుట్టుతుంది. 'ఎ' నుంచి 'జడ్' వరకు సెక్షన్లున్నాయి 'జడ్' సెక్షను ఫేర్‌కాపీ సెక్షను. ఫేర్‌కాపీ సెక్షనులో ఆఫీసు మొత్తానికి సంబ ధించిన కాగితాలు టైపవుతాయి. మొత్తం పాతికమంది టైపిస్టులు పనిచేస్తా రక్కడ 'ఆర్' సెక్షన్‌లో వర్కు హెవీగా ఉంటుంది. కనక, వీళ్ళుకాక అక్కడో పర నెంటు టైపిస్టు పనిచేస్తుంది.

నేను ఒక్కోలైటు వేస్తూ మెల్లెక్కుతున్నాను. అందరం కంట్రోలురూవ చేరుకున్నాం. పరీక్ష చేస్తూ కంట్రోలురూము దాటి ముందుకు నడుస్తున్నాను అందరూ పరిస్థితి అబ్జర్వ్ చేస్తున్నారు. ఇంతలో కంట్రోలురూములోంచి గణగణ మంటూ ఫోను మోగసాగింది నేను రాజేష్‌వైపు చూశాను. రాజేష్ నా చూపు లోని భావం అర్థంచేసుకుని వెళ్ళి ఫోనందుకున్నాడు. నేను వెనక్కు తిరిగి చూస్తున్నవాణ్ణల్లా చటుక్కున పరుగెత్తి రిసీవరు అందుకున్నాను. లేకపోతే క్షణంలో అది వేలాడుతూ ఇనుప టేబులుకు కొట్టుకొని బద్దలయ్యేదే. రాజేష్ ముఖం చెమటతో నిండిపోయింది. మనిషి గడగడా వణికిపోతున్నాడు. ఏదో చెప్పాలని ప్రయత్నించి చెప్పలేకపోతున్నాడు. నేను వాడి భుజంతట్టి రిసీవరు చెవిదగ్గర పెట్టుకున్నాను.

ఏనాడూ భయం ఎరగని నాకు కాళ్ళలో వణుకు మొదలయింది. ఫోనులోంచి వినబడే శబ్దాలు కర్ణకఠోరంగా ఉన్నాయి. ఒక కన్నెపిల్లి తనను బలాత్కరిస్తూంటే తట్టుకోలేక అరిచిన చావుకేక, పసిపిల్లవాడి ఏడుపు, సింహ గర్జనలు, మేక అరు పులు. లేగదూడ పాలకోసం 'అంబా' అని అరిచే అరుపు. ఘీంకరిస్తూ పరుగెత్తే అడవి ఏనుగుల గుంపుల శబ్దాలు. పెనుతుఫానుకు ప్రచండంగా వీచే గాలి 'హోరు' మనే శబ్దం. అంత కలగా పులగంగా, అయోమయంగా ఉంది.

అందరూ నావైపు ఆత్రంగా చూస్తున్నారు. భయాన్ని కప్పిపుచ్చుకుంటూ ఎవరికో జవాబు చెప్పినట్లుగా అన్నాను. "ఏమిటి ఆఫీసరిగారి కోసమా, వారు లేరండి. రేపు ఉదయం పది గంటలకు ఫోను చేయండి" అంటూ టప్పున రిసీవరు పెట్టేశాను. ముఖంమీద పట్టిన చెమట కర్చీవ్‌తో ఒకటికి రెండుసార్లు తుడుచు కున్నాను.

"రాజేష్, జరిగిన విషయం మనవాళ్ళతో అనకు. చాలా ప్రమాదం" అన్నాను వాడి చెవిలో.

"ఆనంద్! మొత్తానికి దయ్యాలు అప్పుడే వాటి ప్రతాపం మొదలెట్టాయిరా" అన్నాడు రాజేష్ చిన్నగా నాకే వినిపించేట్టు.

## 3

"ఏమిటి, ఏం జరిగింది" అన్నారంతా.

"ఏమీ జరగలేదు పదండి" అన్నాను.

నేను వరండాలో రూములమీదుగా 'ఎక్స్' సెక్షను దాటి, 'పై' సెక్షను రూము తలుపులు తెరిచాను. కారణం, పక్కనే దయ్యాల కేంద్రస్థానమని పిలువబడే ఫేర్‌కాపీ సెక్షను ఉంది. ఒక సెక్షను తలుపు తెరిస్తే చాలు, మిగతా అన్ని సెక్షన్లలోకి లోపల్నుంచి వెళ్ళొచ్చు. అందరం లోపలికి ప్రవేశించాము. లైట్లన్నీ దేదీప్యమానంగా వెలుగుతున్నాయి.

అందరూ తమదగ్గరున్న వస్తువుల్ని ఒక టేబుల మీద చేర్చారు. ఎవరికి అవసరమైన ఇన్‌స్ట్రక్షన్స్ వాళ్ళకు ఇవ్వాలని అందర్నీ హాలుమధ్యకు రమ్మన్నాను. నా కెదురుగా నిలబడ్డారు. నేనేం చెబుతానోనని చెవులు రిక్కించి ఉన్నారు. సూది పడితే వినిపించేంత నిశ్శబ్దం.

"ఇప్పుడు మనం...." మొదలుపెట్టానో లేదో కరెంటు పోయింది గాఢాంధకారం. అమావాస్య రాత్రులు కావడంతో బయట చీకట్లో ఏం కనిపించడంలేదు. టక్కున నా చేతిలోని టార్చి వెలిగించాను. వెలగలేదు. ఆశ్చర్యంతో కొయ్యబారిపోయాను. పరీక్షిస్తే సెల్సుకూడా ఆర్డరులోనే ఉన్నాయి. అది ఫర్లాంగు దూరం దేదీప్యమానంగా వెలిగే టార్చిలైటు. వెలగడంలేదు. ఏమిటీ మిష్టరీ?

"ఒరేయ్, రాజేష్. క్విక్ టేబులుమీదున్న కర్ర లందుకో" అన్నాను.

నేను అక్కడే నిలబడ్డాను. ఒకరి నొకరు తప్పిపోతారన్నట్లుగా నలుగురూ కలిసి వెళ్ళినట్లు వారు కదలిన శబ్దాన్నిబట్టి గ్రహించాను. అయిదు నిమిషాలు గడిచాయి. కాని వాళ్ళు కర్రలు తేలేదు.

"ఏరా, ఎంత సేపు?" అసహనంగా అరిచాను.

"ఒరేయ్, టేబులు మీదుంచిన వస్తువులు ఒక్కటీ లేవురా." అందరూ ఏడుపు గొంతులతో అరచారు.

"బాగా వెతికారా?"

"ఆ!" మళ్ళీ అరిచారు. ఆఫీసు పెద్దభవనం కావడంతో ఒక్కో గొంతు పది గొంతులుగా ప్రతిధ్వనిస్తూ ఉంది.

"ఒరే! రండి....ఇలా ఇలా" అన్నాను. వాళ్ళు నా గొంతును బట్టి నన్ను చేరారు. వాళ్ళు నా కెదురుగా వచ్చి నిలబడిఉన్నారని ఆ చీకట్లో నే నూహించాను.

"డియర్ ఫ్రెండ్స్ మనం ఒకరికొకరం చాలా దగ్గరగా ఉన్నాం. చీకట్లో ఉన్నాం కాబట్టి దూరంగా ఉన్నట్లే లెక్క. మీ అందర్నీ ఒక్కొక్కరిగా పిలుస్తాను. విడివిడిగా పలకండి. తరవాత మీకు చెప్పాల్సింది చెబుతాను'' అంటూ "మిస్టర్ రాజేష్, వాసూ, దేవిడ్....పంతులూ" అంటూ పేరుపేరునా పిలిచాను.

అందరూ "ఎస్, ఎస్" అని జవాబిచ్చారు. వాళ్ళందరూ భయపడుతున్నారని అతి తేలిగ్గా తెలిసిపోతూ వుంది.

"మిత్రులారా! ఇప్పుడు మనం ఏదో పెద్ద ప్రమాదంలో చిక్కుకున్నామని భయపడకండి. దయ్యాలనేవి ఒకవేళ ఉంటే వాటికి మనంత ధైర్యంలేదని ఖచ్చితంగా చెప్పగలను. వాటికి ధైర్యమే ఉంటే ఇలా భయపడి చీకట్లో దాక్కోవు. వెలుతురులోనే మనతో ముఖాముఖి పోట్లాడేవి."

ఇంతలో ఫేర్‌కాపీ సెక్షనులోంచి టైపుమిషనుమీద టపటపా మని చప్పుడు మొదలయింది. మామూలుగా టైపు హయ్యరువాళ్ళు కొట్టేదానికంటె ఇంకా హైస్పీడుగా ఉంది టైపు. కొద్దిక్షణాల తరువాత ఇంకో టైపుమిషనుమీద కూడా టైపు మొదలయింది. జారిపోతున్న గుండెను చిక్కబట్టుకున్నాను.

"రాజేష్...." పిలిచాను. జవాబు లేదు. మిగతా వాళ్ళందరినీ పిలిచాను. ఎవరిదగ్గరనుంచి సమాధానం రాలేదు.

"టైపు చేసేది ఎవరు?" గర్జించాను.

టైపు శబ్దం ఆగిపోయింది. తరువాత కిలకిలమంటూ ఒక కన్నెపిల్ల నవ్వు అలలు అలలుగా తేలివచ్చింది. తరువాత ''హ్హా....హ్హా" అని ఒక పురుషగొంతు భయంకరంగా వినిపించింది.

"ఏయ్, ఎవరు మీరని అడిగితే నవ్వుతా రెందుకు?"

నవ్వు ఆగిపోయింది. ఒక అరనిమిషం భయంకరమైన నిశ్శబ్దం. తరువాత లౌడ్‌స్పీకరులోంచి మాట్లాడినట్లుగా, "మేం దయ్యాలం. మమ్మల్ని అంతుతేల్చు కోవడానికి వచ్చారే మీ కెంత ధైర్యం? నేను నా శతసహస్రకోటి దయ్యాల్ని పంపి మిమ్మల్ని ఎముకకు ఎముక, కండకు కండగా చీల్చి తింటాం. మీ కిక్కడ దిక్కెవరు?" మాట్లాడిన ప్రతిమాట దూరంనుంచి రీసౌండులో వినిపించాయి.

"ఒరేయ్ రాజేష్, పంతులూ, అందరూ వినండి. రానున్న ప్రమాదం రాక మానదు. మనం వెనక్కు తగ్గితే దేనికీ పనికిరాకుండా పోతాము. అందుకని మనం ప్రాణాలకు తెగించి పోరాడాలి. ఓ.కె." అన్నాను.

"ఓ. కె." అన్నా రందరూ. నాకు చాలా సంతోషం వేసింది.

"చూశావా, మోహినీ! వీళ్ళు మనతోనే తగాదాకి దిగారు. ఇక వీళ్ళకు నూకలు చెల్లినట్లే!" పురుషకంఠం అంది.

"అవును, పాపం. ఈ రోజుతో వీరి చరిత్రలు తెరమరుగవుతాయి." మోహిని కిలకిల నవ్వింది. తరువాత ఇద్దరూ పగలపడి నవ్వారు. ఆ నవ్వును భవనంలోని అన్నిగోడలూ ప్రతిధ్వనింపజేశాయి.

"ఫ్రెండ్స్, గెట్ రెడీ. రాజేష్! నువ్వూ, పంతులూ కుడిపైపు వెతకండి. వాసూ! నువ్వూ, డేవిడ్ ఎడమవైపు చూస్తూ రండి. నేను మధ్యలో ఉంటాను. ఎవరికి చిక్కినా ఏమాత్రం భయపడకుండా బంధించి వేయండి. ఎవరు ఎప్పుడు పిలిచినా అందరూ అటెన్షన్‌లో ఉండాలి. క్విక్. కదలండి" అంటూ అరిచాను.

అంతే. ఎవరి డైరెక్షన్‌లో వాళ్ళు అనుకున్నప్రకారం ఫేర్‌కాపీ సెక్షనులో ప్రవేశించాము. దూరంగా ఉచ్ఛ్వాస, నిశ్వాసలు వినవస్తున్నాయి. ఆ పైపు పరుగెత్తబోయి స్టూలు తన్నుకుని, బోర్లా పడ్డాను. ఇంకోపైపునుంచి కిలకిలా నవ్వు. ఆ వైపు పరుగెత్తబోతే అక్కడ టేబులుమీద టైపుమిషను గుండెని గుద్దుకుంది. మిగతావాళ్ళు కూడా ఇదే పరిస్థితిలో ఉన్నట్లు దూరంగా చప్పుళ్ళు వినిపిస్తున్నాయి. ఒకవైపునుంచి కిలకిల మని నవ్వు వినిపించడం, ఆవైపు వెడితే ఇంకో పైపునుంచి వినిపించడం—ఇలా చీకట్లో మా వేట ఒక అరగంట జరిగింది.

"అమ్మోయ్! నాయనోయ్! చచ్చాను. దయ్యం కడుపులో గుద్దింది!" కెవ్వున అరిచాడు డేవిడ్.

"డేవిడ్! నువ్వా! అయామ్ వెరీ సారీరా. మెత్తగా తగిలేసరికి దయ్య మని...." క్షమాపణ చెప్పుకున్నాడు వాసు.

ఇంతలో నన్ను తోసుకుంటూ ఒక ఆకారం ముందుకు పోసాగింది. క్షణం ఆలస్యం చేయకుండా ఎగిరి మీదపడి, కదలకుండా చేతులు వెనక్కి విరిచి పట్టుకుని ఇంకో చేత్తో గొంతు బిగపట్టాను.

"చెప్పు. ఎవరు నువ్వు? ఇంతసేపూ దయ్యంగా నటిస్తూ ఎందుకు మమ్మల్ని కలవరపెట్టావు" అంటూ కుదిలించాను.

ఆ ఆకారపు ఉచ్ఛ్వాస నిశ్వాసాలు భారంగా ఉన్నాయి తప్ప మాటల్లేవు.

"చెప్పు. ఎవరు నువ్వు, ఎక్కడ ఆ ఆడదయ్యం?"

ఆ ఆకారం తన మెడను అటూ ఇటూ గింజుకొంది.

"ఇప్పుడు చెప్పు" అంటూ గొంతు వదులుచేశాను.

"ఒరేయ్, ఆనంద్. నేను రాజేష్‌ని రా. అక్కడ దయ్యం నవ్వువిని పరిగెడుతూ ఉంటే నీ చేతిలో పడ్డాను. మాట్లాడనీకుండా నా గొంతు బిగిస్తివి." ఆయాసపడుతూ చెప్పాడు రాజేష్. నా చేతులు వాటంతట అవే జారిపోయాయి.

ఇంతలో భయంకరంగా అరిచాడు పంతులు. "ఇదిగో, దయ్యం పోతూంది. పట్టుకోండి.... బాబోయ్.... మెడమీద గుద్దింది." దబ్బున బోర్లాపడ్డ శబ్దం వినిపించింది. ఎవరెవరో పరుగెడుతున్న సవ్వడి. వెనకనే గాజులశబ్దం కూడా వినిపిస్తూ ఉంది.

అందరం పంతులున్న చోటికి పరుగెత్తాము. పంతులు ఫేర్‌కాపీ సెక్షను గుమ్మంముందు వెల్లకిలా పడిఉన్నాడు. బయటినుంచి ఎప్పుడూ లాక్ చేయబడే తలుపులు ఎలా తెరుచుకొన్నాయి అనేది అర్థంగాకుండా ఉంది.

"అదుగో దయ్యం.... పోతుంది.... పోతుంది........ పట్టుకోండి, పట్టుకోండి" అంటూ పిచ్చికేకలు పెడుతున్నాడు పంతులు.

ఇంతలో ఆ నిశీధిని చీల్చుకుంటూ మా వెనుకనుంచి భయంకరమైన పాట. 'నిను వీడని నీడను నేనే.... మదిలో కలగా....' ఏదో సినిమాలో పాట మవుత్ ఆర్గాన్‌మీద వినవస్తూ మమ్మల్ని దాటిపోతూంది. ఆ శబ్దంవెనుక కటిక చీకటిలో అస్పష్టంగా కనిపిస్తూ ఒక తెల్లని చీరచెంగు గాలిలో రెపరెపలాడుతూ వేగంగా పోతూ ఉంది.

"రేయ్! అందరూ పంతులుదగ్గరే ఉండండిరా" అని వాళ్ళను హెచ్చరించి దాని వెంబడి పరుగెత్తాను.

అందినట్టే అంది, దూరంగా పోతూఉంది. ఆ చీకట్లోనే తెలిసిన ప్రదేశం కనుక దాన్ని శక్తికొద్దీ తరిమాను. అది అలా నన్ను వేధించి కంట్రోలు రూము దగ్గర మాయమై పోయింది. నేను నిరాశగా వెనుదిరిగాను. పంతులు అలాగే పిచ్చిగా కలవరిస్తున్నాడు. నేనువచ్చిన పది నిముషాలకు మెర్క్యురీలైట్లు గుప్పున వెలిగాయి. ఇప్పుడు ఆఫీసంతా పట్టపగల్లా ఉంది. ఇక నేమాత్రం ఆలస్యం చేయకుండా అందర్నీ పురమాయించి పంతుల్ని చేతులమీద క్రిందికి మోసుకు వచ్చాము.

రోడ్డున పోతున్న ఓ ఆటోను పిలిచి పంతుల్ని దగ్గరలో ఉన్న హాస్పిటలుకు చేర్చాము. డాక్టర్ వెంటనే మత్తు ఇంజక్షను ఇచ్చాడు. పంతులు పిచ్చి కేకలు మాని నిద్రలోకి జారుకొన్నాడు. నేను ఈ విషయం వాళ్ళ తలిదండ్రులకు చెప్పడానికి బయలుదేరాను.

## 4

మరుసటి రోజు ఉదయం ముఖమంతా ప్లాస్టర్లతో, పీక్కుపోయిన ముఖాలతో, గీరుకుపోయిన చేతులతో వచ్చిన మమ్మల్ని చూసి అందరూ నవ్వారు. డేవిడ్ అయితే కాలు బెణికి కుంటుతున్నాడు. వాసూకి ఒక కన్ను వాచింది. చిన్న చిన్న దెబ్బలతో తప్పించుకొంది నేనూ, రాజేష్ మాత్రమే. నేను విషయాలేమీ చెప్పకుండా హాస్పిటలు పేరు చెప్పి 'పంతులుకు సీరియస్‌గా ఉంది. చూడాలనుకొన్న వాళ్ళు రండి' అన్నాను.

అందరం ఓ గంట పర్మిషన్ పెట్టి బయలుదేరాం. పంతులు మేం వెళ్ళేసరికి మత్తువిడిసి ఇంతకుముందులా పిచ్చిగా అరుస్తున్నాడు. పంతులు తల్లి కళ్ళొత్తుకొంటూ ప్రక్కనే కూర్చొని ఉంది. పంతులు తండ్రి నావైపు తినేసేటట్లు చూశాడు. ఇవన్నీ జరగడానికి మూల కారకుణ్ణి నేనేనని అందరూ నా గురించి గుసగుస లాడుకొంటున్నారు.

నేను డాక్టర్ని పరిస్థితి అడిగాను.

అతను నన్ను పక్కగదిలోకి తీసుకువెళ్ళి "మిస్టర్ ఆనంద్! ఇది మామూలు జ్వరం కాదు. మామూలు జ్వరం అయితే నేను వాడిన మందులకు ఎప్పుడో టెంపరేచరు కంట్రోలుకు వచ్చిఉండేది. ఇది భయంవల్ల ఏర్పడ్డ జ్వరం. సైకలాజికల్‌గా ఆ భయం తొలగేవరకూ జ్వరంపోదు. ఇలాగే అరుస్తూఉంటాడు" అని చెప్పాడు.

"అయితే ఏం చెయ్యమంటారు డాక్టర్?"

"దీనికి ఒకటే మార్గముంది. అతనిలో ఆ భయాందోళనలు తొలగిపోవాలంటే అదేవిధమయిన సన్నివేశం కల్పించి, తరువాత లైట్‌వేసి దయ్యాలు లేవని, వాళ్ళు మనుషులేననీ అతనికి తెలియజేయాలి. అప్పుడతను భ్రమలోంచి తేరుకొని యథాస్థితికి వస్తాడు...." అంటూ వేరేకేసు అటెండు కావడానికి వెళ్ళిపోయాడు డాక్టర్.

నేను ముందురాత్రి జరిగిన విషయం, డాక్టర్ సలహా అందరికీ వివరించాను. దయ్యాల విషయం కనుక ఎవరూ ముందుకు రాలేదు. అవంటే అందరికీ నమ్మకముంది.

"ఆనంద్!....ఆ మగదయ్యంగా నేను నటిస్తాను" అన్నాడు అశోక్ ఓ అయిదు నిముషాలు ఆలోచించి.

"నువ్వా!...." అన్నాను ఆశ్చర్యంగా.

"అవున్రా నేనే! ఓహో! భయస్తుడ ననుకున్నావు కదూ. నిజమే. ఒక అనవసర విషయం కోసం టైం వేస్టు చేసుకోవడం ఇష్టంలేక అప్పుడలా అన్నాను. కాని ఇప్పుడు అత్యవసర సమయం. ఒక ప్రాణాన్ని కాపాడాలి. పరోపకారార్థం ఇదం శరీరం" అన్నాడు వాడు దృఢంగా. అశోక్ చాలా తెలివిగలవాడు. పోస్టు గ్రాడ్యుయేట్ కూడా. వాడంటే అందరికి మంచి గౌరవం.

నేను లేడీస్‌వైపు చూశాను. అందరూ తలలు వంచుకున్నారు. మొదటిది దయ్యాలతో పేచీ అయితే, రెండవది ప్రేయసిగా నటించడం. ఎవరు ముందుకు వస్తారు?

"అలా నటించానని తెలిస్తే మా వాళ్ళు చంపేస్తారండి" అంది మంజుల భయంగా.

"అమ్మో! దయ్యాలతో నే!" గుండెమీద చెయ్యానించుకుంది రజని.

ఇక ఆడవాళ్ళలో ఎవరూ రారని తీర్మానించుకుని ఒక లేడీ ఆర్టిస్టుని దీని కోసం వినియోగిద్దామనుకున్నాను.

"నేను ఆ మోహినీ పిశాచిగా నటించడానికి సిద్ధం" అంది రాగిణి ప్రశాంతంగా.

ఆడవాళ్ళంతా ఆమెవైపు అసహ్యంగా చూశారు, ఇంతకు తెగించిందా అని. నేను ఉలిక్కిపడ్డాను. ఆమె ఆ విధంగా నటిస్తానన్నా ఒప్పుకోను. ఎందుకంటే, దేవుడు ఆ అమ్మాయినుదుట కష్టాలే రాసిఉన్నాడు. భర్తచే వదిలివేయబడ్డ స్త్రీగా నా కామెమీద సానుభూతి ఉంది. మిగతా ఆడవాళ్ళు ఆమెను గురించి చెవులు కొరుక్కుంటూంటే ఒక మూలచేరి కన్నీరు తుడుచుకోవడం చాలాసార్లు చూశాను.

"నువ్వు వద్దు, రాగిణీ! నేనో డ్రామా ఆర్టిస్టును మాట్లాడుతాను."

''ఇందులో అంత అవమానపడాల్సిన విషయ మేముందండి? ఒకవేళ నా సోదరుడే ఆ పరిస్థితిలో ఉంటే ఆదుకోవడం నా ధర్మం కాదంటారా?" అంది.

ఆమె కళ్ళలో తడి. నేనేం మాట్లాడలేకపోయాను. మనసులోనే ఆమె విశాల హృదయానికి జోహారు లర్పించాను.

ఆ రోజు తీరికున్నప్పుడల్లా వాళ్ళచేత ఆ మాటలు చెప్పించి, వాళ్ళిద్దరికి ట్రెయినింగు ఇచ్చాను. మొదట్లో మోహినిలా నవ్వడానికి చాలా అవస్థ పడింది రాగిణి. అశోక్ గొంతు అంత గంభీరంగా ఉండటంలేదు. గరకు రావడంకోసం ఒక రకమయిన చాక్లెట్లు కూడా చప్పరించాడు. ఎలాగయితేనేం, రాత్రి ఏడు గంటలకు కార్యక్రమం నిర్ణయమయింది.

డాక్టర్ నా కోరికమీద అక్కడకు రావడానికి అంగీకరించాడు. ఆ వింత చూడ్డానికి చాలామంది వచ్చిచేరారు 'పై' సెక్షన్లో. డాక్టరు వాళ్ళెవరూ మాట్లాడ కూడదని, చాటుగా ఉండాలని హెచ్చరించాడు. మేము పంతుల్ని పైకి తీసుకు వస్తున్నాము. పంతులు పెద్దగా అరుస్తున్నాడు "అదుగో దయ్యం. పోతూంది. పట్టుకోండి, పట్టుకోండి" అంటూ. మేము బలవంతంగా అతణ్ణి 'డి' సెక్షను హాల్లోకి లాక్కొచ్చాము.

డాక్టరు ఆజ్ఞను పురస్కరించుకుని ఒకడు వెళ్ళి మెయిన్ ఆఫ్ చేశాడు. అంతా చీకటి. గాఢాంధకారం. ఆలస్యం లేకుండా నాటకం మొదలయింది. ఫేర్ కాపీ సెక్షనులో రెండు మిషన్లమీద టైపు చేస్తున్నట్లు శబ్దమయింది.

"ఎవరు టైపు చేసేది?" అరిచాను. తరవాత వాళ్ళ డైలాగులూ, నవ్వులూ వినిపించాయి. సన్నివేశం పకడ్బందీగా జరిగింది.

"అదుగో దయ్యం. పోతూంది. పట్టుకోండి పట్టుకోండి." పంతులు పిచ్చి కేకలు ఎక్కువయ్యాయి. టప్పున లైట్లు వెలిగాయి.

"మిష్టర్ పంతులూ! వాళ్ళు దయ్యాలు కారు. మనవంటి మనుషులే. చూడు" అంటూ ఫేర్‌కాపీ సెక్షనులో పైపుమిషన్ల ముందు కూర్చొనిఉన్న అశోక్‌ను, రాగిణిని చూపించాడు డాక్టరు.

అంతవరకు సగం కళ్ళు మాత్రమే తెరిచి అదోలోకంలో ఉండి మాట్లాడే పంతులు ఇప్పుడు కళ్ళు పూర్తిగా విప్పార్చి చూశాడు.

"అయితే. అయితే వాళ్ళు దయ్యాలు కారూ...." ఆశ్చర్యంగా అడిగాడు పంతులు.

"కాదు. మనలాంటి మనుషులే. భ్రమలు వదలిపెట్టు, పిచ్చి పంతులూ" అన్నాను భుజం తట్టి. పంతులు ఆ దృశ్యంతో చాలా రిలాక్సయ్యాడు. డాక్టరు ఇంకేం భయముండదని నాకు హామీ ఇచ్చాడు. పంతుల్ని మెల్లిగా నడిపించుకుని వచ్చి రిక్షాలో కూర్చోపెట్టాము.

నేను రాత్రంతా ఆలోచించాను. పంతులుకు దయ్యాలు లేవని ఎలాగో మభ్య పెట్టాము. పోతే, అసలు దయ్యాలసంగతేమిటి? అది ఎప్పటికయినా తేలవలసిన సంగతే గదా! మరుసటిరోజు అర్ధరాత్రి నేనొక్కడ్నే బయలుదేరాను. ఆఫీసు వెనుకనున్న శ్మశానంలోంచి గోడదూకి ఆఫీసు కాంపౌండులో ప్రవేశించాను. భవనం వెనుకనున్న పైపు పట్టుకొని మేడమీదికి చేరి వేకువజాము నాలుగు వరకు ఆఫీసు మూలమూలలా వెతికాను. నాకేం కనిపించలేదు.

*　　*　　*

మరురోజు ఉదయం పది గంటలకు నేను ఆఫీసులో ప్రవేశించగానే "సార్, మీకోసం ఈ కుర్రాడు ఇందాకట్నుంచి ఎదురుచూస్తున్నాడు" అంటూ ఓ కుర్రాడ్ని చూపించాడు అటెండరు ఆదెయ్య.

వాడికి షుమారు పదిహేను సంవత్సరాలుంటాయి. నన్ను చూడగానే నమస్కారం పెట్టి నాకో ఉత్తరం అందించాడు. కవరుమీద నా అడ్రస్ మాత్రమే ఉంది. ఫ్రం అడ్రస్ లేదు.

"సార్, ఈరోజు ఉదయం ఏడు గంటలకు భార్యాభర్తలమని ఓ జంట మా హోటల్లో దిగారు సార్. తొమ్మిదిగంటలప్పుడు నన్ను పిలిచి ఈ కవరిచ్చి, సాయంత్రం నాలుగుగంటలప్పుడు ఈ అడ్రసుగల ఆయనకు ఇవ్వమన్నారు సార్. ఏ పరిస్థితుల్లోనూ ముందుగా ఇవ్వకూడదని ఖచ్చితంగా చెప్పి, బహుమతిగా ఓ యాభై రూపాయలు కూడా ఇచ్చారు సార్ వాళ్ళ పరిస్థితికి నాకెందుకో భయమేసి బజారుపనిమీద వచ్చి మీ కందిస్తున్నాను. ఇక నేను వెళ్తానుసార్" అంటూ వెళ్ళిపోయాడు హోటలు కుర్రాడు.

నేను ఆశ్చర్యంగా కవరు చించాను.

"మై డియర్ ఆనంద్,

ఇలా నీకు ఉత్తరం రాయవలసివస్తుందని నేననుకోలేదు. స్నేహానికి ప్రాణమిచ్చేవాడివి, నీకుకాక మా ఆవేదన మరెవ్వరికి చెప్పుకోము.

నేను హైదరాబాదులో కాలేజీ చదివే రోజుల్లో ప్రేమలో పడ్డాను. ఒక దేవతను ప్రేమించాను. గుడిలో దేవుడిమీద ప్రమాణంచేసి ఆమె మెడలో తాళి కట్టాను. మానసికంగా, శారీరకంగా ఒకటయ్యాము. కాని విధి వైపరీత్యం....

చదువు కాగానే ఇంటికి వెళ్ళాను. రెండు, మూడు నెలలు గడవనిచ్చి విషయం చెప్పాను. మా తల్లితండ్రులు నామీద ఎగిరిపడ్డారు ఆస్తిలో భాగ మివ్వనన్నారు. కుటుంబంతో సంబంధాలు ఇంతటితో తెగిపోయినట్లే అన్నారు. నిన్ను కష్టపడి చదివించినందుకు మాకు ప్రతిఫలం ఇదా అన్నార.

ఆరు నెలల వాగ్యుద్ధం తరువాత అన్నిటినీ తెగతెంపులు చేసుకొని నేను హైదరాబాదు వచ్చేశాను. నా దేవత కనిపించలేదు. వాళ్ళకుటుంబం అక్కడనుంచి ఎటో వెళ్ళిపోయిందని తెలిసింది. ఇంకో ఆరునెలలు పిచ్చివాడిలా హైదరాబాదు అంతా గాలించాను కాని వాళ్ళ ఆచూకీ తెలుసుకోలేకపోయాను.

చివరకు ఇంటికి వచ్చిన నాకు ఆర్థికంగా చితికిపోయిన కుటుంబ పరిస్థితులు నన్ను విచలితుణ్ణి చేశాయి. అప్పుల్లో ఉన్న కుటుంబాన్ని ఆదుకోవడం, తమ్ముళ్ళనూ, చెల్లెళ్ళనూ వో దారికి తేవడం నా ధర్మం అనుకొన్నాను. చిన్నదో, పెద్దదో ఒక ఉద్యోగం సంపాదించుకొన్నాను.

నేను ఉద్యోగంలో చేరిన రెండోరోజే అదే ఆఫీసులో జాయినింగు రిపోర్టు ఇచ్చిన నా దేవతను చూసి మురిసిపోయాను. నేను ఆనాడు కట్టిన పసుపుతాడు అలాగే ఉంది. ఆమె స్వచ్ఛమయిన ప్రేమకు నా గుండె చలించింది. ఆమె వ్యథాభరిత హృదయంతో మాట్లాడలేకపోయింది.

ఆమెకు నామీద కోపమేమో అనుకొన్నాను. సాయంత్రం పోతూపోతూ ప్రకాశం పంతులు పార్కులో కలుసుకోమని సంజ్ఞ చేశాను. ఆ సాయంత్రం పార్కులో కలుసుకొన్నాము. ఆమెమాటలు విన్నతర్వాత ఆమెకు నా మీద ప్రేమ ఏమాత్రమూ తగ్గలేదని గ్రహించాను.

తను ఆరోజు తాళితో ఇంటికి వెళ్ళిందని, తన తల్లితండ్రులు అదిచూసి కులంకాని వాణ్ణి చేసుకున్నందుకు మండిపడ్డారని, వెంటనే తాళి తెంపెయ్యమని

పట్టుపట్టారని చెప్పింది. తాను చావనైనా చస్తానుగాని, అతనే నా భర్త అందట. దాంతో వాళ్ళు ఒకేఒక శపథం చేశారట....అతన్నే గనుక భర్తగా ఎంచుకుంటే రెండోరోజే తాము శవాలుగా మారుతామని. వాళ్ళు అంతపనీ చేస్తారని భయపడి, తన పెళ్ళిమాట ఎత్తకూడదని హెచ్చరించి తాను ఒంటరిగా ఉండిపోయినట్లు నాతో చెప్పింది.

సంఘం దృష్టిలో మేము అపవిత్రులంగా చిత్రించబడేందుకు వీలులేకుండా ఈ విషయం సీక్రెట్‌గా ఉంచాము. ఏనాటికైనా మంచిరోజులు రాకపోతాయా అని ఒకరి కొకరం సర్దిచెప్పుకున్నాము.

మనసా, వాచా ఒకటైన మేము ఇంకెంతకాలం దూరంగా ఉండగలం? అందుకే రాత్రిపూట ఆఫీసులో ఫేర్‌కాపీ సెక్షనులో కలుసుకునేవాళ్ళం. ఒకరి కష్టాలు మరొకరికి చెప్పుకొని ఓదార్చుకోనేవాళ్ళం. అర్ధరాత్రివేళ మేము కలుసుకోవాలంటే వాచ్‌మన్ సహాయం కావాలి. అందుకే యానాదితో మాట్లాడి నెలకో యాభై ఇచ్చే ఒప్పందంమీద అతన్ని దీనికి ఒప్పించాము.

ఆ రోజు దయ్యాల పరిశోధనలో పాల్గొనేముందు నేను, నా ప్రేయసి ఈ విషయంలో చాలావరకు ప్రతిఘటించాము. ఎందుకంటే, మా విషయం బయట పడుతుంది. మీరు నిజంగా రంగంలోకి దిగేసరికి, మిమ్మల్ని హడలు పుట్టించాలని యానాది సాయం కోరాము. అతను అంగీకరించాడు.

మొదట మిమ్మల్ని ఫోనులో భయపెట్టింది, తరువాత ఫేర్‌కాపీ సెక్షన్ తలుపులు తీసి మవుత్ ఆర్గానుమీద పాడుతూ వెళ్ళింది యానాది. చీకట్లో ఎంతోకాలం నుంచి అలవాటు అయింది కనుక మిమ్మల్ని కలవరపెట్టి అతి తేలిగ్గా తప్పించుకోగలిగాము. ఇంత చేశాడని యానాదిని ఏమీ అనకండి. అతను సహాయంచేసింది డబ్బుకోసం కాదు....మా పవిత్రమయిన ప్రేమను చూసి. కనుక అతని ఉద్యోగానికి ఏమాత్రమూ భంగం రానీయకండి. ఆ రోజు పంతులు ఆరోగ్యంకోసం దయ్యాలుగా నటించమంటే అసలు దయ్యాలం మేమే కాబట్టి, ఆ పాత్రల్లో జీవించి సన్నివేశం రక్తికట్టించాము.

ఫ్రెండ్, ఇక యానాది మాకు సహాయం చేయలేదు. మా జీవితాలకు అంతంలేదేమో అనుకొంటున్న మాకు పరిష్కారం దొరికింది. కొంతమంది చావుకు కారణమై మేము సంసారం చేసేకంటే, మేమే ఈ లోకంనుండి తప్పుకోవడం ఎంతో మంచిదని నిర్ణయించుకొన్నాము. చరిత్రలో ప్రేమ కథలన్నీ విషాదాలే! ఇప్పుడు రాగిణి గర్భవతి కూడా. ఆమె కెన్ని అపవాదులో!

తీరని కోరికలు వచ్చే జన్మలోనయినా తీర్చుకుందామనే ఉద్దేశంతో వినోదా లాడ్జిలో ఇద్దరం కలిసి ఆత్మహత్య చేసుకుంటున్నాం. మా చావుకు కారణం నీవేమోనని బాధపడకు. అపరిష్కృతంగా వున్న మా సమస్యకు ఏనాటికయినా పరిష్కారం ఇదే. మా ఆత్మహత్యకు మేమే బాధ్యులమని, ఆ మేరకు హామీ పత్రం టేబులుమీ దుంచాము. నిజమైన ప్రేమ ఎప్పుడూ బలికోరుతుంది మిత్రమా.

సమయ మాసన్నమైంది. ఇక సెలవు, సోదరా !

జన్మజన్మలకూ నీలాటి మిత్రులే కావాలని కోరుతూ,

....అశోక్."

నా కళ్ళలోంచి కన్నీళ్ళు ఏకధారగా కారసాగాయి. సినిమా రీళ్ళలా జరిగిన సంఘటనలు ఒక్కొక్కటీ గుర్తుకొచ్చాయి. చీకట్లో ఒక టేబులుమీద పెట్టిన వస్తువుల్ని ఇంకో టేబులుమీద వెతకడం, టెస్టుచేయకుండా ఎక్స్పయిర్డ్ సెల్సున్న టార్చిలైటును పట్టుకొచ్చి వెలగలేదనుకోవడం జరిగింది. యానాది పెద్ద మోనో ఏక్టర్. ఫంక్షన్స్‌లో ఎన్నోసార్లు స్టేజిమీద మిమిక్రీ చేసి జనాన్ని మైమరపించాడు. మమ్మల్ని ఆఫీసులో వదలిపెళ్ళిన తరువాత దూరంనుంచి ఫోనులో రకరకాల గొంతులు పలికాడు. తరువాత మెయిన్ అఫ్ చేసి మమ్మల్ని భయపెట్టాడు.

నా చేతిలోంచి ఉత్తరం ఎప్పుడో జారిపోయింది. అది అందుకొని పెద్దగా చదివాడు రాజేష్. అందరి గుండెలూ దుఃఖభార మయ్యాయి.

మూఢ విశ్వాసాలతో, మత తత్త్వాలతో వెనుకకు పయనిస్తున్న ఛాందస ప్రపంచం, సాంకేతిక పరిజ్ఞానంతో, సువిశాల భావాలతో, భాషలను, నాగరికతలను ఏకంచేసి ముందుకు పయనించే ఈ ఆధునిక ప్రపంచం ఒకటయ్యే దెప్పుడో ? ఈలోగా ఈ రెండు పరిస్థితుల మధ్య నలిగే జీవితా లెన్నో ?

నాలో చలనం వచ్చింది. తట్టుకోలేకపోయాను.

"మిత్రమా అశోక్, సోదరీ రాగిణీ. ప్రేమ ఎప్పుడూ బంధాల్ని శాశ్వతం చేస్తుంది కాని బలిని కోరదు. మిమ్మల్ని నేను రక్షించుకొంటాను." అరుస్తూ పరుగెత్తాను